శ్రీ

# ఆంధ్ర - రత్నావళీ నాటిక

[శ్రీహర్షరచితమునకు ఆంధ్రమున అనువాదము]

వేదము వేంకటరాయశాస్త్రి

ప్రణీతము

ద్వితీయముద్రణము

వేదము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్.

4. మల్లికేశ్వరగుడిసందు, మన్నడి.

జి. టి. మదరాసు.

1937



దీని వెల రు 1-4-0

# విజ్ఞప్తి.

---

కడచినవత్సరము జూలైమొదలు ఆముక్తమాల్యదకు తత్పూర్వలిఖితావశిష్టమైన టీకను వ్రాయుచుంటిని. అది నవంబరులో సమాప్తింజేసినది. అందులకైన పరిక్లేశము వలన అనారోగ్యము కైకొనినది. తత్సహాయముగా డిసెంబరు జనవరినెలలలో రత్నావళీవిక్రమోర్వశీయములను ఆంధ్రీకరించితిని.

ఆవృత్తాంతమును—పూర్వము మదీయమాళవికకు ముద్రణవ్యయము నొసంగిన వారు కావ్యనాటకాదివాఙ్మయరసజ్ఞశిఖామణులు విడవలూరుగ్రామవాస్తవ్యులు పంట కులవతంసులు సదాచారధురంధరులు

నెల్లూరిలో నిధిపతులు

## శ్రీయుత - దొడ్ల రామిరెడ్డిగారు

విని, అత్యంతప్రీత్యుత్సాహములతో ఏతద్రచనంగూర్చి తమయభినందనముందెలుపుచు ఏతద్గ్రంథద్వయముద్రణమునకు పర్యాప్తమైనధనమును నాకుం బంపినారు.

శ్రీరామిరెడ్డిగారు 20 ఏండ్లకుముందు విక్రమోర్వశీయము నాంధ్రీకరింపుమని హెచ్చరించిరి. వారి యాయాప్సితము నావలన ఇప్పటికి నెఱవేఱినది.

నాదు ప్రజ్ఞారిక్తగ్రంథనమునకు ముద్రణార్థము అప్రార్థితముగా తోడ్పడినట్టి యా సరస్వతీసరస్వత్పుత్రీలాలితునికి అత్యంతకృతజ్ఞుఁడను.

ఆయత్తాకోదండ్రిరువురును శ్రీరెడ్డిగారికి విద్యకన్న ఐశ్వర్యమును ఐశ్వర్యము కన్న విద్యను పోటీలుమెఱసి యొసంగుచుందురుగాక.

అక్టోబరు, 1921. మదరాసు　　　　వేదము వేంకటరాయశాస్త్రి.

ఈముద్రణమున విద్యార్థులయుపయోగార్థము మా మిత్రులు శ్రీ ధరణికోట వేంకటసుబ్బయ్య, ఎమ్. ఏ., బి, ఇడి., 'ఉభయభాషాప్రవీణ' శ్రీ సంగుభొట్ల నారాయణశర్మగారలు రచించిన వివరణోపోద్ఘాతములను చేర్చితిమి. శ్రీ తాతగారు ఉత్తర రామచరితోపోద్ఘాతమున రచించిన 'నాటకలక్షణప్రతిని' కొలఁదిమార్పులతో నిందు ముద్రించితిమి. శ్రీతాతగారే తమ సొంతప్రతిలో సూచించియుండిన పలువిషయము లను వివరణవశమున మామిత్రులు హెచ్చరించియేయున్నారు. ఈముద్రణమును సర్వ విధముల విద్యార్థి సుగమముగా నెఱవేర్చినారము. ఇందు మాకుతోడ్పడిన మామిత్రు లకు ఇవె మావందనములు.

జూను. ౧౯౩౨ మదరాసు.　　　　ప్రకాశకులు.

# రత్నావళీపరిష్కారము.

"చాతుర్విధ్య మనుష్య పఙ్క్తిజభువా దేవేభ్య ఉత్థాపితం,
కర్తుం భూత భవిష్యతో రల మిదం ప్రత్యక్షతా మర్థయోః,
అంగత్వం ప్రతిపాద్య చాస్య సకలాః కామం స్వదంతే కలాః,
సామ్రాజ్యస్యఫలం న కస్య హృదయోల్లాసాయ నాట్యామృతమ్"

## శ్రీహర్షుఁడు, తద్గ్రంథములును.

సంస్కృతమున రత్నావళీనాటికను రచియించినవాఁడు శ్రీహర్షుఁడు. ఆయన ప్రియదర్శిక, నాగానందము అను మఱిరెండు దృశ్యకావ్యములఁ గూడ సంతరించియున్నాఁడు. ఈ మూఁడురూపకములందును "ఇంద్రోత్సవము" (నాగా) "వసంతోత్సవము" (రత్నా) "సిద్ధరాజచరితము" (నా.గా) "వత్సరాజచరితము" (ప్రియ. రత్నా)- అను నలఁతి మార్పులు-ప్రకృతోపయోగమునకై చేయఁబడినవి - ఒకటి రెండు దక్క, ప్రరోచనయు, ప్రస్తావనయు ఒకటిగ నేయున్నవి. అంతియ గాక "వ్యక్తిర్వ్యంజనధాతునా", "అంతఃపురాణాం విహితవ్యవస్థః". అను రెండు శ్లోకములు నాగానంద ప్రియదర్శికలలో సమానములు. మఱియు ప్రియదర్శికా రత్నావళులలో భరతవాక్యశ్లోకమొకండే. ఇత్యాదికారణములచే నీరూపకత్రయము నేకకవి కృతమని చెప్ప నొప్పును.

## శ్రీహర్షుని కాలము.

శ్రీహర్షులు పెక్కురున్నట్లు చరిత్రచేఁ దేటపడుచున్నది. అందు ఈరూపకత్రయ ప్రణేతను నిర్ణయించుటయందు మతభేదములు కలవు. నైషధమును విద్వదౌషధముగా రచియించిన శ్రీహర్షుఁడొకఁడు కలఁడు. ఆయనరత్నావళ్యాదులకవి కాఁడు. ఈ మామల్లదేవీహీరపండితపుత్త్రుఁడగు నైషధశ్రీహర్షుఁడు తనవిగాఁజెప్పికొన్న గ్రంథములలో రూపకములు లేవు. రత్నావళ్యాదులు లేనేలేవు. గ్రంథశైలియందును భేదము మిక్కుటముగఁ గలదు. కన్యాకుబ్జేశుఁడగు జయంతచంద్రునియాస్థానమున నితఁడు ఆసన తాంబూలద్వయము మర్యాదలఁ బొందుచుండినట్లు నైషధమునఁ జెప్పికొనియున్నాఁడు. దానశాసనములచే ఈజయంతచంద్రుని కాలము క్రీ. శ. 12-వ శతాబ్దమని చరిత్రకారనిర్ణయము. రత్నావళ్యాదికృతికర్త

ఇతనికన్న మిక్కిలి ప్రాచీనుఁడని ప్రమాణాంతరములచే నిర్ణీతము. మఱియు నితఁడు రాజు కాఁడు. రత్నావళీ శ్రీహర్షుఁడన్ననో, తద్రూపక ప్రస్తావనలంబట్టి రాజనియు, "నానాదిగ్దేశాగతరాజు లనేకులు తత్పాద పద్మోపజీవులనియు" తేటపడుచున్నది. అందుచే వీరిరువురు భిన్నులని తేలినది.

మఱి ప్రకృతహర్షుఁడు రాజతరంగిణియందు కాశ్మీరదేశాధీశుఁడుగ నభివర్ణితుఁడని విల్సనుపండితుని యాశయము అందితఁడు కవియని కలదుగాని ప్రియదర్శికానాటకములు తత్ప్రచితములని లేదు. అదియుంగాక అతఁడును క్రీ. శ. 12-వ శతాబ్దమువాఁడని చరిత్రకారులు తెల్పియుండ, రత్నావళ్యాదుల ప్రణేత ఇంతకును బూర్వుఁడని ప్రమాణములు కానవచ్చుచున్నవి. క్రీ. శ 1042 కాలపువాఁడు భోజుఁడు తన సరస్వతీకంఠాభరణమునందును, తత్పితృవ్యుఁడగు ముంజభూపాలుని యాస్థాని నలంకరించిన యాలంకారికసోదరులు ధనికధనంజయులు దశరూపక తదవలోకములయందును రత్నావళ్యాదిరూపకములనుండి శ్లోకముల నుదాహరించియున్నారు. అందుచే నీ శ్రీహర్షుఁడు కాశ్మీరదేశాధీశుని కన్న వేఱనియుఁ, దత్పూర్వుఁడనియుఁ దెల్లముకదా.

దామోదరగుప్తుఁడు క్రీ. శ. 8-వ శతాబ్దమున కాశ్మీరము నేలిన జయాపీడునిమంత్రి-స్వవిరచిత కుట్టినీమతములో "ఉదయగిరితటాంతరిత మియం" అను రత్నావళీప్రథమాంకస్థశ్లోకము నుద్ధరించుటేగాక, రత్నావళికథ చెప్పి,—

"ఆశ్లిష్టసంధిబంధం రత్నావళీరత్నమ్" అని కొనియాడి యున్నాఁడు అందుచే రత్నావళికవి 8వ శతాబ్దికిని బూర్వుఁడు కావలెను.

ఇఁక, స్థానేశ్వర కన్యాకుబ్జేశ్వరుఁడును, ఆర్యావర్తము నేలిన వాఁడు నగు శ్రీహర్షవర్ధనుఁ డొకఁడు కలఁడు. ఆయన యశోవతీ ప్రభాకరవర్ధనుల పుత్త్రుఁడు ప్రకృతదృశ్యకావ్యరచయిత అతఁడేయగునని పెక్కురు చరిత్రకారుల యభిప్రాయము. ఈ శ్రీహర్షవర్ధనుఁడు క్రీ. శ. 7వ శతాబ్దపు బ్రథమార్గమువాఁడు. తదాస్థానకవిగానుండిన భట్టబాణుఁడు ఈతనిచరిత్రమునే "హర్షచరిత్ర" మను నాఖ్యాయికగా రచించెను అందు భట్టబాణుడు శ్రీహర్షవర్ధనుని మహావిద్వాంసునిగా నభి

వర్ణించినను రత్నావళ్యాది రూపకకర్తనుగాఁ జెప్పలేదు. హర్షచరిత్ర హర్షవర్ధనుని పూర్వచరిత్రముతోనే సమాప్తమగుటచేతను, ఆ పూర్వ భాగము యుద్ధమును ముగియుటచేతను, హర్షచరిత రచనా కాలమున కతఁడు రూపకముల వ్రాయమియు, తర్వాత వ్రాయుటయు, అందు చేతనే బాణుఁడు హర్షచరితమునఁ జెప్పమియు సుసంభవములే. ఇదిగాక, బాణభట్టుని శ్వశురుఁడగు మయూరకవి రచియించిన సూర్యశతః మునకు మధుసూదనుఁడు, క్రీ. శ 1658 ప్రాంతమున వాని భావబోధిని యను వ్యాఖ్య వ్రాసి, అందు బాణాభివర్ణితుఁడగు శ్రీహర్షుఁడే రత్నావళీ నాటక కవియని వక్కాణించియున్నాఁడు. శ్రీహర్షుని మరణానంతరము భారతదేశమునకు వచ్చిన చైనాదేశయాత్రికుఁడు ఇత్సింగు స్వయాత్రో దంతమునందు "శీలాదిత్యమహారాజు (ఇది హర్షవర్ధనునికి నామాంత రము) బోధిసత్వ జీమూతవాహనునికథను రచియించి, నేర్పరులైన నటులచేత దానినాడించి బహుజనీన మొనర్చెను" అని వ్రాసెను. ఈవాక్యములు నాగనందమును గూర్చినవని పెక్కురు చరిత్రకారుల యభిప్రాయము.

ఈ మూఁడునాటకముల నాందీశ్లోకములు శ్రీహర్షవర్ధనుని మతా శయముల పరిణతిని జాటుచున్నవి. ఎట్లన శ్రీహర్షుఁడు మొదట శైవ మతావలంబిగానుండెను. ఇందులకు బాణుని హర్షచరిత్ర ప్రమాణము. మఱియు,

"పరమసౌగతః సుగతఇవ పరహితైకరతః పరమభట్టారక మహా రాజాధిరాజ శ్రీరాజ్యవర్ధనః తస్యానుజస్తత్పాదానుధ్యాతః పరమ మాహేశ్వరో మహేశ్వర ఇవ సర్వసత్వానుకంపీ పరమభట్టారక మహా రాజాధిరాజ శ్రీహర్షః...స్వహస్తోమమ మహారాజాధిరాజ శ్రీహర్షస్య" అని హర్షశకము 22 లో, అనఁగా క్రీ. శ. 628-629 లో, తాను రాజ్యాధికారము దాల్చిన యిరువదిరెండేండ్లకుపిమ్మట, వ్రాయఁబడిన శ్రీహర్షవర్ధనుని యీ (బన్స్ఖేరా) శాసనవాక్యములును ప్రమాణములు. ఇందుకు అనుగుణములై ప్రియదర్శికారత్నావళుల నాందీశ్లోకములు ఆయన శైవమతాభిమానసూచకములుగానున్నవి. అనంతరము హ్యూయానుత్సాంగు ప్రోత్సాహమున శ్రీహర్షుఁడు బౌద్ధమత మవలంబించె నని చరిత్ర నుడువుచున్నది. నాగానంద నాంది జినస్తోత్ర పరముగుటయు,

నాటకము బౌద్ధమత ప్రధాన సిద్ధాంతసాధనమునకై నాగులయానంద మునకై శరీరమును సమర్పించినజీమూతవాహనబోధిసత్త్వునికథ యగుటయు, శ్రీహర్షుని నవీనమతావలంబనమునకు సరిగ నున్నది. ఈ కారణము చేతను ఈనాటకముల మూఁటిని రచించినవాఁడు శ్రీహర్షవర్ధనుఁడేయని సిద్ధాంతిత మగుచున్నది.

రత్నావళ్యాదిరూపకములకవి శ్రీహర్షుఁడు కాఁడనియు భాసుఁడను పేరిటి ధావకుఁడు (=చాకలి) ఘటకర్పర కావ్యరచయిత, రత్నావళ్యాదినాటకముల రచియించి ధనాశచే తన కాశ్రయుఁడైన శ్రీహర్షుని పేరు పెట్టినట్లు రాజశేఖరుఁడు (క్రీ. శ 10 శ) చాటినాఁడు. మమ్మటుఁడును కావ్యప్రకాశికలో కావ్యప్రయోజనములను "కావ్యం యశసేఽర్థకృతే" అని చెప్పుచు, "అర్థకృతే" అనుదానికి "శ్రీహర్షాదే ర్ధావకాదీనాం ధనమ్" అని ఉదాహరణము చెప్పెను. వ్యాఖ్యాతలు,—

"శ్రీహర్షో రాజా, ధావకో రత్నావళీకారః, తేన రాజనామ్నా రత్నావళీ కావ్యంకృత్వా ధనంలబ్ధమ్" అని మహేశ్వరపండితుఁడును-

శ్రీహర్షస్య రాజ్ఞోనామ్నా రత్నావళీనాటకంకృత్వా ధావకాఖ్యకవి ర్బహుధనం లేభే ఇతి ప్రసిద్ధమ్" అని ప్రభాకరుఁడు వివరించిరి. అనుపపత్తులు పెక్కులుండుటచే ఈమతము సరి కాదు. ఈధావకుఁడు భాసుఁడే యగుచో, భాసుఁడు కాళిదాసునిచే (మాళవికలో) "ప్రథితయశసాం భాససౌమిల్లక కవి పుత్త్రాదీనాం" అని కీర్తింపఁబడిన వాఁడు కావున కాళిదాసునికంటె పూర్వుఁడు కావలయును. అందుచే శ్రీహర్షుఁడును కాళిదాసునికిఁ బూర్వుఁడగును. దానికిఁజాలిన ప్రమాణము లేవియు నుపలబ్ధములు కాకపోవుటే కాక, రత్నావళ్యాదులందు కాళిదాసుని గ్రంథానుకరణములు పెక్కులు గానవచ్చుచుండుటచేతను అది సరి కాదు. మఱి ఈకష్టము తప్పించుకొనుటకై మఱియొకభాసుని కల్పించి, ఆభాసుని నిలువఁబెట్టుటకై కొందఱు పెక్కు ప్రయాసముల పాలైనారు. ఇందులకై శారందారంజనరేగారి పీఠికలోఁ గనవచ్చును. ఇట్టి కల్పనమునకు మత్తేయాధారమును లేదు కావున వ్యర్థము. మఱి కావ్యప్రకాశికా వాక్యమునకు "బాణాదీనాం ధనమ్" అనియుఁ బాఠాంతరము కలదు. తనసుపారి హాలుపండితుఁడు

రత్నావళిని బాణవిషయము చేసినాఁడు. బాణుఁడు శ్రీహర్షునినుండి యపారధనముఁ గైకొనుట కనేక ప్రమాణములు కలవు.—

"హేమ్నాంభారశతానివా, మదముచాం బృందాని వా దంతినాం,
శ్రీహర్షేణ సమర్పితానికవయే బాణాయ కుత్రాద్యతే,
యా బాణేన తు తస్యసూక్తినికరై రుట్టంకితాః కీర్తయః"

సారసముచ్చయము.

శ్రీహర్షో వితతార గద్యకవయే బాణాయ వాణీఫలమ్,
సద్యస్సత్క్రియ యాభినందమపిచ శ్రీహర్షవర్షోగ్రహీత్.

రామచరితమహాకావ్యము.

స్వయముగ బాణుఁడే హర్షచరితమున,—

"స్వల్పైరేవచాహోభిః పరమప్రీతేన ప్రసాదజన్మనో మానస్య ప్రేమ్ణో విస్రంభస్య ద్రవిణస్య నర్మణః ప్రభావస్య పరాంకోటి మానీయత రాజేంద్రేణ." అని.

కాని వీనిలో నీధనము రత్నావళ్యాదినాటకములకై శ్రీహర్షుఁడిచ్చెననుటకు ప్రమాణము లేదు. తనచరిత్ర వ్రాసి తన్ను నిర్ఛిద్రయశోవిరాజితునిగ నొనర్చిన బాణునికి శ్రీహర్షుఁడు అందులకే ఇఁక వేయిమడుంగులు ధనమిచ్చినను యుక్తమేయగును. రాజు గ్రంథము వ్రాసెననగానే దాని నెవనికో పండితునికి అంటగట్టుట కలదు. ఈయాలంకారికులమాటలు నట్టివే కానోపును. అందుచే ప్రియదర్శికారత్నావళీ నాగానందములుఅరూపకములందున్నట్లే శ్రీహర్షవర్ధనకృతము లని సిద్ధాంతము చేయుటయే సముచితము.

## రచనాక్రమము.

ప్రియదర్శికా రత్నావళీ నాగానందములు ఆవరుసనే రచియింపఁబడినవి. నాగానందము కడపటిదని ఇదివఱకే నిరూపించితిమి కడమ రెండునాటికలలో ప్రియదర్శిక మొత్తముమీఁద 'శృంగారరసఘుటిక' యనందగి 'సూక్ష్మములోనే మోక్షమున్నట్లు చిఱుతుకతనముతోనే రసవత్తరంబుగా వెలయుచున్నను, సన్నివేశ సౌభాగ్యమున రత్నావళికన్న తక్కువదే యనుట నిస్సంశయము. మఱియు ఆ యక్కచెల్లెండ్రలో చెల్లెలు రత్నావళియే ఆలంకారికుల మనసును హెచ్చుగ హరించినది. అందుచే వారు అడుగడుగునకును రత్నావళిని స్మరించియున్నారు.

అందుచే రత్నావళి శ్రీహర్షుని నాటకకళాపరిపాకమున మధ్యేమార్గమున నెసఁగారుచున్నది.

నాటికలు:—మాళవికా ప్రియదర్శికా రత్నావళులు.

శ్రీహర్షుని మూఁడు రూపకములలో రెండునాటికలు, ప్రియదర్శికారత్నావళులు. నాటిక ఒక రూపక విశేషము. భరతముని రూపకములు పదియని నిబంధించి వానిలక్షణము ప్రపంచించెను. అవి పదియు శుద్ధరూపకములు. నాటిక యందులోనిది కాదు. దానిని భరతముని యుద్దేశింపకయు లక్షించినాఁడు. పిమ్మట భరతముని ననుసరించిన ధనంజయుఁడు దశరూపకమునందు నాటికను సంకీర్ణరూపకమని పేర్కొనెను. దీనిని సింగభూపాలుఁడు విపులీకరించెను. నాటకమునుండి "ప్రఖ్యాతనృపనేతృత్వమును" ప్రకరణమునుండి "బుద్ధికల్పితవస్తుత్వమును" గైకొని నాటికను కల్పించి నట్లు తన్మతము. సంకీర్ణములలోను నాటిక ఒక్కటిమాత్రమే ప్రయోగార్హ్వమని దశరూపకము. సాహిత్యదర్పణకారుఁడు పదునెనిమిది యుపరూపకములం బేర్కొని అందు నాటికను ఒక దానినిగా పరిగణించెను. ఆతఁడు చెప్పిన నాటికాలక్షణము,—

"నాటికయందువృత్తము కవి కల్పితము. స్త్రీలబాహుళ్యము, అంకములునాలుగు. ప్రఖ్యాతుఁడుధీరలలితుఁడునగు నృపుడు నాయకుఁడు. రాణికిఁజెందినదిగాని, సంగీతవ్యాపారమున నున్నదిగాని, నృపకులముది నవానురాగ కన్య నాయిక.

"నాయకుఁడు దేవివలని వెఱపుచేత ఆకులుఁడగుచు ఆనాయికయందు వర్తిల్లును. దేవి నాయికకన్న వయోధికురాలు. నృపవంశసంభూత ప్రగల్భ. మాటిమాటికి మానముంబూనునది. నాయికానాయకుల సంగమము ఆమెవశముననుండును. ఇందువృత్తికైశికి. విమర్శసంధియుండదు."

వే. వేంకటరాయశాస్త్రులవారి యాంధ్రసాహిత్యదర్పణము.

ఈలక్షణమున "విమర్శసంధియుండదు" అనుభాగమునకు విరుద్ధముగా దశరూపకకారుఁడును రసార్ణవసుధాకరకారుఁడును రత్నావళి నుండియే విమర్శసంధికి లక్ష్యము చూపియున్నారు. ఇందు "నాలుగంకములు" అనుభాగముచేఁ గాకున్నఁగడమలక్షణమునకు కాళిదాసుని మాళవికాగ్నిమిత్రమును సరిపోవుచున్నది. చతురంకికాత్వమును భేదకముగాఁ జెప్పుట కేవలము జఘన్యముగా నున్నది. "చతురంకాదిభేదకం చే

న్నతత్త్వమమ్" అని రసార్ణవసుధాకరకారుఁడు దానిని ఖండించెను. మఱి ఉపపత్తులబాహుళ్యముచే మాళవిక నాటికయేయని చెప్పఁదగి యున్నది. ఇందులకై కొన్ని కారణములను ఇట చూపుదుము,—

(1) ప్ర. మాళవిక నాటకమని యందేకలదు. మఱినాటికయను టెట్లుపొసఁగును? ఉ.- నాటకమనుశబ్దము సర్వరూపకపర్యాయము. ఇట్లు భరతనాట్య శాస్త్రవ్యాఖ్యాత అభినవగుప్తాచార్యపాదుల యనుశాసము కలదు "కావ్యేషు నాటకం రమ్యమ్", "నాటకాంతం హి సాహిత్యమ్" ఇత్యాది వ్యవహారములయందు ప్రకరణముకానిది నాటికకానిది అని నాటకశబ్దార్థము కాదు. అది రూపకమాత్రవాచకము, "నాటకశాల" లో కడమరూపకము లాడరా? ఇదిగాక "నాటికా" నామము ఆకాలమునకు ప్రసిద్ధముకామిచే కాళిదాసుఁడు మాళవికకు నాటకమను పేరిడియుండును. విక్రమోర్వశీయ త్రోటకమునకును మాలతీమాధవీయ ప్రకరణమునకును నాటకవ్యవహారము బహుళముగఁ గలదు. కావున ఇది బాధకము కాఁజాలదు.

(2) ప్ర. నాటికలలోనెల్ల నాలుగంకములుండఁగా మాళవికలో నైదంకములు గలవే ఇదియెట్లు? ఉ. "చతురంకికాత్వము భేదకముగాఁ జెప్పుట పొసఁగదను రసార్ణవసుధాకరవాక్యములు ముందే చెప్పఁబడినవి. ఇది వర్ణనమాత్రము. దశరూపకాదులయందు రూపకములకు పరస్పర భేదకములుగా చెప్పఁబడిన లక్షణములలో నిది లేదు. ఆభేదకములు మూఁడు (1) వస్తువు (2) నాయకుఁడు (3) రసము. ("వస్తు నేతా రసస్తేషాం భేదకాః" దశ) ఈమూఁటినిబట్టి పరిశీలించినచో మాళవికనాటికయేయని యేర్పడును. ఎట్లన (1) రసము శృంగారమే. ఇందు విప్రతిపత్తిలేదు. (2) నాటకనాయకుఁడు ధీరోదాత్తుఁడు కదా కావలెను. మఱి నాటికలందుబలె మాళవికయందు నాయకుఁడు ధీరలలితుఁడు. అతనికి ధీరలలితలక్షణమే సరిపోవును. రత్నావళీ ప్రియదర్శికలలోని వత్సరాజునకు అగ్నిమిత్రుఁడు- మాళవికనాయకుఁడు, సర్వవిధముల సజాతీయుఁడు. శ్రీరామాదులకు కాఁడు. అగ్నిమిత్రునకు ధీరోదాత్తలక్షణము సరిపోవదు. (3) వస్తువు నాటకములందు ప్రసిద్ధముగ నుండవలెను కదా. మాళవికాగ్నిమిత్రకథాలేశమైనను పూర్వగ్రంథములందు లేదు. విష్ణుపురాణాదులందు అగ్నిమిత్రునిపేరుమాత్రమే కలదు దానిచే నాయ

కుని ప్రఖ్యాతత్వముమాత్రము ఏర్పడును. మాళవిక పేరుగాని ఆమెను అగ్నిమిత్రుఁడు వలచి పెండ్లాడెనని కథాబీజమేని ఎందును లేదు. అందుచే మాళవికకథ ప్రఖ్యాతము కానేరదు. అట్లు కాకున్న మాళవిక నాటకము కాఁజాలదుకదా. కాళిదాసుని కాలమునకు ఈకథ ప్రసిద్ధముగ నుండి యుండుననుటకును ప్రమాణము వలయునుగదా. అది యెందును కాన్పింపదు. బుద్ధికల్పితవస్తుత్వమును ప్రఖ్యాతనృపనేతృత్వమును మాళవికనాటికయే యను సిద్ధాంతమునకే ముఖ్యసూచకముచున్నవి.

ఇట్లు నాటకశిరోమాణిక్యమగు శాకుంతలమునను, త్రోటకతల్లజమగు విక్రమోర్వశీయమునను, నాటికాప్రథమమగు మాళవికాగ్నిమిత్రమునను, కాళిదాసుని ప్రతిభగంగయుంబోలె ముక్కవగను ప్రవహించి సర్వసారస్వతలోకపవిత్రీకరణక్షమమైన దను సిద్ధాంతము కరముశ్రేయముకదా. ఇట్లు మాళవిక నాటికలకెల్ల కన్నతల్లియని మామతము.

నాటిక ప్రకరణాదులంత పెద్దది కాదు.("నాటికాస్వల్పవస్తుస్యాత్"). దశరూపకములలో నిది నాటక ప్రకరణముల సారభూతము. సూక్ష్మములో మోక్షముగనుండు చిన్న శృంగారమయరూపకవిశేషమును కల్పించు కవిసంకల్పమే ఈనాటికకు జన్మకారణముకానోపును. నాటిక నాటకమంత భావోద్వేగకారియును (Serious) గాదు "గ్రీకుల" "Neo comedy" కిని నాటికకును సన్నిహితసంబంధ మున్నదని పోల్చిచూచిన తేటపడును. ఆంగ్లమున దీనిని "Court Comedy" అనఁబోలునని కొందఱి యాశయము. షేక్స్పియరుమహాకవికృతము లగు "Romantic Comedies" తో నీనాటికలు కొంతమట్టుకు సరిపోలును. పదునెనిమిది యుపరూపకములలో నాటికయే అగ్రస్థానమున వఱలును. వేలన అవొక్కటే ప్రయోగార్హము. అది శృంగార రస గుళిక. కడమ రసముల నేదియు నందు ప్రధానముకానేరదు. నాయికానాయకులు నృపకులసంభూతులు. అందుచేతనే ఒకటీవియు నుదాత్తతయు-సాధారణ జననేతృత్వముచేఁ గలుగనివి - నాటకమునకుఁ గల్గునని మఱొక సందర్భమున బ్రాడ్లే చెప్పినవాక్యము ఇట లెస్సగా సరిపడును.

నాటికలలో విదూషకునిప్రాధాన్యము హెచ్చు. నాటకములలో మాళి భూతమైన శాకుంతలమున విదూషకుఁడు "మృత్పిండబుద్ధి".

అతిశాకుంతలమైన యుత్తరరామచరితములో విదూషకుఁడే లేఁడు. ముద్రారాక్షసమునను లేఁడు. నాటకములు భావోత్కటములు ("Serious") అగుట నందు నాటికలలో బలె విదూషకునకు అకుంఠిత ప్రాధాన్యము లేదు నాటికలయందన్ననో విదూషకుఁడు నాయకునకు "కార్యాంతర సచివుఁడు" (మాళవిక) నాయకుఁడు-ధీరలలితుఁడు కావున-రాజకార్యములను మంత్రి యధీనముచేసి "కామవ్యవహారములలో" వ్యాపృతుఁడుకాఁగా, విదూషకుఁడు అందు మంత్రియై ఈ 'సంధివిగ్రహచింతలో అమాత్యయౌగంధరాయణుని మించినవాఁడు' (రత్నా. పుట. 30) అగును. నాయకున కతఁడు 'విశ్రమస్థానము' (రత్నా 4. అం.) అతఁడులేక నాటికయే లేదు. అతనికార్యకౌశలము అద్భుతము.

ఈ నాటికలలో కథాసార మొక్కటియే మాళవికారత్నావళీ ప్రియదర్శికలు కథలో చాలఁ బోలును. నాయిక తొలుతనే నాయకునకు పత్నిగా సంకల్పితయగును. సంకల్పము నెఱవేఱకపూర్వమే నాయిక ఏదో యొక యలవోక యిక్కట్టుపాలై స్వజనమునుబాసి ఎట్లో నాయకుని యంతిపురము చేరును. అందు రాణికి దాసిగానుండ నాయికను నాయకుఁడు మొదట (మాళవికారత్నావళులయందుంబోలె,) చిత్తరువులోనో, కాదా (ప్రియదర్శికలోనుంబలె) ప్రత్యక్షముగనో చూచి వలపుఁగొనును. విదూషకుని కామతంత్రకౌశలమువలన సమాగమము సంఘటిల్లి అంతలో దేవేరియాటంకములచే బెడిసిపోవును దేవి నాయికను చెఱయందుంచును. చెఱ తప్పించుట కద్భుతోపాయకల్పనము. కడపట నాయికను తదీయులు, రాజాస్థానికి కార్యాంతరమున వచ్చినవారు, గుఱుతింతురు. ఆమె రాణికి బంధుగురాలగును. రాణి నాయిక నాదరించి, తన పూర్వకాఠిన్యమునకు అనుశయమొంది తనచేతితోనే యామెను నాయకున కర్పించును. ఇందు రాణిగారిదే ప్రాభవము. మాళవికలో దేవేరియే రాజును "ఆర్యపుత్త్రుఁడా, నీకు ఇంకను ఏమిప్రియముచేయుదును" అని యడుగుటయు, రాజు "ఇంకనుం బ్రియముందునా? అయిన నిట్లగుఁగాక.—"నీవు ప్రసన్నవక్త్రవయి నిత్యము నన్ననుచుండుచుండిరో" అని ప్రార్థించుటయు రాణిగారిప్రాభవమునకుఁ దలపోలము. ప్రియదర్శికయందును అట్లే.

కొన్నినాటికలలో నొక బౌద్ధ పరివ్రాజిక నాయికకు లోలోపల సాహాయ్యము చేయుచుండును. ఉదా.— మాళవికలో పండితకౌశికి,

ప్రియదర్శికలో సాంకృత్యాయని, మృగాంకలేఖలో సిద్ధయోగిని కొన్నిట భృంగములో వానరములో కథ పెంపకమునకుఁ దోడ్పడు చుండును. ఉదా.— మాళవికలో పింగళవానరము, రత్నావళిలో సాహింణపుఁగపి, ప్రియదర్శికలో తేటితుటుము.

అన్ని నాటికలలో నించుకయుద్ధప్రస్తావము కలదు. ఇంకను చిల్లర సాదృశ్యము లనేకములు.

ఈనాటికలకవులకు మేలుబంతి కాళిదాసుఁడు. నాటికారచనమున 'నిపుణ కవి' శ్రీహర్షుఁడు. ఈయన మూఁడురూపకములలోను రెండు నాటికలే.

రత్నావళీ నాటిక.

"ఆశ్లిష్టసంధిబంధం, సత్పాత్ర సువర్ణ యోజితం సుతరామ్,
నిపుణ పరీక్షక దృష్టం, రాజతి రత్నావళీ రత్నమ్."

అని దామోదర మిశ్రుఁడు కుట్టినీమతమున రత్నావళిని ప్రశంసించియున్నాఁడు. ఇందు (1) నాటకనిర్మాణ నైపుణి (2) పాత్రపోషణ కౌశలము (3) కవితాదీప్తి (4) సహృదయ పరితోషకత్వమును-రత్నావళియొక్క యుత్కృష్టతా హేతువులుగా నుక్తములు. (1) నాటక నిర్మాణకళలో రత్నావళి పరమోచ్ఛ్రితిని గాంచినదనవచ్చును. ఇందు ఆలంకారికు లనుశాసించు సంధులు,సధ్యంగములు ను చక్కఁగా నతుకఁబడి నవి. దశరూపక-రసార్ణవసుధాకర- సాహిత్యదర్పణములలో వీనికి రత్నావళి లెస్సగ నుదాహరింపఁబడియున్నది. ఇవి శాస్త్రమునకై పట్టుఁబట్టి తెచ్చినిల్పినట్లుండవు. నేర్పరియైన నగలపనివాఁడు కెంపులను కుందనములో నతుకులు తెలియనట్లు నిపుణముగా, చక్కఁగా, నందముగా బిగించి రచించిన యుత్తమాలంకారమువలె రత్నావళి శోభించును. కథపాటికి కథ సర్వాంగసుందరముగ సాగుచు ముద్దులొల్కుచుండును.

"సంధి సంధ్యంగ ఘటనా రసాభివ్యక్త్యపేక్షయా,
న తు కేవలయా శాస్త్రస్థితిసంపాదనేచ్ఛయా."

అను నాలంకారికసూక్తికి రత్నావళి లక్ష్యభూతముగ నున్నది. (సంధుల సమన్వయము. చూ. "రత్నావళీకథానిర్మాణము" కళాగోపనము చే కళను విలసిల్లఁజేసిన 'నిపుణుఁడు' శ్రీహర్షుఁడు.

(2) ఇఁక పాత్రలవిషయము. రత్నావళియందలి పాత్రలు చాల మట్టుకు బృహత్కథామూలకములే. యౌగంధరాయణుఁడు, రుమణ్వాం

కుఁడు, వసంతకుడు, వాసవదత్తావత్సరాజులు ను బృహత్కథలోనివారే. బృహత్కథలో వాసవదత్తాహరణసమయమున తనస్వామిని గుట్టుగాచి యామె మదికెక్కినది 'కాంచనమాల'. మఱి శ్రీహర్ష ప్రతిభకుఁ బుట్టిన సాగరిక (ఆరణ్యకస్సైదోడు) రసజ్ఞశేఖరులమనసు ను, వత్సరాజు చిత్తము నుంబోలె కొల్లగొను ముద్దుగుమ్మ. సాటిలేని విభవముచే వెలుగొందు సీతతోడను, శకుంతలతోడను, ఆమె సరిపోలకపోయినఁ బోవుఁగాక; కాని-మాళవికకుఁ దగిన నెచ్చెలియని చెప్పవచ్చును.

శ్రీహర్షుఁడు వ్రాసిన మూఁడురూపకములలో రెంటికి వత్సరాజు నాయకుఁడు. రెండింటను వాసవదత్తదే ప్రాభవము. ఇఁక కథలు లేవా? నాయకులు లేరా? లేరనియే శ్రీహర్షుని యాశయము. ఏలన శ్రీరాముఁడే నాయకుఁడు, వత్సరాజే నాయకుఁడు. సంస్కృతనాటక వాఙ్మయము నందు వీరిరువురికథలవలె కవిజన మనోమోహకములు మఱి పెక్కు లేవు. అనేకమహాకవుల భారతులు శ్రీరామచంద్రుని తెల్లోకోత్తరగుణ వశీకృతములై వరించినవి. అట్టి యవతారపురుషుని చరిత్రాభివర్ణనము పరమార్థసాధనమనియు కవులు తలంచిరి మఱి వత్సరాజువిషయమున నట్టి పారమార్థిక పారలౌకికబుద్ధులు లేవు కాని, ఆర్థరు, చార్లిమెను, హారూన్ ఆల్‌రషీద్, మున్నగువారలకథలు ఆయాదేశీయుల కెట్లు మనోహరములో, వత్సరాజకథలు నట్లె ప్రాచీనభారతదేశవాసుల మనసులను హరించినవని, తన్నాయకముగ రచింపఁబడిన బహుకావ్యములే సాక్ష్యమిచ్చుచున్నవి. కథల సారస్వతమున మకుటాయమానము బృహత్కథ. అది వత్సరాజు, వాసవదత్త, తత్పుత్రుఁడు నరవాహనదత్తుఁడు-, వీరలకథయే. భాసమహాకవి ప్రతిజ్ఞాయౌగంధరాయణ స్వప్నవాసవదత్త నాటకముల ఈవస్తువుచేతనే రసజ్ఞులను సేవించెను. కాళిదాసుఁడు మేఘసందేశములో వత్సరాజుకథను తాకక తనివి సనలేదు- ('ఉదయనకథాకోవిద గ్రామవృద్ధాన్'). అనంగహర్షుఁడు కరుణరసస్రావిగా తాపసవత్సరాజనాటకమును వ్రాసెను. అజ్ఞాతకవి యొకఁడు వీణావాసవదత్తమును వ్రాసెను. శూద్రకుఁడు 'వత్సరాజచరిత' నాటకమును రచించెను. (సుబంధుకృత వాసవదత్తకథ ఈ ఉదయనప్రియవాసవదత్తకథయేయని వ్రాసిన మాక్డొనాల్డు పండితునివాక్యము అవిచారితరమణీయము ; అందుచే వాసవదత్తావత్సరాజసారస్వతమున సుబంధుకృత వాసవదత్తను వేరొకనుట ప్రామాదికము.) మఱి యెన్నియున్నవో వత్సరాజకావ్యములు !

అందుచే శ్రీహర్షుఁడు "లోకేహారిచ వత్సరాజచరితమ్" అని తానాకథను గ్రహించుటకు హేతువును చెప్పెను. మహాకవులు తమ ప్రతిభాధనమును లోకప్రసిద్ధకథ యను మేలిసంచిలోఁ గట్టుటాచారము.

ఇట్లు పైకొన్న పాత్రములచే, సముచితములును, అదీర్ఘములును, మనోహరములును, అగు సంభాషణములమూలమున తత్తదుచితభావములను చక్కఁగా శ్రీహర్షుఁడు ప్రకటింపఁజేసినాఁడు.

కొందఱునాటకములలో పాత్రములు ప్రకరణోచితముగఁగాక, తార్కికులవలెనో, భాషాపండితులవలెనో భాషించుట కలదు. ఇందులకుఁ గొన్నియెడల వేణీసంహారమందును, పెక్కుచోటుల ప్రసన్నరాఘవమునందును, ఉదాహరణములుగలవు. భాస, మఱి, కాళిదాస, భవభూతి, శూద్రక శ్రీహర్షులు సహజరమణీయభాషితములను వెలయించుటలో మిన్నలు. అందు నీపాత్రలు అచ్చునఁదీసిన ప్రతిబింబములుగాక విశిష్ట లక్షణములచే విలసిల్లుచు, జీవ ముట్టిపడుచు, పఠితలఁ దన్పుచుండును.

పాత్రప్రవేశములకై చేయు పూర్వనిర్దేశములును శాస్త్రమునకే చేయునట్టివిగాఁ గన్పట్టక, సహజముగ ఘటిల్లినట్లు సరిపోవుచుండును. ఈవిషయమున రత్నావళి అద్వితీయముగ విలసిల్లుచున్నది.

(3) ఇఁక రత్నావళీనాటికలోఁ గవనమునుగూర్చి. శ్రీహర్షుని మూఁడునాటకములలోను రత్నావళిలో నుత్తమకవనము తక్కువగా నున్నది. వేనలిప్రస్తమై I అం ౧౬; నను గృహఁజూడుమా II అం ౪౬. దయితుముఖంబు III అం ౫౬ ; నయనానందకరుఁడు III అం ౬౦. ఇత్యాదిపద్యములలో భావము మనోహరముగ నున్నను, శాకుంతలోత్తరరామచరితల కవనమహిమ యిందు కానరాదు. ప్రథమాంకములోని వసంతోత్సవ వర్ణనాశ్లోకములు రంగమున రాణింపనే రాణింపవు. అందు కొన్ని రసవత్త్వమునను మందములు. రాజుపద్యములు చాలవఱకు కాముకుల మామూలు "ప్రాఁతవడ్డ" మాటలుగా నున్నవి. కొన్నిమాత్రము రత్నములనఁ జెల్లియున్నవి. రత్నావళిలో కవన మేదియనఁగా, దాని యద్భుతాతర్కితోపనత సన్నివేశములే. మొదట మదనుఁడనుకొని సాగరిక వత్సరాజుపై పూలుజల్లుట - పిమ్మట శారికావృత్తాంతము - సాగరిక వాసవదత్తవేషమున నభిసరించునని ఎఱిఁగి, వాసవదత్తయే రాజును జేరుట - తత్పరిణామాద్భుతము - ఐంద్రజాలికాగ్ని - ఇవెల్ల కడుంగడు సరసములు. ఐంద్రజాలికాగ్నిచే నిర్వహణమున సద్భుతము నేర్పుతో నెల

కొల్వఁబడినవి. నాటకము చదివినను, ఆటలోఁజూచినను, శ్లోకముల కవన మహిమచే నటుండ, సన్నివేశసౌభాగ్యమహిమచే నెంతయు రసోత్తరముగా నుండును.

(4) కొన్ని సంస్కృతనాటకములు అనర్ఘరాఘవ ముద్రారాక్షసాదులు కడమరీతుల నెంత ప్రసిద్ధములైనను ప్రయోగమున రక్తికట్టవు. కాళిదాస శ్రీహర్ష శూద్రకకృతులును, ఉత్తరరామచరిత్రమును తప్పక "చాక్షుషక్రతువులే". ప్రాచీనకాలమునందు రత్నావళి నాడిరి. "దామోదరమిశ్రుఁడు తనతేఁడు వసంతోత్సవములో మంచినాటక మాడింపుమని యడుగఁగా ఈరత్నావళీనాటకము నాడించెను. ప్రయోగమందు మహామంత్రి నాటికార్థమై తమపౌరులే ఆగ్రంథములో వర్ణింపఁబడినట్లు స్త్రీలతోఁగూడ సర్వాభరణ భూషితులై విభవోత్తరముగా క్రోవులతో నెట్టనీ రొండురులపైని వేశ్యలపైనిం జల్లుచు, ఎట్టబుక్కాపొడుముచే సంధ్యారాగము ం గావించుచు, బోగముమేళములతోఁ గూడ నృత్తగీతవాద్యములతో జేనిమ్రోల నాటికాప్రయోగములో నతని మేడవెంబడి నేఁగునట్లు గావించెను. ఈవృత్తాంతమును, నటసంఘమునకు రాజిచ్చిన బహుమతులవివరమును, ఈనాటకకథను ఆ మహామంత్రియే ఆర్యావృత్తములలో (కుట్టినీమతములో) రచియించినాఁడు. ఇందువలన నీనాటకముపై మనపూర్వులకు ఎంతగురుతెయుండెనో ఎఱుకవడును."

(వే. వే. శాస్త్రులవారి భారతాభారతరూపకమర్యాదలు ౧౦ వ శీర్షిక.)

ఇట్లే, రత్నావళీనాటిక కావ్యరత్ననిపుణపరీక్షకులైన యాలంకారికసార్వభౌములచే - భోజ మమ్మట విశ్వనాథాదులచే,-కడుబహూకృతమైనది. శ్రవ్యముగను దృశ్యముగను రసజ్ఞులమదికెక్కినది. నాటికలలో మిన్నయని వన్నెగాంచినది.

శ్రీహర్షుని ప్రతిభాదికము.

సంస్కృతనాటకకర్తలలో శ్రీహర్షుఁడు ప్రసిద్ధుఁడు. దశరూపకము, సరస్వతీకంఠాభరణము, సాహిత్యదర్పణము, రసార్ణవసుధాకరము, మున్నగు సాహిత్యశాస్త్రగ్రంథములందు అతని గ్రంథములనుండి మెండుగ నుదాహరణములు గన్పట్టుచున్నవని పూర్వోక్తము. దీనిచే నాలంకారికులకు అతనిపై నెంతగౌరవము కలదో ప్రకటమగుచున్నది. జీమూతవాహనుని యుత్తమనాయకతను వీరరసనిరూపణ సందర్భమున దశరూపకకారుఁడు మిక్కిలి కీర్తించినాఁడు. జయదేవుఁడు,—

"యస్యాశ్చోర శ్చికురనికరః, కర్ణపూరో మయూరో,
భాసో హాసః, కవికులగురుః కాళిదాసో విలాసః,
హర్షో హర్షో, హృదయవసతిః పంచబాణ స్తు బాణః,
కేషాం నైషా కథయ కవితా కామినీ కౌతుకాయ ?"

అని కవితా కామినికి శ్రీహర్షుని హర్షముగా నభివర్ణించెను. శ్రీహర్షుఁడే తన్నుఁగూర్చి "నిపుణః కవిః" అని చెప్పుకొనియున్నాఁడు. ఇతని నాటకములు భాసకృతములను కొందఱివాదము యథార్థము కాదుకాని అది యు శ్రీహర్ష రూపకములకు ప్రశంస చెప్పునదిగ నున్నది. దామోదరమిశ్రుని రత్నావళీప్రశంస పూర్వోక్తము.

కాని, హర్షుని ప్రతిభ భాస కాళిదాస భవభూత్యాదుల ప్రతిభ ముందర నెన్నుగాఁ బ్రకాశింపదనుట సత్యమే. అమహనీయులకు వారె కదా దీటు. అందును కాళిదాసునినాటకములను శ్రీహర్షుఁడు మిక్కిలి యనుకరించెను. కొన్ని సంభాషణములు విక్రమోర్వశీయరత్నావళు లలో సంవదించుచున్నవి. ఉదా,—

(1) "ధౌతదుకూలయుగ్మమును దాలిచి మంగళమాత్రభూషయై
పూతముౖలైనలేగఱికమోసులఁ జూర్ణకబాళిఁజెర్వియుక్
చేతములోనిగర్వ మపచిత్యపదేశమునన్ ద్యజించియున్
గాతరనేత్ర నాపయినిగన్న ప్రసాదముఁ దెల్పుమేననే."

ఈ విక్రమోర్వశీయపద్యము రత్నావళిలోని "నూతనమజ్జన ప్రభవ" (అం. 1) పద్యమునకును, ప్రియదర్శికలోని "సోలుచుతీణయై" అనుపద్యమునకును, మేలుబంతి గానున్నది

(2) "ఇప్పుడు నావల్ల ప్రియవచనం వినడంచేత నాప్రియ వయస్యుడికి ఎంత హృదయానందముకలుగుతుందో అంత ఆనందము కౌశాంబీరాజ్యం రావడంచేతగూడ కలుగలేదు." (రత్నా. పుట 33)

ఇదేయర్థము విక్రమోర్వశిలో,—

"నా కేకాతపవారణంబిడ దటుల్ నానావనీరాజ చూ
డాకలోజ్జ్వల రత్నభాసి పదపీఠాప్తాధిరాజ్యంబు తాన్
ఈ కంజేక్షణపాదపీఠమున నే నేకాంతసేవాకృతి
శ్రీకిన్ బాత్రమునౌట యెట్లిదునో పూర్తిం జెందు ధన్యత్వమున్."

(3) వాస — "ఆయనకు కనపడకుండా వెనుకవైపువెళ్లి కంఠము కౌగిలించుకొని ప్రసాదింప జేస్తాను." (రత్నా.)

"వెనుక కల్లన వచ్చి నావీక్షణముల
ముగ్ధకరపంకజములతో మూయునొక్క."  (విక్రమోర్వశి.)
వాసవదత్తకు అట్టిసంవిధానము కలుగలేదుగాని ఉర్వశికిఁ గలిగినది.

ఇత్యాద్యనుకరణములు మెలఁకువతో పరికించి పెక్కు కనిపట్ట వచ్చును. భావములలోనేగాక కథావస్తువునందును అనుకరణములు కలవు. మాళవికకు ప్రతిబింబములు ప్రియదర్శికారత్నావళులు. ఆకారణమునుబట్టి శ్రీహర్షుని ప్రతిభ నతకరింపరాదు. ఏలన కాళిదాసాదుల నెల్లరు ననుకరించిన వారే.

ఎరవుసొమ్ముల నొఅపుగ నుపయోగించుకొనుటలో శ్రీహర్షుఁడు సిద్ధహస్తుఁడు. శాకుంతలములోఁ గాళిదాసుఁ డొక భృంగమును పెట్టఁగా శ్రీహర్షుఁ డొక తేఁటితుటుమునే ప్రియదర్శికలో నిబంధించినాఁడు. ప్రియదర్శికలో ఆసంవిధానము అత్యంతము మనోహరము; శాకుంతలమునందున కన్న రమణీయతరము. కాళిదాసుని మాళవికలోని పింగళవానరవృత్తాంతమునకన్న రత్నావళిలోని సాహిణంపుఁగపివృత్తాంతము ప్రయోజనమున మఱింత సొంపుగనున్నది. మాళవికలోని విషప్రయోగమునకన్న తదనుకృతియగు ప్రియదర్శికలోని విషవృత్తాంతమే రమణీయతరము.

శ్రీహర్షుఁడు అద్భుతసంవిధానములను కల్పించుటలో నిపుణుఁడు. రత్నావళిలో సాగరికవాసవదత్తవేషమున నభిసరించునని యెఱిఁగి వాసవదత్త తానె రాజును చేరిన సంవిధానము ఎంతయు నందమైనది. ఈ మాఱువేషములను ప్రియదర్శికలోను కవి పెట్టినాఁడు. ప్రియదర్శికలో నంతర్నాటకమున, వత్సరాజే మనోరమకు, నాయకవేషధారిణికి, బదులు వాసవదత్తయెదుటనే, తనప్రియను ఆరణ్యకను, వాసవదత్తావేషధారిణిని, కామించునట్లును-ఒక్కపెట్టున వాసవదత్తా ప్రణయకథయు, ఆరణ్యకా ప్రణయకథయు సొంపుగ నొకటిగజతపడునట్లు కలయనల్లి శ్రీహర్షుఁడు సహృదయపరితోషముం గూర్చినాఁడు.ఇట్టిరచనలు నాటకప్రపంచములో చాల లేవు.

మఱి, నాగానందమున చతుర్థపంచమాంకములు క్షుద్రహృదయములనేని యుదాత్తములఁ జేయఁజాలుభంగిని రసోత్తుంగముగా రచింపఁబడినవి. జీమూతవాహనుని యస్వార్థబుద్ధింగాంచి యొకక్షుద్రనాగుఁడు,-

"అహిభరణకీర్తి యొకపూట యైన లేదు,
శ్లాఘ్యముగ తేనియానతి సలుపనైతి,

నేల నా బ్రదుకు కొఱుఁడు నాకిచ్చెఁ బ్రాణ,
మయ్యయో! ఛీ! చెడితి! నే నయ్యొ! చెడితి!

కనుక నేనిట్టి బ్రదుకు క్షణమైనను బ్రదికి పరిహాసాస్పదము కాను. ఇతని తోఁగూడ పోవుటకు యత్నించెదను." అని యుదాత్తతం గాంచెను. గరుడుఁడు తాఁ బోడిచిపొడిచి తినుకొలఁది ఆనందమగ్నుఁడుగ నగపడు మహాసత్త్వుని జీమూతవాహనునిజూచి ఇతఁడు నాగుఁడు కాఁడని భక్షణముడుగఁగా, జీమూతవాహనుఁడు —

"నాడులందునింక నల్లలొ లెక్కడుఁజూడు,
మేననింక నెఱచి మెసవఁగలదు,
కాన రావు తృప్తిగ్గొనయట్లు మహాత్మ
బోనమేల గరుడి, మానితయ్య?"

అనిప్రార్థింపఁజొచ్చెను. ఇట్టియరుదైన యుదాత్తసంవిధానములు పెట్టఁడయ్యెననికదా షేక్స్పియరును టాల్‌స్టాయి దూరెను. ఇట్లు ఉత్తమ రసవత్తరసన్నివేశసౌభాగ్యమును కల్పించుటలో శ్రీహర్షుఁడుఅసదృశుఁడు.

రత్నావళీనాటికాపాత్రలనుగూర్చి చెప్పినవాక్యములు శ్రీహర్షుని రూపకములందలి పాత్రములకన్నిటికిని చెల్లును. నాటికలలో బహువిధ పాత్రసృష్టికి చోటుచాలదు కాని యున్నపాత్రలు జీవల్లోక స్త్రీపురుష ప్రాయములు. నాగానందమున కొంతవఱకు పాత్రవైవిధ్యమునుంగలదు.

శ్రీహర్షుని దృశ్యకావ్యరచనప్రతిభ. యకలంకము నాగానందము పూర్వార్ధముతో నుత్తరార్ధము చక్కఁగ నతుకుకుటలేదు ఇదిరయొక్కలోపము. ఇట్టివి తన్నాటికలలో లేవు. అవి సర్వాంగసుందరములు. సంభాషణములు సహజమనోజ్ఞములు. భాషయు సంవిధానసముచితమును పాత్రోచితమును. వృత్తములు నాటికలలో చాలమట్టుకు పెద్దపెద్దవి. శార్దూలముల హడావిడి హెచ్చు. కవనమహిమచే కాళిదాసభవభూతులను శ్రీహర్షుఁడు సరిపోలకున్నను సన్నివేశ సౌభాగ్యకల్పనముచేతను, పాత్రపోషణకౌశలముచేతను వారికిఁ దీసిపోవఁడు. అందుచే "శ్రీహర్షో నిపుణఃకవిః" అను టెంతయు సరిపడియున్నది.

శ్రీ

# రత్నావళీ నాటిక

---

నాంది

మ. చరణాగ్రస్థిత యై, స్తవోచ్ఛ్రితికి శశ్వన్నమ్ర యై, దృక్త్రయిన్
హరుఁ డాసాసలఁ గాంచ, హైమవతి లజ్జాన్వితయై, పూజలో
గరుపాటున్ నును జెమ్మటల్ వణఁకునుం గా, మౌళికై చిమ్మ, నం
తరమం దాకుల మౌసుమాంజలి యనంత శ్రీలు మీ కిచ్చుతన్. ౧

మఱియు,

మ. త్వరగొల్పన్ మగు లెంతయున్, సహజ యీర్ష్యన్ లజ్జ వేవెన్కకున్,
సరసోక్తంబుల వెండి బంధులలనల్ సాముఖ్యముం గూర్పఁగా,
వరు మ్రోలం గని త్రాస మంది గగురున్ బ్రాపించి తొలూకటమిన్
సరసుం జేరఁగ శూలి నవ్వ మెయిఁ గొన్నశర్వాణి మిమ్మేలుతన్. ౨

మఱియు,

తే. త్రచ్ఛితివి గావె యామకరధ్వజు మును
నాకొఱకె నీవు, గావున నీకుఁ దగుర
మత్సమక్షమె ధర బహుమార్గ మోవ ;
దానినే భావకుటిలను దన్పుకోర,

తే. కృష్ణకంధరాగ్రహ ముఁజ్జగింపు, నాన
గండ. — యనఁ గిన్క నెవని నగప్రభవయు
నబ్ధిభవయు నా దేవుఁ డనల్పకరుణ
సర్వసౌభాగ్యములు మీ కొసంగుఁ గాత.

మఱియును,

తే. కినుక జ్వాలియించుదృక్త్రయిఁ గనినయంత
మూఁడువహ్నులునుఁ ముచ్చముడిఁగి సమసె ?
చికురతరగణములు తలఁచీర లోడియ
5 దద్దిరిలి ఋత్విజులు భీతి ధరణిఁ బడిగి ;
దక్షుఁడు నుతించు, నేడ్చుఁ దత్పత్ని జాలి,
మందలుగ వేల్పులును మటుమాయ మైరి —
అని హసించుచు దేవికి యజ్ఞ నిహతిఁ
జెప్పెడు శివుండు మిమ్ము రక్షించుఁ గాత.

10 [ఇదియుఁగాఁక,

తే. జన్నము రక్కుడ దొరకు, నంజలి సురలకు,
ద్విజవృషుల్ నిరుపద్రవస్థితిఁ బడయుత,
పుడమి సస్యసమృద్ధత బొదలుఁగాత,
విభుఁడు చంద్రవపుఁడు ప్రకాశించుఁ గాత.]

---

15

## ప్రస్తావన

నాంద్యంతమున,

సూత్రధారుడు:—అతివిస్తర మేల ? నేఁడు విక్రమసింహపురీ శ్రీరంగ నాయకస్వామి వసంతోత్సవములో మిళితులైన రసికవతంసుల సభ తీరి నన్ను సబహుమానంబుగా పిలువంబంచి యిట్లానతిచ్చినారు.— "మామిత్రులు వేదము వేంకటరాయ 20 శాస్త్రిగారు శ్రీహర్షప్రణీత రత్నావళీనాటికను ఆంధ్రంబున రచించిన యనువాదమును పఠించితిమేగాని ఆట్లుఁ జూడమైతిమి. దానిని నీవు మాముందాడించి మాకానందంబు గావింపవలయును." అని. [పరిక్రమించి చూచి] కావున నిప్పుడు నేపథ్య రచనం గావించి వారి యభిలషితము నెఱవేర్చెద: [పరిషత్తువంకఁ జూచి] అహో! సకలసామాజికులయు మనస్సులు వశీకృతము లయ్యె నని నా నిశ్చయము.
25 ఏల యన—

శా. శ్రీహర్షుండు కృతిప్రణేత, సదసుల్ జేరె న్గుణగ్రాహి, యొం
తే హృద్యం బగు వత్సరాజుకథయుల్, నేర్పొప్పు మా కాటలో;

ఈహాసిద్ధి నొనర్చు నిం దొకండొకండే; యేమి భాగ్యంబొ నేఁ !
డాహా! సర్వగుణంబులుం గలిగె నా కానందరాజ్యంబుగాఁ ! ౫
శా. వేంకటరాయశాస్త్రి కవి, వీనులవిందులు వత్సరాట్కథల్,
కొలకము మేము నాట్యమునఁ గోవిదసత్తము లీసభాసదుల్ ;
ఇంక నే నేమి గావలయు, నిం దొకఁ డొక్కఁడె కార్యసిద్ధి కా 5
వింకి, యి వన్నియుం గలయు నీవిని దైవ మొసంగెఁ నేఁటికిఁ. ౬

కావున నింటికరిగి యిల్లాలింబిలిచి సంగీతక మారంభించెదను. [పరిక్రమించి నేపథ్యాభిముఖము గాంచి] ఇది మాయిల్లు. గానికిం బోయెద. [చొచ్చి] ఆర్యా! ఇటురమ్ము.

నటి [ప్రవేశించి] — ఆర్యపుత్రా, ఇదుగో వచ్చినాను. ఏపనుపు చేయమంటావో ఆజ్ఞాపించు. 10

సూత్ర. — ఆర్యా, ఈసభవారు రత్నావళీ దర్శనోత్సుకులై యున్నారు. కావున నేపథ్యముం దాల్పుము.

నటి. — [నిశ్వసించి సనిర్వేదము] ఆర్యపుత్రా, నీకు చింత లేదు మరి నీవు ఆడకేమి ? నే నంతేనో అదృష్టహీనురాలిని. నాకు ఒక్కతే కూతురు. దాన్ని నీవు ఎలాగో దేశాంతరంలో ఇచ్చినావు. మరి దూరదేశంలో వున్న వరునితో దానికి పెండ్లి 15 ఎలా గవుతుందా అనేచింతచేత నాకు ఏమీ తోచడం లేదు. ఇటువంటి యీస్థితిలో నేను ఆడడం యేమిటి?

సూత్ర. — ఆర్యా, వరుఁడు దూరస్థితుఁ డని దిగులు పడకు ఇది చూడు.

తే. కడలినడుమనుండి, కడల కావలినుండి,
యొంటు దీవిగడ్డనుండి, తెచ్చి, 20
నిమిషమాత్రలోన సమకూర్చుఁ బో విధి
యభిముఖుండ యేని యభిమతమును. ౭

[నేపథ్యమున]

బళీ ! భరతపుత్రుఁడా, బళీ! అది యట్లే, సందేహము లేదు. "కడలి నడుమ" ఇత్యాది. 25

సూత్ర. — [విని, నేపథ్యాభిముఖముం గాంచి] ఆర్యా, ఇంకను తామసించెద వేమి? వీఁడుగో నాతమ్ముఁడు యౌగంధరాయణ వేషమును దాల్చి వచ్చినాఁడు. రా మరి. మనమును అనంతరకరణీయము లయిన యితర వేషముల ధరించి సిద్ధపడుదము.

[అని నిష్క్రమింతురు.

ప్రస్తావన సమాప్తము. 30

### విష్కంభకము.

[అంతట, హృష్టుఁడగు యౌగంధరాయణుఁడు ప్రవేశించును]

యౌగంధరాయణుఁడు.—ఇది యట్లే. సందేహము లేదు. ["కడలినడుమ" ఇత్యాది మరలం బఠించి] కాదేని, సిద్ధుని యాదేశమును విశ్వసించి నేను సింహళేశ్వరుని
5 ప్రార్థించిన యాతని కూఁతురు సముద్రములో ఓడ పగిలి మునిఁగినట్టిది ఒకపలకం బడసి లేచుటయు, కౌశాంబివాఁడు వణిజుఁడు సింహళమునుండి వచ్చుచు ఆయవస్థలో నున్న యాబాలను గాంచుటయుం, అతఁడు రత్నమాలాచిహ్నము చేత ఆమెను ఆనవాలుపట్టి యిటకుం దెచ్చుటయు, ఇది యెట్లు ఘటిల్లును? [హర్షముతో] ఎల్లవిధములను స్వామియేలికకు అభ్యుదయములు ఒనఁగూడుచున్నవి. [ఆలోచించి] నేను ఈమెను సగౌరవముగా
10 దేవిచేతం బెట్టుటయు యుక్తమే. వింటిని గదా ఇచ్చటికంచుకి బాభ్రవ్యుఁడు సింహళేశ్వరమంత్రి యగువసుభూతితోఁ గూడి ఎట్లో సముద్రమునుండి గట్టెక్కినవాఁడై, కోసలుని సమయింపంబోయియున్న రుమణ్వంతునితోఁ గలసినాఁ డని. ఈ విధముగా ప్రభుప్రయోజనము సిద్ధప్రాయమైనను నాకు ధృతిం గూర్పకున్నది! కష్టము గదా భృత్యభావము.

15 తే. ఒడయనికి మేలు గూర్పునీయుద్యమమున
నిట్లు దైవంబు చేయూఁత యిచ్చియుండ,
నగును నిచ్చలు సిద్ధి: యట్లైనఁ బతికి
జంకుచునె యుందు స్వచ్ఛందచారి నగుట ౮

[నేపథ్యమునం గలకలము]

20 [విని] అహో! మృదుమధుర మృదంగవాదనానుగతం బయిన సంగీతముతోడి పౌరులచర్చరీధ్వని ప్రమోదముల నుద్గమించుచు వీథులను వింతొనర్చుచున్నది! ఇందువలన నే నూహించెద - మదనమహోత్సవముచే పెంపారుచున్న యీ పౌరజనప్రమోదముం గాంచువాఁడై ప్రభువు ప్రాసాదమునకు తరలినాఁడని. [ఊర్ధ్వము చూచి] అహో! అప్పుడే ప్రభువు ప్రాసాదము నెక్కినాఁడే! ఇదె యాతఁడు-

25 తే. ప్రియవసంతుండు, విశ్రాంతవిగ్రహుండు,
జనమనోనిలయుండు, రతిసంగతుండు;
స్వమహమును జూచుతివ్వుట సాక్షాత్కరించు
ప్రసవధనుఁ డన నదె వత్సరాజు వచ్చె. ౯

కావున నేను మాహావేలికిం జని కార్యశేష మరసెద. [అని నిష్క్రమించును.]

30 విష్కంభకము సమాప్తము.

## ప్రథమాంకము

[అంతట ఆసనస్థుఁడు ధృతవసంతోత్సవవేషుఁడు రాజు ప్రవేశించును, విదూషకుఁడును.]

రాజు.—[హర్షముతోఁ గాంచి] సఖుఁడా, వసంతకా! 5

విదూషకుఁడు —ఆనతియ్యి వయస్యా.

రాజు.—

మ. సమయం జేసితి వైరులన్, వసుమతిన్ సన్మంత్రికై సుంచితిన్,
శమితోపద్రవతన్ జనుల్ వినుతరక్షాప్రాప్తి రక్తుల్ సుఖుల్,
సమయం బామని, యీ, వసంతి భవమున్; సంకేతమాత్రన్ ధృతిన్ 10
సుమబాణుండు భజించుఁగాతఁ దన దంచు; న్నాదె యీపండు గొ.

విదూ.—[హర్షముతో] వయస్యుఁడా, నీవు చెప్పినది సరే. దీన్ని గురించి నీ వీలా గన్నావు గదా, అయినా నే ననుకొంటాను, ఈ మదనమహోత్సవం నీదీ గాదు కామదేవుడిదీగాదు. బాపనవటువ నైన నావొక్కనిదే అని. [చూచి] ఈమాట కేమి గాని, చూడవయ్యా చూడు, సారాయి తాగి కైపెక్కిన యీకామినులు స్వయంగా 15 పైకొని చిమ్మనగోవుల నెత్తి గురిపెట్టి చల్లిన వసంతముతో పౌరజనులు ఉల్లాసం మీఱి ఆడుతూవున్న యీనృత్యము చేతను ఎక్కడ చూచినా ఇచ్చకు మెచ్చుగా హెచ్చుగా వాయిస్తూవున్న మద్దెళల ధ్వనితోటి చర్చరీశబ్దాలచేతనున్ను రాజమార్గపు మొగాశాలు మోగుతూవుండగా బుక్కాచల్లకాలచేత దట్టమయిన దశదిక్కుల మొగాలతో ఈమదనమహోత్సవం ఎంత శోభిస్తూవుందో చూడు. 20

రాజు.—[హర్షముతోఁ గలయం గని] అహో! పౌరుల ప్రమోదము పరమోచ్ఛ్రితిం బొందియున్నది!

తే. కౌంకుమక్షోదగౌర బుక్కాప్రవృష్టి
సకలదిశలకు నిడఁ దొలుసంజసిరిని,
శిరములను వంప వంజులశేఖరములు, 25
మేనులను నుంప నగలకీడానిడాలు,

తనదు వేసమున ధనేశుధనగృహం బు
జవ్వుకొనె నాఁగ నొప్పు కౌశాంబి యిప్పుడు
బంగరు మొలాము గొనిరి సర్వజను లవుఁగఁ
బసిమి యొక్కుఁడె వన్నెఁగా బరిఢవిల్లె. ౧౧

5 మఱియును,

శా. పౌరుల్ ముంగిటఁ గ్రోవులన్ గురిసి గాల్వల్గా హిమాంబుల్, ధృతుల్
మూరంబో, నటియింపఁ, ద్రొక్కుడులయేర్పుల్ సేయుసంకంబునన్
నారీకుండలిచెక్కుచెంద్ర మురలన్, నానాపదన్యాసమై,
యీరాక ట్టఖిలంబు చెంగిరమై యేపారె నొక్కుమ్మడిన్. ౧౨

10 విదూ.—[చూచి] ప్రియవయస్యుడా, బలేజాణ లయినసరసులు సూటి దప్పక క్రోవులతో చిమ్మిన వసంతాలపోట్లకి సీత్కారం చేస్తూ ఈబోగాల యెమ్మెకత్తెలు ఏలాగు విలసిస్తున్నారో చూడు.

రాజు.—[చూచి] వయస్యుఁడా, సరిగా కనిపట్టితివి. ఏలన,

ఉ. మానక రాలుబుక్కబలుమబ్బులు చేసెడిచిమ్మచీకటిన్
15 గానఁగ నౌ నొకింత మణికాంచనభూషణరశ్మిపాళిచేన్,
పూనికఁ గ్రోవుల స్ఫణాలపోలిక నెత్తుభుజాగలోక మా
ధ్యానము మీఱ నన్ను బలిధామమునున్ స్మరియింపఁ జేసెడిన్.

విదూ.—[చూచి] ఓవయస్యుడా, ఇదుగో మదనిక మత్తును తగినట్లు వసంతాభినయం చేస్తూ చూతలతికతో కూడా యిక్కడికే వస్తూవున్నది. చూడు ప్రియవయస్యా.

20 [అంతట మదలీలను నటించుచు ద్విపదీఖండముం బాడుచు
ఇరువురు చేటికలు ప్రవేశింతురు]

గేయము

నలకడ తెమ్మెర వచ్చెనే! వలరాజు నానతిఁ దెచ్చెనే!
ఎనవాగ లను గంట గించెనే! ఎలమావులను నని కించెనే!
25 పొగడతావుల వెద వల్లెనే, మగువల మగలపై నల్లెనే,
తొగకంటి యీలువు త్రుంచెనే, చిగురుఁబోఁడులగుండె సించెనే.

క. మునుమును మధుమాసం బిట
జనుఁ గొదగల మెత్తఁబలుచుఁ, జయ్యన నంతన్
అను వౌటఁ జొరఁగఁ, గాముఁడు
మునుకొని కాడంగ జేయుఁ బువుబాణములన్. ౧౫

రాజు.—[చూచి] ఆహా ! ఈచేడెల యాటతమి పాటిమీఱి మనోహరముగా 5
నున్నది. అట్లేగదా ;

ఉ. వేనలి స్రస్తమై చెదరి కీడ్కొనె నల్లిసరుత్తపోణిమిన్,
మానక పాద మంటి యనుమట్టుగఁ గ్రందిలుచున్న వందియల్,
పూనుచుఁ గంప మిట్టటయి మోఁదుచునున్నది హార మక్కునన్,
కౌను కుచాద్రిసమ్రము త్రెగంబడ మత్త నటించు పీడ నాన్. ౧౬ 10

విదూ—[నవ్వుచు] వయస్యుడా, నేనుగూడా కాసెగట్టిన యీచేడెల మధ్య
ఆడుతూ పాడుతూ రవంత సేపు హోళీపండుగని గౌరవించివస్తాను.

రాజు.—[చిఱునగవుతో] వయస్యా, అట్లే చేయుము.

విదూ.—నీయాజ్ఞ [అని లేచి చేటికల నడుమ నర్తించుచు] ఓ మదనికా, ఓ
చూతలతికా, ఈచర్చరిని నాకున్నూ నేర్పండి. 15

మదనిక.—[నవ్వి] చెడిబతికినవాడా, ఇది చర్చరి గాదోయి.

విదూ.—మఱి యి దేమిటి ?

మద.—చెడిబతికినవాడా, ద్విపదీఖండమోయి యిది.

విదూ.—[హర్షముతో] ఈఖండంతో మోదకాలు చేస్తారా లడ్డువులు చేస్తారా?

మద.—చెడిబతికినవాడా, కాదు కాదు, పాడేదోయి యిది. 20

విదూ.—[అచ్చెరువుతో] పాడేదా యిది ! [విషాదముతో] పాడేదే గాని
తినేది కాకుంటే నా కెందుకు ఇది; ప్రియవయస్యుడి కాడికే వెళ్తాను.

[అని పో నుంకించి ఓసగిలి కూర్చుండును ఆయిరు
వురును లాగుదురు. విదూషకుఁడును లాగును.

ఇరువురును.—[అతని చేతులు పట్టుకొని] ఉండు. చెడిబతికినవాడా, తప్పించు 25
కొని వెళ్తావా? ఎక్కడికి వెళ్తావు ; [అని బహువిధముల తాడనము సేయుందురు.

విదూ.—[చేతులు లాగికొని పలాయితుఁడై రాజును దఱిసి] వయస్యుఁడ నర్తించితిని.

రాజు —వయస్యా, క్రీడనముం గావించితివా?

విదూ —క్రీడనం గాదు, పలాయనం గావించాను.

5 చూతలతిక.—ఓసే మదనికా, మనము చాలా సేపు ఆడినాము. రా మఱి. ఏలినవారికి దేవిగారిసందేశాన్ని నివేదింతాము.

మద.—చూతలతికా, చక్కగా జ్ఞాపకం చేసుకొన్నావు, అలాగే చేతాము.

ఇరువురును —[పరిక్రమించి, కని] జయం జయం ఏలినవారికి. దేవరా, దేవిగారు ఆజ్ఞాపిస్తున్నారు - [అని సగము మాటలో లజ్జను నటించుచు] కాదు కాదు, విజ్ఞా
10 పిస్తున్నారు.

రాజు.—[హర్షముతో నవ్వి ఆదరముతో] మదనికా, ఆజ్ఞాపించుచున్న దను టయే రమణీయము, మఱి మదనోత్సవములో అది మఱీను రమణీయము. కావున చెప్పుము దేవి యే మాజ్ఞాపించుచున్నదో.

విదూ.—ఓసి దాసికూఁతురా, ఏ మాజ్ఞాపిస్తున్నారే దేవిగారు?

15 చేటికలు.—దేవిగారు ఈలాగు విన్నవిస్తున్నారు, ఏమనంటే,-నే నిగుగో వెళ్లి మకరందోద్యానములో ఎఱ్ఱయశోకముకింద ప్రతిష్ఠచేసిన దేవుణ్ణి పూవిల్తుణ్ణి పూజ చేస్తాను. ఆర్యపుత్రుడు అక్కడికి విజయంచేయవలెను.—అని.

రాజు —వయస్యుఁడా, ఏ మందును? ఉత్సవము మీఁద ఉత్సవము వచ్చినది!

విదూ.—మఱి లే, అక్కడికే వెళ్దాం ఎందుకంటే అక్కడికి వెళ్తే బావన
20 కట్టివాడికి నాకు స్వస్తివాచనం ఏమయినా దొరుకుతుంది.

రాజు.— మదనికా, పోయి దేవికి నివేదింపుము, ఇదె నేను మకరందోద్యానమునకు వచ్చితి నని.

చేటికలు.—ఏలినవారియాజ్ఞ. [అని నిష్క్రమింతురు.

రాజు—వయస్యుఁడా, రా దిగుదము.

25 [అని యిరువురును ప్రాసాదావరోహణము నటింతురు.

రాజు.—వయస్యుఁడా, మకరందోద్యానమునకు దారి చూపుము.

విదూ.—ప్రభూ, ఇటు రమ్ము [అని పరిక్రమింతురు.

విదూ.—[ఎదురం గాంచి] ఓయి ఇదే ఆమకరందోద్యానము. రా మఱి ప్రవేశింతాము. [అని ప్రవేశింతురు.

విదూ.—[ఆశ్చర్యముతో] మహారాజా, చూడుచూడు, ఈమకరందోద్యానము, పిల్లతెమ్మెరలచేత ఊగులాడుతూవున్న ననిచిన యెలమావి పూగుత్తుల పుప్పొడి ముత్తాలతో మేలుకట్టు కట్టినదై కైపెక్కిన తేనెతిండుల ఝంకారగానాలతో కోయిలలచేత తియ్యబల్కులు నీకు చెవులపండువుగా పలికించుచు నీరాకకోసం మహాదరము చూపుతూ వున్నది. మఱి ప్రవేశించు. 5

రాజు.— [కలయం గని] ఆహా! మకరందోద్యానము ఎంత రమణీయముగా నున్నది! ఏలన నిచ్చట,—

ఉ. మోసుల వైద్రుమంబులను మొట్రెడు లేఁతచివుళ్ల నెట్టనై,
గాసటబీసలే యళులక్రందుకలార్భటిఁ గేలిఁ బల్కుచున్,
త్రోసెడి తెమ్మెరన్ గొమలుతోడుతఁ దూలఁగఁ దాముఁ దూలుచున్, 10
భాసిలుఁ గైపు గాంచె మధుభక్తము లౌట నవన్ మహీజముల్.

మఱియు,

తే. పొగడ గురిసెను మూల్గానఁ బూలవానఁ
గల్లుగండూషముల వెలిఁ గ్రక్క ననఁగ;
వెనుకఁ జిక్కినసంపెంగ ననిచె మద్య 1
తామ్రతరుణీముఖేందు సంధానగరిమ;
ఆలకించి యశోకపాదాహతులను
గుబ్బెతలయందియలరొద, లుబ్బి మీఱె,
తేఁటితుటుములు ఝంకారదీర్ఘగీతి
ననుకరణ మొనరించెడి ననఁ జెలంగు. 20

విదూ.— [విని] వయస్యా, ఇది తుమ్మెదలు అందెలశబ్దాన్ని అనుకరించడం కాదోయి, ఇది దేవిపరిజనంయొక్క అందెల శబ్దమే.

రాజు.—అవునోయి, సరిగా కనిపట్టితివి వయస్యా.

[అంతట సకాంచనమాల వాసవదత్తయుం బూజోపకరణములు చేతఁగొని సాగరికయుం విభవంబుగ పరివారంబును ప్రవేశింతురు.] 25

వాసవదత్త.—ఓసే కాంచనమాలా, నాకు మకరందోద్యానానికి దారి చూపు.

కాంచనమాల.—భట్టిని, ఇటు ఇటు

వాస.—[పరిక్రమించి] ఓసీ కాంచనమాలా, నేను మదనపూజ దేని కింద చేయనున్నానో ఆ రక్తాశోకము ఇంకా ఎంతదూరమే?

కాంచ.—భట్టిని, ఇదుగో దగ్గిరనే ఉన్నది, చూడు భట్టిని. భట్టిని పెంచుకొన్న ఆ బండిగురుగింజ ఇదే దట్టంగా పొడమిన పువ్వులతో వెలుగొందుతూవున్నది. దీనికవల అకాలంలో పువ్వులు పూచేలాగ చేయడానికికోసం ఏలినవారు ప్రతిదినము శ్రమపడుతూ వున్న ఆ నవమాలిక. దీని కవతల దేవిపూజకు తావయిన ఆ యెఱ్ఱ అశోకము, అదుగో కనబడుతూ వుంది.

వాస.—అయితే రా, అక్కడికే త్వరగా వెళ్దాము.

కాంచ.—రా భట్టినీ, రా. [అందఱు పరిక్రమింతురు.]

వాస.—ఇదే పూజాస్థానము ఆ రక్తాశోకము. రా మఱి, నాకు పూజోపకరణములను తే.

సాగరిక.—[సమీపించి] భట్టిని, ఇదుగో సమస్తమూ సిద్ధముగా వుంది.

వాస.—[చూచి, ఆత్మగతము] అయ్యో, పరిజనులు ఎంతపొరబాటు చేసిరి? ఎవనికంటి కగపడకుండా దాస్తూ వున్నానో అతని కంటియెదటనే పడనున్నది. కానీ, ఈలాగు చెప్తాను గాక. [ప్రకాశము] ఒసే సాగరికా, ఏమే నీవు పరిజను లందరూ మదనమహోత్సవంలో మైమరిచివుండగా గోరవంకను విడిచి యిక్కడికి వచ్చినావు? దానికాడికే తక్షణం వెళ్లు. ఈపూజాద్రవ్యాన్ని కాంచనమాలచేతికి అప్పగించు.

సాగ.—భట్టినియాజ్ఞ. [అట్లే చేసి కొలఁదియడుగులు నడచి ఆత్మగతము] శారికనేమో నేను పదిలంగా సుసంగతచేత అప్పగించితిని. ఇక్కడ దీన్ని చూడడానికి నాకు ఆశ గలదు. ఏమంటే, దేవుణ్ణి కుసుమాయుధుణ్ణి మానాయనగారి అంతఃపురంలో ఏలాగు పూజచేస్తారో ఇక్కడకూడా అలాగే చేస్తారా, కాక మఱొకలాగు చేస్తారా, చూతామని. అందుకోసము నేను ఎవరికీ కనపడకుండా వుండి చూస్తాను [పరిక్రమించి చూచి] కనక ఇక్కడ పూజాసమయం వచ్చేలోపల నేనున్ను భగవంతుణ్ణి పూజించడానికి పువ్వులు కోస్తాను. [అని పువ్వులు కోయుటను అభినయించును.

వాస.— కాంచనమాలా, అశోకమూలమున, భగవంతుణ్ణి కుసుమాయుధుణ్ణి ప్రతిష్ఠించు.

కాంచ.—భట్టిని యాజ్ఞ. [అని యట్లు చేయును.

విదూ.—[పరిక్రమించి చూచి] వయస్యా, అందెలరవళి వినిచినది, కనక దేవి అశోకమూలానికి వచ్చిందని నేను తలుస్తాను.

రాజు.—చక్కఁగా ఊహించితివి. ఇదిగో దేవి, చూడు. ఈపుణ్యశిల,—

తే. కుసుమసుకుమారమూ ర్తి యీబిసరుహాక్షి
ప్రతముచేఁ గౌను సూక్ష్మతరంబు గాఁగఁ
దనదఁచున్నది మకరకేతనుఁడు పజ్జ
నునిచికొన్న ధనుర్యష్టి యో యనంగ. ౨౧ 5

కావున రమ్ము సమీపింతము. [సమీపించి] ప్రియా వాసదత్తా—

వాస —[చూచి] ఓహో ఆర్యపుత్రుఁడే! జయము జయము ఆర్యపుత్రునికి. మహారాజు ఈచోటిని ఆసనగ్రహంచేత అలంకరించునుగాక ఇదుగో ఆసనము ఆర్యపుత్రుడు ఇక్కడ కూర్చుండవలెను. [రాజు నాట్యముచే కూర్చుండును.

కాంచ.—దేవీ, శోభించుచున్న యీ యశోకవృక్షముకాడికి వెళ్లి నీచేతితో నే 10 పువ్వులు కుంకుమ చందనము వస్త్రాలు అర్పించి భగవంతుణ్ణి ప్రద్యుమ్నుణ్ణి పూజించు.

వాస —నాకు పూజోపకరణాలను అందీ.

[కాంచనమాల అందిచ్చును, వాసవదత్త పూజించును.

రాజు.—ప్రియా, వాసవదత్తా,

ఉ. నూతనమజ్జనప్రభవమూత్నవిని క్షిప్తశోభతఁ 15
ఖ్యాతకుసుంభరాగరుచి రాతిపరిస్ఫురదంశుకాంతతఁ
ఆతతమోదముం గొలిపె దబ్జదళాయతనేత్ర రో, మనో
జాతుని నోముచుఁ మృదులశైశవవిద్రుమశాఖకై వడిఁ. ౨౨

మఱియు,

క. దయితరో, మదనుని నోమెడు 20
కయితో నీవంటినంతఁ గంగేలి నవో
దయమృదుతరాపరకిసా
లయ మన నానేత్రయుగళి లాలన గొల్పుఁ. ౨౩

ఇదియునుం గాక,

క. బాలరో, యనంగుఁ డిప్పుడు 25
చాలఁ దనయనంగతను నిజముగా దూఱుఁ ;
ఏ లనఁ దాను భవత్కర
హేలా స్పర్శోత్సవంబు నెనయనికతనఁ. ౨౪

కాంచ.—భట్టినీ, భగవంతుణ్ణి ప్రద్యుమ్నుణ్ణి పూజించినావు. మఱి ప్రభువు గారికి తగిన పూజాసత్కారం కానీ.

వాస.—నాకు పువ్వులును మైపూతనున్ను అందీ.

కాంచ.—భట్టినీ, ఇదుగో సమస్తము సిద్ధము.

5 [వాసవదత్త నాట్యముచే రాజును పూజించును.

సాగరిక.—[పూవులు తెచ్చుకొని] కట్టా కట్టా! పూవులు కోసుకొనే తమిలో మరిచి చాలా అలసిస్తిని. అందుచేత ఇదిగో ఈ వావిలిచెట్టుచాటున కనబడకుండా దాగి చూస్తాను. [చూచి] ఏమి! ప్రత్యక్షుడే అపూర్వుడైన కుసుమాయుధుడు! మానాయన గారి అంతఃపురంలో చిత్తరువున ఈతని అర్చిస్తారు. ఇక్కడ ప్రత్యక్షుణ్ణి చేసి అర్చిస్తూ 10 వున్నారు. కనక నేనున్ను ఇక్కడినుంచే ఈపువ్వులతోటి భగవంతుణ్ణి కుసుమాయుధుణ్ణి పూజిస్తాను. [అని కుసుమములను చిమ్మును]. భగవంతుడా కుసుమాయుధుడా, నీకు నమస్కారము. నాకు శుభదర్శనుడవు అగుదువుగాక. చూడదగిన దానిని చూస్తిని. నాకు అమోఘదర్శనుడవు కమ్ము. మఱి నన్ను ఎవరున్ను చూడకముందే వెడలి పోతాను. [అని కొలఁదియడుగులు నడచును

15 కాంచ.—ఆర్యా, వసంతకుడా, రా, మఱి నీవు స్వస్తివాచనం గ్రహించు.

[విదూ.—సమీపించును.

వాస.—[విలేపనకుసుమదానపూర్వకముగా] ఆర్యా, ఇదిగో స్వస్తివాచనం పుచ్చుకో. [అని అర్పించును.

విదూ.—[హర్షముతో గ్రహించి] నీకు మేలవుగాక.

20 [నేపథ్యమున వైతాళికుఁడు పఠించును.]

చ. చరమగిరిన్ సమస్తరుచి జాఱెచి పోళి నభోంత మంటఁగా,
నరపతు లెల్లరుం గలసినారు భవత్సభ సంజప్రొద్దునన్
హారువుగ నిప్పుడో యుదయనా, కనువిందుల సారసప్రభా
హారముల నీదుపాదముల నబ్జునిపాదములట్లు గొల్వఁగాన్. ౨౮

25 సాగ.—[విని హర్షముతో రాజును చూచి సస్పృహముగా] ఏమి! ఈయన నన్ను మానాయన యిచ్చిన ఆ ఉదయనమహారాజా! [నిట్టూర్పునిగిడించి] కనక ఓరుల కొలువుచేత నొగిలిన దైనప్పటికీ ఈతనిదర్శనంచేత నాశరీరము నాకు బహుమత మైనది.

రాజ.—ఏమి! ఉత్సవము చేత వ్యగ్రచిత్తుఁడనై సంధ్యాతిక్రమమును సయితము పరికింప నైతిని! దేవీ, కనుము.

క. ఉదయగిరితటాంతరితుని
వదె సూచించెడిని బ్రాచి యామినినాథుఁ
వదనపరిపాండిమము చే 5
హృదయస్థితుఁ డైనదయితుఁ బ్రియయును బోలెన్. ౨౪

దేవీ, మఱి లేతము, లోఁగిటికే పోవుదము.

[అందఱును లేచి పరిక్రమింతురు.

సాగ.—ఏమి! దేవి తరలిందే! కానీ. త్వరగా వెళ్తాను. [రాజును ఆసతో చూచి నిట్టూర్చి] ఏమి నామందభాగ్యత! ఈయనను చాలాసేపు చూడడాని కైనా 10 నోచనైతిని. [అని నిష్క్రమించును.

రాజు.—[పరిక్రమించుచు]

శా. దేవీ, నీముఖకాంతిచే నమృతరుక్తేజస్తిరస్కారిచే
వేవే నాన వహించి యబ్జములివే విచ్ఛాయతం బొందెడిన్;
నీవిన్నాణపుటూడిగంపుగణికల్ నిస్సంద్రతం బాడఁగాఁ 15
బూవుంగ్రొవ్వుల లజ్జ డాఁగెడి నివే పుష్పంధయవ్రాతముల్. ౨౮

[అందఱు నిష్క్రమింతురు.]

మదనమహోత్సవ మను ప్రథమాంకము

సమాప్తము

---

## ప్రవేశకము 20

---

[అంత శారికాపంజరమును చేతఁగొని సుసంగత ప్రవేశించును.]

సుసంగత.—అయ్యో, మరి యీగోరువంకను నాచేత బెట్టి ఎక్కడికి వెళ్ళివుండును నాప్రియసఖి సాగరిక? [మఱియొకవంక చూచి] ఇదిగో నిపుణిక, ఇక్కడికే వస్తూవుంది. దీన్ని అడిగి చూస్తాను.

[అంతట నిపుణిక ప్రవేశించును.]

నిపుణిక.—తెలుసుకొన్నానుగదా ఏలినవారి వృత్తాంతాన్ని. మఱివెళ్లి భట్టినికి విన్నపిస్తాను. [అని పరిక్రమించును.

సుసం.—ఓసే నిపుణికా, ఎక్కడికే ఆశ్చర్యంచేత మైమఱచినదాని లాగ
5 నీవు ఇక్కడనే వున్న నన్ను లక్ష్యంచేయక దాటిపోతూవున్నావు?

నిపు.—ఏమి! సుసంగతా! ఓసే సుసంగతా, నీవు సరిగానే కనుక్కొన్నావు. నాయాశ్చర్యానికి కారణ మున్నది. ఏమంటే? నేడు దొరవారు శ్రీపర్వతంనుంచి వచ్చిన శ్రీఖండదాసుడనే పేరుగల ధార్మికుడివల్ల అకాలములో పుష్పించే లాగు చేసే దోహదాన్ని నేర్చుకొని తాను పెంచుకొన్న నవమాలికనిదానిచేత పూలమొత్తముతో
10 శోభించేలాగ చేస్తారట. అక్కడికి ఈవృత్తాంతాన్ని కనుక్కొమ్మని దేవి పంపగా వెళ్లి వస్తూ వున్నాను. నీ వెక్కడికి వెళ్తున్నావు?

సుసం.—నాప్రియసఖివి సాగరికని వెదకడానికి.

నిపు.—ఓసే, రంగులపెట్టె, చిత్తరుబలక, తూలిక, వీటిని చేతబెట్టుకొని సాగరిక అరటిచెట్ల యింటిలోపలికి వెళ్తూవుండగా నేను చూచినాను. అక్కడికి వెళ్లవే
15 చెలీ. నేనున్ను దేవికాడికే వెళ్తాను. [అని నిష్క్రమింతురు.

ప్రవేశకము సమాప్తము.

---

## ద్వి తీ యాం క ము

---

[అంతట సాగరిక చిత్రఫలకవర్తికలం గొని మదనావస్థను నటించుచు ప్రవేశించును.]

సాగ.—హృదయమా, దయదాల్చు దయదాల్చు. ఎందుకు నీకు అనూనసంతప్త
20 పేరే ఫలం లేని యీ దుర్లభజనప్రార్థనాహతము, ఇది గాక, ఎవణ్ణి చూచిన మాత్రాన నీకు ఇటువంటి సంతాపం పెరుగుతూవుందో [ఆశ్చర్యములో] మళ్లీ అతణ్ణే చూడ గోరుతూ వున్నావు ఈనీమూఢత్వానికి ఏ మందును! కృతఘ్నుమా! ఓహృదయమా, పుట్టినప్పటినుంచి కూడా పెరిగిన యీనన్ను వదలి క్షణమాత్రదర్శనపరిచితుడైన ఆజనుని తగులుకొని పోతూ లజ్జపడవు! అయినా నిన్ను అననేల? నీయం దేమి తప్పు?
25 ఆ మేనులేనివాడినారసాలఘాతకు ఆగలేక నీవు ఈలాగు చేయబూనినావు. కానీ. ఆ యనంగుణ్ణే నిందిస్తాను. [కన్నీళ్లతో కేలుమోడ్చి మోకరించి] భగవంతుడా, కుసుమాయుధుడా, సకలసురాసురులను జయించిన వాడవు నీవు స్త్రీజనాన్ని కొట్టుతూ

లజ్జపడటేమి ? [ఆలోచించి] నిశ్చయంగా మందభాగ్యురాలికి నాకు ఈదుర్నిమిత్తంచేత అవశ్యం మరణము మూడినది. [చిత్రఫలకను చూచి] మఱి యిక నెవ్వరూ రాక ముందే చిత్రఫలకాన ఈయభిమతజనుణ్ణివ్రాసి చూచి, నాయిష్టాన్ని నెఱవేర్చుకొంటాను. [సావష్టంభముగా ఏకాగ్రచిత్తయై నాట్యమున చిత్రఫలకం గొని నిట్టూర్చి] నాకొనచేయి అతిభయంచేత అమితంగా వణుకుతూ వున్నప్పటికి అతణ్ణి చూడడానికి 5 ఉపాయం లేనందున వ్రాసిచూస్తాను [అని వ్రాయుటను నటించును.

[అంతట సుసంగత ప్రవేశించును ]

సుసం.—ఇదిగదా ఆ చిత్రశాల. ఇందులో ప్రవేశిస్తాను. [ప్రవేశించి చూచి ఆశ్చర్యముతో] ఇదే. నాప్రియసఖి సాగరిక, ఏమి ! ఇది యేమో బలమైన అనురాగం హృదయాన్ని లాగుతూవున్నలాగు ఏమోవ్రాస్తూ నన్ను చూడకున్నది. కానీ, దీనికంటి 10 యెదట బడకుండా ఇదేమిటో కనిపెడతాను. [స్వచ్ఛందముగా ఆమెవెనుక నిలిచి కాంచి సంతోషముతో] ఏమి! ప్రభువును వ్రాసింది ! బళి ప్రియసఖీ బళీ ! కాకేమి ! కమలాకరాన గాక రాజహంసి మరియెక్కడ ప్రియపడుతుంది ?

సాగ.—[బాష్పములతో] ఇతణ్ణి వ్రాసితిని, కాని ఎడతెరపిలేకుండా రాలుతూవున్న బాష్పాలచేత నాదృష్టి చూడలేకున్నది [మొగ మెత్తి అశ్రువులను తొలంచు 15 కొనుచు సుసంగతను చూచి ఉత్తరీయముతో చిత్రఫలకను కప్పుచు చిఱునవ్వు నవ్వి] ఓహో ప్రియసఖి సుసంగత ! [అని లేచి చేపట్టి] సఖీ, సుసంగతా, ఇక్కడ కూర్చో.

సుసం.—[కూర్చుండి, బలాత్కారమున ఫలకముం గొని చూచి] సఖి, ఎవరిని నీ విక్కడ వ్రాసినావు ? 20

సాగ.—[లజ్జతో] ఈజరుగుతున్న మదనోత్సవంలో కామదేవుణ్ణి వ్రాసినాను.

సుసం.—[చిఱునగవుతో] ఎంతటిజాణవే ! మఱి యీచిత్రరువు శూన్యంగా కనబడుతున్నది. కనక నేనున్ను ఇందులో ఆయనసరసను రతీదేవిని వ్రాస్తాను.

[వర్తికం గొని నాట్యమున రతీమిషచేతను సాగరికను వ్రాయును.

సాగ.—[చూచి కోపముతో] సఖి, నీవు నన్నేల యిక్కడ వ్రాసినావు ? 25

సుసం.—[నవ్వి] ఎందుకే కారణం లేకనే కోపగిస్తావు ? నీవు ఎటువంటి కాము దేవుణ్ణి వ్రాసినావో నేనున్ను అటువంటి రతినే వ్రాసినాను. మఱి వేఱువిధంగా భావించడం మాను. ఈదాపరిక మెందుకే ? వృత్తాంత మంతా చెప్పు.

సాగ.—[లజ్జతో స్వగతము] ప్రియసఖి నాగుట్టు కనిపట్టినది. [ప్రకాశము]
ప్రియసఖీ. నాకు లజ్జ బలీయముగానున్నది. అందుకోసము, సఖీ, ఈవృత్తాంతము ఇత
రుల కెవ్వరికిగాని తెలియకుండా వుండేలాగు చేయవే.

సుసం.—సఖి, లజ్జపడకు. ఇటువంటికన్యారత్నానికి ఇటువంటి వరునిమీద
5 అవశ్యంగా వలపు కలుగుతుంది. అయినప్పటికీ ఇతరుల కెవ్వరికీ ఈవృత్తాంతము తెలి
యకుండేలాగ చేస్తాను. అయినా ఈశారిక మేధావిని ఈగుట్టు బైటబెట్టినా పెట్టును.
ఒకవేళ ఇది మనయీసాన్ని యథాక్షరంగా గ్రహించి యెవరి యెదటనైనా పలి
కినా పలుకును.

సాగ.—[ఉద్వేగముతో] సఖి, నన్ను సంతాపము మరీయెక్కువగా బాధిస్తు
10 న్నది. [అని మదనబాధను నటించును.

సుసం.—[సాగరికయెదను హస్తముంచి] సఖి, ఊఱడిల్లు ఊఱడిల్లు. ఇదుగో
నేను వెళ్లి ఈదిగుడుబావిలోనుంచి తామరాకులు తామరతూళ్లు క్షణంలో తెస్తాను.

[నిష్క్రమించి మరల ప్రవేశించి నాట్యమున తామరాకులతో సెజ్జ చేసి
తూండ్లతో వలయములు చేసి మిగిలిన యాకులను సాగరిక యెదపై కప్పును.

15 సాగ.—సఖీ, తీసివేయి యీతామరాకులను తూటికడియాలనున్ను. ఇవేల?
వృథాగా ఏల నన్ను ఆయాసపెట్టుకోవడము ? చెప్తాను విను.

(గేయము).

అందరానిపండు గోరితిన్ ; సఖీ,
డెంగమందు నాన నన్ను డిందఁజేయునే ; సఖీ,
20 పరవశాత్మఁ జేసె దైవము ; సఖీ,
కరుణ లేనివలపు నన్ను గళము పట్టెనే ; సఖీ,
ఒక్కటే శరణము నా కిఁక, సఖీ,
తక్కు యుసురు సీవిరాలి దాఁటెదను బలే. సఖీ,

సుసం—[సకరుణము] ప్రియసఖి, సాగరికా, ఊఱడిల్లు ఊఱడిల్లు.

25 [నేపథ్యమున కోలాహలము]

ఉ. దారితశిష్టఁ గంఠగ నధఃస్థిత సీధ్ధుచుఁ బైఁడిశృంఖలన్
ద్వారములందు దూఁటుచు నుదారరణత్పదకింకిణీక మై
భీరుల భీతిగొల్పు చనువిద్రవదాకులితాశ్వపాల మై
చేరెను సాహిణంపుఁ గపి చెచ్చెర దాఁటుల రాజవేశ్మమున్,

మఱియు,

చ. పడయమి లెక్కఁ బూనుచుఁ బాఱిరి షండులు నానగండలై,
ముడిఁగిరి వామనుల్ భయము ముంపఁగఁ గంచుకికంచుకంబులో,
కడలఁ గిరాతకుల్నిలిచి కాంచిరి సార్థకనామభావమున్,
నడిచిరి కుబ్జులు కనంబడ నోడుచు మెల్లమెల్లఁగాన్.    5

సుసం.—[విని మోఁతలం గాంచి సంభ్రమంబున లేచి సాగరికచేయి పట్టుకొని] సఖి, లేవే లేవే, ఇదుగో చెడుకోతి ఇక్కడికే వస్తూవున్నది.

సాగ.—అయితే ఇప్పుడు ఏమి చేతాము ?

సుసం.—రా, ఈచీకటిచెట్ల చీకటిలోజొచ్చి దీన్ని తప్పించుకొందాము.

[పరిక్రమించి యిరువురు భయముతో చూచుచు ఏకాంతమున నిలుతురు. 10

సాగ.—సుసంగతా, ఏమే చిత్తరుపలక వదలి వచ్చితివి ? ఒకవేళ ఎవరైనా దాన్ని చూచేరు.

సుసం.—ఓసి స్వస్థంగా వుండు. ఇప్పుడుగూడా చిత్తరుపలకతో పని యేమే ? ఈపెరుగుకూటియాసపోతు చెడుకోతి ఈపంజరాన్ని తెరిచి దాటిపోయింది. మఱి మేధావిని ఎక్కడికైనా పోతుంది. అందుకోసం త్వరగా కూడా వెళ్లి దాన్ని పట్టు 15 కొందాము రా. మనమాటల అక్షరాలు గ్రహించి ఎవరిదగ్గరనైనా వెళ్లబెడుతుండి.

సాగ.—సఖి, అలాగే చేతాం.    [అని పరిక్రమింతురు.

[నేపథ్యమున]

బలే బలే ! ఆశ్చర్య మాశ్చర్యం !

సాగ.—[చూచి] సుసంగతా, మళ్లీ ఆచెడుకోతే వస్తూవున్నట్టుంది.    20

సుసం.—[చూచి నవ్వి] ఓసి పిరికీ, భయపడకు, ఇతడు ఏలినవారి పార్శ్వవర్తి వసంతకయ్య.

[అంతట వసంతకుఁడు ప్రవేశించును.]

వసం.—బలేబలే ! ఆశ్చర్యమాశ్చర్యం! బళిరా! శ్రీఖండదాసుడా ధార్మికుడా, బళీ !    25

సాగ.—[ఆక్కఱతో చూచి] సఖీ సుసంగతా, ఇతణ్ణి చూడవలసినదే సుమా.

సుసం.—సఖి, ఇతణ్ణి చూస్తే ఏమి ఫలం? ఆశారిక దూరం వెళ్లింది. రా వెంబడింతాము.    [అని నిష్క్రమింతురు.

వసం.—బళిరా! శ్రీఖండదాసుడా బళీ!—నీ ఆదోహదాన్ని ఉపయోగించిన మాత్రాన నవమాలిక ఈలాటిదైనది దట్టంగా మొలిచిన పూవుమొత్తాలతో వెలుగుతూవున్న కొమ్మలచేత దేవి పెంచుకొన్న మాధవిని చూచి నవ్వుతూ వున్నట్లు కనబడుతున్నది.—కనక వెళ్లి ప్రియవయస్యుడికి నివేదిస్తాను. [పరిక్రమించి చూచి]

5 ఇదుగో ప్రియవయస్యుడు; ఆదోహదము మీది నమ్మకంచేత నవమాలికని పూచినదాన్ని పరోక్షాన్నే ప్రత్యక్షంగా చూస్తూ వున్నట్టు సంతోషంచేత కండ్లు వికాసం పొందగా ఇక్కడికే వస్తువున్నాడు. ఇతనిదగ్గిరికి వెళ్తాను. [అని రాజుకడకుం బోవును.

[అంతట యథానిర్దిష్టుఁడు రాజు ప్రవేశించును.]

రాజు.—[హర్షముతో]

10 తే. పాండువును సోత్కలిక దీనిఁ బ్రాప్తజృంభ
నవిరళశ్వసనోద్గమాయాసితాత్మఁ
గంతుయుత లాఁతిసకిఁ బోలెఁ గనుచు లతను
బొనరిచెద దేవిముఖమునఁ గినుకకెంపు. 30

విదూ.—[తటాలున సమీపించి] జయం జయం ప్రియవయస్యుడికి. వయస్యుడా,

15 బళీబళీ నీకు మేలు కలుగుతున్నది. ఏలాగంటే.—

["ఆదోహ దాన్ని" ఇత్యాది మరల పఠించును.

రాజు.స.—వయస్యుఁడా, సందేహమేమి? మణిమంత్రౌషధుల ప్రభావము ఊహింప నలవిగానిది గదా. చూడు.—

మ. కలనఁ శ్రీపతికంఠ కౌస్తుభమణిఁ గన్నంతనే శాత్రవుల్

20 తలఁగం బాఱరె? పన్నగంబులు ధరఁ దాఁకోవె మంత్రాహతిఁ?
తొలి రామానుజవీరవానరభటాదు ల్మేఘనాదాహతుల్
బలుదివ్యౌషధిగంధ మాని మరలఁ బ్రాపింపరే జీవముఁ? 31

మఱి దారిచూపు, దానిని చూచి నేత్రసాఫల్యము ననుభవించెదము.

విదూ.—[అటోపముతో] రా నీవు రా.

25 రాజు.—ముందు పొమ్ము.

[ఇరువురు గర్వముతో పరిక్రమింతురు.

విదూ. —[విని భయపడి వెనుకకు మరలి తేనిచేయి పట్టుకొని సంభ్రమముతో] వయస్యుడా రా పాఱిపోదాం.

రాజు.—ఎందుకోసము ?

విదూ.—ఈపొగడచెట్టులో ఏదో భూత మున్నది.

రాజు—ఛీ మూర్ఖుఁడా, భయపడక నడువుము; ఇట్టివానికి ఇక్కడ ప్రభావ 5 మెక్కడిది ?

విదూ.—స్పష్టాక్షరంగా పలుకుతున్నది. నామాట నమ్మకం గాకపోతే ముందు నడిచి నీవే స్వయంగా విను.

రాజు.—[అట్లు చేసి విని]

తే. విస్ఫుటంబుగ వర్ణముల్ వినఁగ నగుట, 10
స్త్రీస్వభావోచితంబుగాఁ దియ్య నగుట,
నల్పతను వొటచే నని ప్రౌఢి యగుటఁ,
బలుకునది శారిక యటంచుఁ దలఁతు నేను. 3౨

[పైని చూచి నవ్వి] ఏమీ ! శారికసుమా.

విదూ.—[పైని చూచి] ఏమి ! నిజంగా శారికే. 15

రాజు.—[నవ్వి] అవునోయి.

విదూ.—ఓయి వయస్యుడా, నీవు బలే పిరికివాడవే, శారికని భూతమన్నావు ?

రాజు.—ఛీ మూర్ఖుడా, నీ చేసినదానిని నామీఁద పెట్టెదవు !

విదూ.—ఓయి అట్లైతే నన్ను నివారించకు. [రోషముతో చేతికఱ్ఱ నెత్తి] అన్నా ! దాసికూతురా, నిజంగా నేను భయపడతా నని నీవు అనుకొన్నావా ? 20 అట్లైతే క్షణ ముండు. నేను కొండెగాళ్ళ హృదయంలాగ కుటిలమైన యీచేతికఱ్ఱతో పండిన వెలగపండులాగ ఈ పొగడచెట్టునుంచి నిన్ను నేలకి పడేలాగ కొడతా.

[అని కొట్ట నుంకించును.

రాజు.—[నివారించుచు] మూర్ఖుఁడా, ఇది దేనినో రమణీయమైనదానిని పలుకు చున్నది. దీని నేల బెదరఁగొట్టెదవు ? విందుము గాక. [ఇరువురును విందురు. 25

విదూ.—[విని] ఇది పలుకుతూ వుంది, ఈ బ్రాహ్మడికి అన్నం పెట్టూ అని.

రాజు.—కుక్షింభరికి సర్వము భోజనవిషయముగానే పర్యవసించును. సరిగా చెప్పు, శారిక ఏమి పలుకుచున్నదో.

విదూ.—[విని] వయస్యుడా, ఇది అన్నమాట నీవు విన్నావా ? ఇది అంటు
న్నది—‘సఖి, ఎవరిని నీవిక్కడ వ్రాసినావు ? ఈజరుగుతూవున్న మదనోత్సవంలో
కామదేవుణ్ణి వ్రాసినాను,’ అని. మళ్లీ చెప్పుతూవుంది—‘సఖి, నీవు నన్నేల యిక్కడ
వ్రాసినావు ? ఎందుకే కారణంలేకనే కోపగిస్తావు ? నీవు ఎటువంటి కామదేవుణ్ణి వ్రాసి
5 నావో నేనున్ను అటువంటిరతినే వ్రాసినాను. మరి వేఱువిధంగా భావించడంమాను.
ఈ దాపరికం ఎందుకే ? వృత్తాంతమంతా చెప్పు.’ అని. ఓయి వయస్యుడా, ఏమి
టోయి యిది ?

రాజు.—వయస్యుఁడా, నాకు ఇట్లు తోఁచుచున్నది. ఎవతెయో హృదయ
వల్లభుని చిత్తరువున వ్రాసి సఖిమ్రోల కామదేవుఁ డని మిష పెట్టి కప్పుకొన్నది.
10 అంతట సఖి గుట్టు కనిపట్టి నేర్పుచేత ఆ చిత్తరువులోనే ఆ చెలువప్రతిమను వ్రాసి
రతి యని మిషపెట్టి చూపించినది.

విదూ.—[చిటిక వైచుచు] వయస్యా, ఇది సరిపడుతూ వుంది.

రాజు.—ఓయి వయస్యుఁడా, సందడిచేయకు. మరల పలుకుచున్నది. విందము
గాక. [ఇరువురు విందురు.

15 విదూ.—ఓయి, ఇది మళ్లీ యీలాగు అంటున్నది.—‘సఖి, లజ్జపడకు. ఇటు
వంటి కన్యారత్నానికి ఇటువంటి వరునిమీద అవశ్యంగా వలపు కలుగుతుంది.’ అని.
కనక ఆ వ్రాయబడినది కన్య; దర్శనీయ కూడా.

రాజు.—అట్లయిన, సావధానముగా విందముగాక. ఇందు మాకు కుతూహలము
నకు అవకాశ మున్నది.

20 విదూ.—ఓవయస్యుడా, నీవేమో మహాపండితుడ నని గర్వపడకు. నేను దీని
నోటినుంచీ విని సర్వమూ నీకు వక్కాణిస్తాను. [అని యిరువురును విందురు.

విదూ.—విన్నావా ఇది చెప్పినమాట ? ‘సఖి, నా సంతాపము మరీ యెక్కు
వగా బాధిస్తూవున్నది. సఖి, తీసివేయి యీ తామరాకులమున్ను తూటికడియాలనున్ను.
ఇవేల ! వృథాగా ఏల నన్నాయాస పెట్టుకోవడము ?’

25 రాజు.—వయస్యుఁడా, వినుట మాత్రమే గాదు, అభిప్రాయమును కూడ కని
పట్టితిని.

విదూ.—ఓయి వయస్యుఁడా, ఈశారిక దాసికూతురు ఇంకా ఏమేమో కురు
కురు మంటున్నది.

రాజు.—సరిగానే చెప్పితివి. [అని యిరువురు విందురు.

విదూ.—వయస్యా, ఈశారిక దాసికూతురు నాలుగువేదాలు చదివినబ్రాహ్మడి లాగ ఋక్కులు పఠించ నారంభించిందే !

రాజు.—వయస్యుఁడా, నేను పరధ్యానములో వినలేదు, చెప్పు ఇదేమి పలికినదో.

విదూ.—ఓహో ఈలాగ పలికింది.

(గేయము.) 5

అందరాని పండుగోరితిఁ ; డెందమందు నాన నన్ను డిందఁజేయునే. సఖీ,
పరవశాత్మ చేసె దైవము ; కరుణ లేని వలపు నన్ను గళముపట్టెనే. సఖీ,
ఒక్కటే శరణము నాకిఁక,తక్కు యౌసురు నీ విరాళి దాఁటెదను బలే. సఖీ,

రాజు.—(స్మితముతో) వయస్యుఁడా ఇటువంటిబ్రాహ్మణుఁడవు నీవు దక్క మఱి యెవ్వరు ఇటువంటి ఋక్కులు ఎఱిఁగినవారు ? 10

విదూ.—అటయితే మఱి యి దేమిటి ?

రాజు.—ఇది పాటసుమా.

విదూ.—పాటా ఇది ! అయితే ఏమి చెప్పినట్లు ?

రాజు.—వయస్యుఁడా, ఎవతెయో శ్లాఘ్యయౌవన ప్రియతముని పొందు అలవడమి చే ప్రాణముమీఁదియాస వదలి యిట్లు పలికినది. 15

విదూ.—[బిగ్గరగా నవ్వి] ఓయి, ఎందుకీ వంకరమాటలు, తిన్నగా ఎందుకు చెప్పవు—నన్నే పొందనందున అని ? నిన్ను గాక మరి యెవ్వని పూవిల్తు డనేమిషచే కమ్మ నగును. [చేతులతో చప్పట్లుకొట్టి బిగ్గరగా నవ్వును.

రాజు.—[ఊర్ధ్వము చూచి] ఛీ మూర్ఖుఁడా, బిగ్గరగా నవ్వి, పాపము ! ఆ శారికను బెదరఁగొట్టితివి? అందుచేత అది ఎక్కడికో ఎగిరిపోయినది. [అని నిరూపింతురు. 20

విదూ.—[చూచి] వయస్యుడా మ రెక్కడికీ గాదు. అది అరటిచెట్లయింటికి వెళ్లింది. రా, మరి, వెంబడింతాము. [అని పరిక్రమింతురు.

రాజు.—

తే. కామిని వచించుఁ దాళిక కంతుబారి
దేని నెయ్యంపుసకులతో, దాని నల్ల 25
వెండి శుకశిశుశారికల్ వెల్లడింప,
ధన్యులకు నగు శ్రవణసుధారసంబు. 38

విదూ.—వయస్యుఁడా, ఇదుగో అరిటిచెట్ల యిల్లు. ఇందులోపలికి వెళ్దాము.
[అని యిరువురు ప్రవేశింతురు.

విదూ.—ఏ మయ్యోవు ? ఎందుకు దాసికూతురిని ఈశారికని వెదికేప్రయాస ? ఇక్కడ మలయమారుతంచేత కదులుతూవున్న లేతయరిటాకులచేత చల్లనైన యీ రాతి తిన్నెమీద క్షణంసేపు విశ్రమింతాము.

రాజు.—నీకు రుచించినట్లే చేయుందము.

5 [అని కూర్చుందురు. రాజు నిట్టూర్చి "కామిని" ఇత్యాది మరలం బఠించును.

విదూ.—[పార్శ్వమున జూచి] వయస్యా, ఇదె ఆశారికపంజరము గానలెను, దీనితలుపును ఆకుష్టవానరము తెరిచియుండబోలును.

రాజు.—నిరూపింపుము.

విదూ.—నీయాజ్ఞ. [అని పరిక్రమించి చూచి] ఇదుగో చిత్తరుపలక ఒకటి
10 ఉన్నది. దీన్ని పుచ్చుకొంటాను. [పుచ్చుకొని చూచి హర్షము నటించును.

రాజు.—[కుతూహలముతో] వయస్యా, ఏ మది ?

విదూ.—వయస్యా, నీయదృష్టము దొడ్డది- ఇదే నేను చెప్పినది అది. నిన్నే ఇక్కడ వ్రాసి ఉన్నది. కాక మరెవ్వని పూవిల్తు డని మిష పెట్టగలదు?

రాజు —[హర్షముతో చేతులు చాచి] మిత్రమా, చూపు చూపు.

15 విదూ.—నీకు చూపను. ఆకన్యప్రతికూడా ఇందులోనే వుంది. ఏమీ పారితోషికం లేకుండా ఇటువంటి కన్యారత్నాన్ని చూపిస్తారా ?

రాజు.—[కడియమును తివిచి యిచ్చుచునే చిత్తరుబలకం బలిమిం గైకొని చూచి ఆశ్చర్యముతో] వయస్యా, చూడవోయి.

తే. తొయ్యలి యొనర్తు లీలావధూతపద్మ
20 పక్షపాతంపుం బేర్మి నాపయిం దెలుపుచుం,
జిత్రగత మానసమును విచిత్రసరణిం
జేరుచున్నది రాజహంసియును బోలె. 3౫

మఱియుం,

తే. ముదితవదనం బనునపూర్వపూర్ణచంద్రు
25 నించువేడుకం దా సృజియించి ధాత,
అంత మొగిడిన నిజపీఠికాంబుజమునం
జిక్కి యుక్కిరిబిక్కిరిం జెందె నిజము 3౬

[అంతట సాగరికయు సుసంగతయు ప్రవేశింతురు.]

సాగరిక.—సఖి, సుసంగతా, మనకు శారిక దొరికింది గాదు. మరి చిత్రఫలక సైనా యీయరిటిచెట్ల యింటిలోనుంచి తెచ్చుకొని త్వరగా వత్తాము.

సుసం—సఖి, అలాగే చేతాం. [అని ఉపసర్పింతురు.

విదూ.—వయస్యుఁడా, ఎందుకు ఈమె ముఖము వంచుకొన్నదిగా వ్రాయబడినది? 5

సుసం.—[విని] సఖి, వసంతకయ్యమాట వినబడుతూవున్నది. అందుచేత నే ననుకొంటాను దొరవారుగూడ ఇక్కడనే ఉన్నారని. కనక అరిటిగుబురుచాటున ఉండి చూతాము. [అని యిరువురు విందురు.

రాజు.—వయస్యా, చూడు చూడు.

[“ ముదితవదనంబు ” ఇత్యాది మరల పఠించును. 10

సుసం.—సఖి, సాగరికా, నీయదృష్టము పండినది. ఇదుగో నీ హృదయవల్లభుఁడే నిన్నే వర్ణిస్తూ వున్నాఁడు.

సాగ.—[లజ్జతో] సఖి, ఏల నీవేళాకోళస్వభావముచేత నన్ను చులకన చేస్తావు?

విదూ.—[రాజును కదిపి] అడుగుతున్నానే—'ఎందుకయ్యా ఈమె మొగము 15 వంచుకొన్నదిగా వ్రాయబడినది?' అని.

రాజు.—వయస్యా, శారికయే అంతయు తెలియఁజేసినది.

సుసం.—[నవ్వి] సఖి, శారిక తనమేధావిత్వాన్ని చూపించింది.

విదూ.—ఇది నీకు నేత్రానంద మవునా కాదా?

సాగ.—[సాధ్వసముతో స్వగతము] ఈయన ఏమి చెప్పునో ఎరుగను. నిశ్చయ 20 ముగా మరణజీవితాలమధ్యలో ఉన్నాను.

రాజు.—వయస్యుఁడా, నేత్రానంద మని చెప్పవలయునా?

ఉ. ఊరుల నెట్టులో కడచి, యూరు భ్రమించి నితంబమండలిన్,
పాలివళిత్రయీవిషమ మాకవుఁ దీవఁ జలింపకుండి, దు
ర్వారతృషంబలెన్ గుచధరంబుల నల్లన నెక్కి, చూపిదే
వారక కాంచు బాష్పలవవాహిని గోర్కి విలోచనద్వయిన్. 32 25

సాగ.—[విని స్వగతము] హృదయమా, తేరుకో తేరుకో, ఊరడిల్లు ఊరడిల్లు. నీకోరికకూడా ఇప్పుడు ఈయంతస్థు ఎక్కినది!

సుసం.—సఖీ, విన్నావా?

సాగ.—[నవ్వి] నీవే విను. నీచిత్రరువ్రాతనేర్పునే గదా పొగుడుతున్నాడు!

విదూ.—[పలకను చూచి] వయస్యుడా, ఇటువంటి సొబగురాళ్లు వచ్చేటూ ఎవ్వని ప్రియసమాగమానికై ఉవ్విళ్లూరుతారో అటువంటి నీమీద నీకే ఎందుకు ఈతిర
5 స్కారము? అందుకోసమే కూడానే వున్న నీప్రతిమ కేసి చూడవేమి?

రాజు.—[చూచి] వయస్యా, ఈసుందరి నన్ను వ్రాసినందులకు నిశ్చయముగా నాయందు నాకు గౌరవమే. మఱి చూడ కేమి! చూడు.

తే. చెలువ చిత్రంబు వ్రాయుచోఁ జిందినట్టి
బాష్పజలశీక రాళి నావపువుమీఁద
10 భాసిలెడు నిది తత్కరస్పర్శచేతఁ
బొటమరించినఘర్మాంబుపుంజ మనఁగ. 3౮

విదూ.—[పార్శ్వమందుం గని] వయస్యా, ఇది నిశ్చయంగా ఆవిడకోసము వరసమునైన లేఁతతామరాకులతోటిన్ని తామర తూళ్లతోటిన్ని చేసినది, ఆవిడయొక్క మదనసంతాపానికి సూచకంగా కనబడుతూవున్నది.

15 రాజు.—వయస్యా, నేర్పుతో కనిపట్టితివి. అట్లే—

చ. ఇరుగడల న్గురుస్తనసమిద్ధనితంబము లొత్త మ్లానమై,
హరితము లైయ నభఃప్రతిమ మౌఁకవునంటమి నంతరంబునన్,
కరము భుజాలతల్ విసరఁగా నిట నోరల వీటతాట మై,
తరుణమృణాళినీచ్ఛదనతల్పము తెల్పెడి లేమతాపమున్. 3౯

20 మఱియు,

తే. లేమ పయ్యెద యగుదొడ్డ తామరాకు
తెలుప దట్లుగ లోనిపూవిలుతుకడిమిఁ
దెలుపు నెట్లు వేఁడిమికిఁ గమలినయట్టి
మండలంబులఁ బాలిండ్లదండితనము. ౪౦

25 విదూ.—[నాట్యముచే తామరతూఁడు కైకొని] వయస్యుడా, ఇది ఆమెదే. మరి యొకటి, గబ్బిగుబ్బల నడమనుంచి జాఱిపడి క్లేశపడుతూవున్నది నున్ననితామరతూటి హారము. దీన్ని చూడు నీవు.

రాజు.—[కైకొని ఉరమున నుంచుకొని నిందించుచు] ఓజడమా,

తే. చెలువచనుగిండ్లనడిమికిఁ దొలఁగి రాలి
యేల వసివాడె దిట్లు మృణాళసరము ?
నీదుప్రోఁగున కే నట లేదు తావు,
నీకు నేరీతిఁ గల్గునో నీవ చెపుము ౮౧ 5

సుసం.—[ఆత్మగతము] అయ్యో, ప్రభువు మితిమించినమరులు చేత హృదయాన తల్లడపడి ఏమేమో అసంబద్ధము పలుకుతున్నాడు ! మరి యింక ఉపేక్షించడం సరి కాదు. కనక ఇలా గవుగాక. [ప్రకాశము] సఖి నీవు ఎవరికోసము వచ్చినావో ఆతడు నీయెదటనే వున్నాడు.

సాగ.— [అసూయతో] నేను ఎవరికోసము వచ్చినాను ! ఇక్కడ ఎవరు 10 ఉన్నారు ?

సుసం.—[నవ్వి] ఏమో శంకిస్తావేమే. చిత్తరుపలకలోని పూవిల్తునికోసం గదా నీవు వచ్చినావు ? పుచ్చుకో చిత్తరువుపలకను.

సాగ.—[రోషముతో] నీతో ఇటువంటిమాట లాడడానికి నేను జాణను కాను. కనక అవతలికి వెళ్తాను. [అని పో నుంకించును. 15

సుసం.—ఓసి ఓర్పులేనిదానా, ఇక్కడనే క్షణముండు నేనే వెళ్లి ఈయరిటి యింటిలోనుంచి చిత్తరుపలకను తెస్తాను.

సాగ.—సఖి, ఆలాగే చేతాం.

[సుసంగత కదళీగృహాభిముఖిగా పరిక్రమించును.

విదూ.—[సుసంగతను జూచి సంభ్రమముతో] వయస్యుడా, ఈచిత్రఫలకాన్ని 20 కప్పివేయి. ఇదే దేవికరిచారిక సుసంగత వస్తూవున్నది.

[రాజు వస్త్రాంతముతో ఫలకమును కప్పును.

సుసం.—[సమీపించి] జయం జయం ఏలినవారికి.

రాజు.—సుసంగతా, స్వాగతము ఇక్కడ కూర్చుండు.

[సుసంగత కూర్చుండును. 25

రాజు.—సుసంగతా, నే నిక్కడ నున్నా నని నీ కెట్లు తెలిసినది ?

సుసం.—[నవ్వి] దేవర యిక్కడ వుండడంమాత్రమే గాదు, చిత్తరుపలకతో కూడా సకలవృత్తాంతమున్ను నాకు తెలిసినది. కనక వెళ్లి దేవితో చెప్తాను.

[అని పో నుంకించును.

విదూ.—[అపవారించి భయముతో] వయస్యుడా, ఇది యింతా చేశేదే, గర్భదాసి యిది పేలుడుగుణం గలది, అందుకోసం దీనికి ఏమయినా లంచ మియ్యావోయి.

రాజు.—నీవు చెప్పినది యుక్తమే. [సుసంగత చేయి పట్టుకొని] సుసంగతా, ఇది ఉత్తవినోదము. నిష్కారణముగా నీవు దేవిని వ్యథపెట్టుట సరిగాదు. ఇంద, పారి
5 తోషికము పుచ్చుకో. [అని ఆభరణమును తివిచి ఇయ్యఁబోవును.

సుస.—ప్రభూ, అక్కఱలేదు ఈకర్ణాభరణము. నేను భట్టినిప్రసాదంచేత ఎంతెంతో పొందివున్నాను. ఇదే నాకు గొప్పయనుగ్రహము. ఏమంటే, 'ఎందుకోసం చిత్తరుపలకలో నన్ను వ్రాసినావు?' అని నాప్రియసఖి సాగరిక నామీద కోపం చేస్తూ వున్నది. వెళ్లి ఆమెను చేయిపట్టుకొని కోపము తీర్చు.

10 రాజు.—[సంభ్రమముతో లేచి] ఎక్కడ నున్నది? చూపు చూపు.

సుసం.—ఇదుగో ఇక్కడే అరటిగుబురుచాటున వున్నది.

రాజు.—[హర్షముతో] దారి చూపుము.

సుసం.—ఇటు ఇటు ఏలినవారు. [అందఱును కదళీగృహమునుండి వెలువడుదురు.

సాగ.—[రాజుం గని సహర్షముగా సభయముగా సకంపముగా సలజ్జముగా స్వగ
15 తము] ఈయనం గని అతిభయముచేత అను గ్గత్తి అడుగు పెట్టలేకుండా ఉన్నాను. మఱి యిక నే నేమి చేతును ?

విదూ.—ఓయి, ఈచిత్రఫలకాన్ని నేను పదిలం చేస్తాను. ఒకవేళ దీనితో మళ్లీ పని రావచ్చును. [సాగరికను చూచి] హీంహీం! హాహా! ఆశ్చర్య మాశ్చర్యం ! ఇటువంటి కన్యకారత్నము మనుష్యలోకంలో కనబడదు. నే ననుకొంటాను బ్రహ్మకూడా ఈ
20 మెను సృజించి ఆశ్చర్యములో మునిగివుండును.

రాజు.—వయస్యా, నాకును మనస్సులో ఇట్లుతోఁచుచున్నది.

తే. తనదుగద్దియరుచి మీఱుకనుఁలఁ దెఱచి
*పలికె నలుమోముల న్విధి బళిబళి యని,
అబ్బురంపోయి శిరము లిట్టట్టు నూఁచె,
25 ద్రిజగతీలలామంబు నీతెఱఁగుఁ జేసి. ౧౨

సాగ.—[అసూయతో సుసంగతం గాంచి] సఖి, ఇదా నీవు తెచ్చినచిత్రఫలకము ? [అని కోపి సుంకించును.

---

* నలుమొగముల నొకట విధి బళిబళియనె.

రాజు.—

చ. కనలునఁ జూడ్కి నై చెదవు గావుత భామిని, యట్టులైననున్
గొన దది రూక్షభావము నకుంఠితమా ననురక్తి పెంపునన్ ;
చను మెలమెల్ల, సంభ్రమము జూపు, తడంబడె నేని పాదముల్,
ఘన మగునీకితంబ మిది కాంతరొ చెందు నమందఖేదముల్. ౪౩ 5

సుసం.—ప్రభూ, ఈమె ఎప్పుడూ అతికోపకత్తె. కనుక కొనచేయి పట్టుకొని ఈమెకోపాన్ని తీర్చు.

రాజు.— [ఆనందముతో] నీవు చెప్పినదిసరి. [సాగరికను కేలఁబట్టి స్పర్శసుఖము నభినయించును]

విదూ.—వయస్యా, నీకు ఈమె నిక్కంగా అపూర్వశ్రీ దొరికింది. 10

రాజు.—వయస్యుఁడా, నిజముగా—

క. శ్రీదేవియ యగు నిజ మిా
పైదలి, కేల్ పారిజాతపల్లవమ యగున్ ;
కాదేని యేల తొఁగెడున్
స్వేదచ్ఛద్మమున నమృతశీకరగణముల్ ౪౪ 15

సుసం.—సఖి, నీవు ఇప్పుడు అదక్షిణురాలవుగా వున్నావు, ఈపంథగా ఏలినవారు చేయిపట్టినా కోపం మానవు.

సాగ.—[*అభ్యసూయతో] సుసంగతా, ఇప్పటికిన్ని, మానవా ?

రాజు.—ప్రియా, సాగరికా, సఖీజనము మీఁద ఏరకోపము యుక్తము కాదు.

విదూ.—ఏ మమ్మా, ఆకలిగొన్న బ్రాహ్మణుడిలాగ కోపగిస్తావు ? 20

సాగ.—సఖి, నీతో నేను మాటలాడను.

రాజు.—ఓసి కోపనురాలా, సమానగౌరవ లయిన సఖులయెడ నిది తగదు.

విదూ.—ఓహో ! నిశ్చయంగా ఈమె మరివికతె, కోపకత్తె వాసవదత్త !

[రాజు భయముతో సాగరికచేతిని వదలును.

సాగ.—[సంభ్రమముతో] సుసంగతా, ఇప్పుడేమి చేయుదును ? 25

సుసం.—ఈ కదళీవాటికలోగా వెళ్లిపోదాము [అని నిష్క్రమింతురు.

రాజు.—[పార్శ్వములను బరికించి, ఆశ్చర్యముతో] ఏదోయి దేవి వాసవదత్త ?

విదూ.—అయ్యా, ఆమె యెక్కడనో నాకు తెలియదు. మరి నేను దీర్ఘరోషంలో ఈమె ఇంకొక వాసవదత్త అని చెప్పినాను.

---

[*బొమముడితో]

రాజు.—ఛీ మూర్ఖుఁడా !

తే. దైవవశమున నెట్లొకో తా దొరకియుఁ
గాంత రత్నావళియుఁ బోలెఁ గథితరాగ
కంఠమునఁ దాల్పుమన్న నాకరమునుండి
5 దుసికిలం బడె నీదు తుందుడుకువలన. ౪౫

[అంతట వాసవదత్త కాంచనమాలయును ప్రవేశింతురు]

వాస.— ఓసి కాంచనమాలా, ఆర్యపుత్రుఁడు పెంచుకొన్న ఆ నవమాలిక ఇంకా ఎంతదూరము ?

కాంచ.—ఇదుగో ఈయరిటియింటికి అవతల.

10 వాస.—అయితే దారి చూపు.

కాంచ.—ఇటు ఇటు భట్టిని. [అని పరిక్రమింతురు.

రాజు.—వయస్యా, ఇప్పుడు ప్రియతమను ఎక్కడ చూడ నగును ?

కాంచ.—భట్టిని, సమీపాన ఏలినవారిమాట వినబడుతూవున్నది. కనుక నే నను కొంటాను భట్టినికే ఎదురుచూస్తూవున్నా రని. మరి సమీపించు భట్టిని.

15 వాస.—[సమీపించి] జయం జయం ఆర్యపుత్రునికి.

రాజు.—[అపవారించి] వయస్యా, చిత్రఫలకమును దాఁచియుంపుము.

[విదూషకుఁడు గ్రహించి చంకలో పెట్టుకొనును.

వాస.—ఆర్యపుత్రా, నవమాలిక ననిచినదా ?

రాజు.—[ఆశ్చర్యముతో] దేవీ, నీవు విలంబించుచున్నందున మేము ముందుగా
20 వచ్చియుం దానిని చూడకున్నాము. ఇప్పుడు గా, కలిసియే పోయి చూతము.

వాస.—[చూచి] ఆర్యపుత్రుని ముఖదర్శనం చేతనే తెలిసినది నవమాలిక ననిచిన దని. కనుక నే నక్కడికి వెళ్లను.

విదూ.—అమ్మా, అటైతే జయము మాదే గదా !

[అని చేతులు చాఁచి, నృత్యము చేసి, చంకలోనుండి పడిన
25 చిత్రఫలకముం గాంచి విషాదముం జెందును.

[రాజు అపవారించి ప్రేంతో చూపుచు వసంతకుని ముఖమును చూచును.

విదూ.—[అపవారించి] ఓహోయి కోపగింపకు. ఇందుకు నేను ఉత్తరము చెప్ప నేర్తును.

కాంచ.—[ఫలకమును పుచ్చుకొని] భట్టిని, చూడు, ఇక్కడ చిత్రఫలకంలో
30 ఏమి లిఖితమై యున్నదో.

వాస.—[చూచి స్వగతము] ఇతడు ఆర్యపుత్రుడు, ఇది మరి సాగరిక. [ప్రకాశ ముగా రాజును జూచి సకోపహాసముగా] ఆర్యపుత్రా, దీన్ని ఎవరు వ్రాసినారు?

రాజు.—[సవైలక్ష్యస్మితముతో, అపవారించి] వయస్యా, ఏమి చెప్పుదునోయి?

విదూ.—[అపవారించి] ఓయి చింతించకు. ఇందుకు ఉత్తరం నేను చెప్తాను. [ప్రకాశము వాసవదత్తనుగూర్చి] అమ్మా, వేరువిధంగా తలచకు; ఎవ్వరుగాని తమ్ము 5 తాము వ్రాసుకోలేరని నేననగా విని ప్రియవయస్యుడు తన చిత్తరువువ్రాత నేర్పును చూపినాడు.

రాజు.—వసంతకుఁడు ఏమి చెప్పినాఁడో అదే వాస్తవము.

వాస.—[ఫలకమును చూచి] ఆర్యపుత్రా, ఈమెకూడా ఇం కొకతె నీ పక్కను చిత్తరువులో నున్నదే ఇదేమి ఆర్య వసంతకుని శిల్పనైపుణ్యమా? 10

రాజు.—[సవైలక్ష్యస్మితముతో] దేవి, వేఱువిధముగా శంకింపకు. ఈ కన్యక నేను నాబుద్ధిచేత కల్పించివ్రాసినదే గాని పూర్వ మెప్పుడును నేను చూచినది గాదు.

విదూ.—నిజము. నాజంధెముసాక్షిగా చెప్తాను, ఇటువంటిదానిని మేము ముం దెప్పుడున్ను చూచినవారము గాము.

కాంచ.—[అపవారించి] భట్టిని, ఒకవేళ ఇటువంటిది ఘుణాక్షరంలాగ సరి పడిన సరిపడవచ్చును. కనుక కోపము మాను. 15

వాస.—[అపవారించి] ఓసి సరళహృదయురాలా, ఇతనివంకరమాటలను ఎఱు గవు. ఇతడు వసంతకుడుగదా. [ప్రకాశము రాజునుగూర్చి] ఆర్యపుత్రా, నాకు మరి ఈచిత్తరువు చూడగా తలనొప్పి వచ్చివున్నది. మరి ఆర్యపుత్రుడు సుఖముండు గాక. నేను వెళ్తాను. [అని పో నుంకించును.

రాజు.—[వస్త్రాంతమునం బట్టుకొని] దేవీ, 20

చ. ననుఁగృపఁ జూడుమా యనుట నాయ మె టయ్యెడిఁ గిన్క లేనిచోఁ?
బొనరుప నింక ని ట్లనుట పొచ్చెము సేసితి నంచు నొప్పుటే;
అనిన ననాగసుండ నని, యాపలుకుల్ మృష యందు; వేమి ప
ల్కిన నుచితంబొ నేఁ దెలియ లేకిటఁ గుందెదఁ బ్రాణనాయికా. ౨౬

వాస.—[సవినయముగా వస్త్రాంతమును లాగుకొనుచు] ఆర్యపుత్రా, వేరువిధంగా 25 తలచకు. నిజంగానే నన్ను తలనొప్పి బాధిస్తూవున్నది. కనక నేను వెళ్తాను.

[అని నిష్క్రమించును.

విదూ.—ఓహోయి, నీయదృష్టము మంచిది! ఈ అకాలపు పెనుగాలి వాసవదత్త నిన్ను క్షేమంగానే వదిలి వెళ్లింది.

రాజు.—ఛీ మూర్ఖుడా, సంతోషపడెద వేమి? పోవుటలో దేవి పైకి తెలియనీకుండ మనస్సులో వహించిన దీర్ఘకోపమును నీవు కనిపట్టలేవైతివి. చూడు.

5 ఆ బొమల ముడిచికొనియు మొగముc గద్దయు వాంచె,
వెడ నగియుc గటూక్తి నుడువదాయె,
అంతరశ్రుజడమును నక్షిని విప్పదు,
నెరపెc గిన్కc జెలి వినీతి విడక. ౮౭

విదూ.— వెళ్లినది దేవి వాసవదత్త. నీ వెందుకు ఇక్కడ అరణ్యరుదితం చేస్తూ
10 వుంటావు!

రాజు.—మూర్ఖుడా, దేవికోపమును నీవు కనవైతివి. కావున అన్నివిధములను దేవీప్రసాదనము తప్ప ఇంక వే ఉపాయమును కనలేకున్నాను. మఱి రారమ్ము దేవినే తేర్చుటకు లోనికి పోవుదము. [అని నిష్క్రమింతురు.

కదళీగృహ మనెడు ద్వితీయాంకము సమాప్తము.

---

15 ## ప్రవేశకము

[అంతట మదనిక ప్రవేశించును.]

మదనిక.—[ఆకాశమున] కౌశాంబికా, నీవు భర్తకాడ కాంచనమాలని చూచినావా లేదా? [చెవి యొగ్గి విని] ఏ మంటావు? ఆమె వచ్చి వెళ్లి ఎంతో సేపయింది అంటావా అయితే ఆమెని ఇప్పుడు ఎక్కడ చూడగల్గుదును! [ఎదురకాంచి] ఏమి ఇదే
20 కాంచనమాల ఇక్కడికే వస్తూ వుంది. కనక ఈమెదగ్గిరికి వెళ్తాను.

[అంతట కాంచనమాల ప్రవేశించును]

కాంచ.—[సోత్ప్రాసముగా] బలే గట్టివాడవురా వసంతకుడా, బలే. ఈ సంధి విగ్రహచింతలో నీవు అమాత్యయౌగంధరాయణ్ణి మించినావురా.

మద.— [చిఱునగవుతో సమీపించి] ఓసీ కాంచనమాలా, ఏమి చేశాడు
25 వసంతకుడు నేడు, ఈవిధంగా అతణ్ణి శ్లాఘించడానికి?

కాంచ.—ఓసే మదనికా, దీన్ని అడగడంచేత నీ కేమి ప్రయోజనం ? నీవు ఈరహస్యాన్ని దాచడానికి దంటవు గావు.

మద.—ఎవరియెదటను చెప్పనని దేవిపాదములమీద ఒట్టుపెట్టుకొంటాను.

కాంచ.—అట్లయితే విను మరి, చెప్తాను, నేడు రాజగృహమునుంచి మరలి వెళ్తూ నేను చిత్రశాల ద్వారంలో వసంతకుడు సుసంగతతో ఆడుతున్నమాటలు 5 విన్నాను.

మద.—[కౌతుకముతో] సఖీ, చెప్పు ఆమాటలు ఎటువంటివో.

కాంచ.—వసంతకు డన్నమాట ఇది. అమ్మా సుసంగతా, ప్రియవయస్యుడికి అస్వస్థతకి సాగరికకన్న వేరే కారణం లేదు. కనక ఈ విషయంలో ప్రతీకారాన్ని ఆలోచించు. 10

మద.—అందుకు సుసంగత యేమన్నది ?

కాంచ.—అంతట అది యీలాగన్నది.—'నేను దేవి చిత్రఫలకవృత్తాంతంచేత సందేహపడి సాగరికని నాచేతి కప్పగిస్తూ, నాకు నేపథ్యాన్ని మూటకట్టి బహుమానంగా ప్రసాదించినది ; ఆనేపథ్యంతోనే సాగరికకి దేవీవేషము వేసి నేను కాంచనమాలవేషం వేసుకొని భర్తకడకు వస్తాము. నీవున్ను ఈచిత్రశాల ద్వారాననే కనిపెట్టుకొని వుండ 15 వలసింది. అంతట బండిగురివెందతీగలమండపంలో ప్రభువునకు దానితో సంగమము కలుగుతుంది.' అని.

మద.—ఓసి సుసంగతా, పరిజనవత్సలవి దేవిని ఈవిధంగా వంచించి నీవు చెడిపోతావే.

కాంచ.—ఓసే మదనికా, ఇప్పుడు నీ వెక్కడికి వెళ్లుతున్నావు ? 20

మద.—అస్వస్థశరీరుడైన ప్రభువుయొక్క కుశలవృత్తాంతాన్ని తెలుసుకొని రమ్మని నిన్ను దేవిపంపితే వెళ్లి నీవురావడం ఆలస్యం అయినదని దిగులొందినదై, ఆమె నీకడకే కనుక్కొని రమ్మని నన్ను పంపినది.

కాంచ.—దేవిమనస్సు మిక్కిలి తిన్ననిది. కనకనే యిట్లు నమ్ముతుంది. [పరిక్రమించి చూచి] ఏమి ! ప్రభువు ఈలాగ అస్వస్థతామిషచేత మదనబాధను 25 కప్పుతూ దంతతోరణవలభిమీద కూర్చుండి ఉన్నాడు. రామరి ఈవృత్తాంతాన్ని దేవికి చెప్పుదాం. [అని నిష్క్రమింతురు.

ప్రవేశకము సమాప్తము.

## తృతీయాంకము.

[అంతట మదనావస్థను నటించుచు రాజు ప్రవేశించును.]

రాజు.—[ఉత్కంఠతో నిశ్వసించి]

చ. స్మరశిఖితాపముం హృదయమా, సయిరింపుము ; యిప్డు దీనికిం
5 బరఁగదు శాంతి, బాలకయి వందురె దేల స్పృహా సదా యిటుల్ ?
పొరసినయా నెట్టకే నపుడు మూఢుఁడ నై యిడనైతి నీపయిం
జిరముగఁ జందనద్రవసుషీమముఁ దత్కరపంకజాతముం. ౪౮

అహో ఎంతయాశ్చర్యము ! అట్లే కదా.—

తే. ప్రకృతిచేతను మన సస్థిరమ్ము, మఱియు
10 వీక్షణాగోచరము గుఱివెట్టి యేయ :
అట్టిదాని నాదుమనస్సు నెట్టు లేసె
మాఱుఁ డొనుక్రమ్మఁడినె యెల్లనారసముల ! ౪౯

[ఊర్ధ్వము చూచి] ఓయి కుసుమాయుధుఁడా,

చ. అలుగులు చిత్తజాతునికి నైదె యటంచును, వాని కెందు ల
15 క్ష్యులుమముఁబోంట్లసంఖ్యులనియుం, జగమందుఁ బ్రసిద్ధమెప్పుడున్ ;
తలఁప విరుద్ధమయ్యె నది దర్పక నీయెడ; నీవు పంచతం
గొలిపితి వొంటిఁ గామిజనుఁ గొట్టి యసంఖ్య శిలీముఖంబులన్. ౫౦

[ఆలోచించి] నేను, నిండుకోపమును లోలోన నడంచుకొన్న దేవికంటె కగ్గమయిన యాదీనురాలు సాగరికకోసము ఎంత చింతింతునో అంత ఇట్టియవస్థకు పాలయిన
20 నాకోసము చింతింపను. అట్లే.—

చ ఎఱుఁగుదు రెల్లరుం దనదువృత్తము నంచు శిరంబు వాంచు ని
ద్దఱు తమలోనఁ బల్కికొనఁ దన్నుఁ గుఱించియె యంచు నుల్కెడున్,
పెఱకతలన్ సఖుల్ నగినఁ బెల్లుగఁ బూను విలక్షభావమున్ ;
మఱిఁగెడు నిట్లుప్రాణసఖి మానసనిష్ఠభయంబు పెంపునన్. ౫౧

25 ప్రియావార్తను విచారించుటకై వసంతకుని పంపియున్నాను. ఏలతామసించుచున్నాఁడు ?

[అంతట హృష్టుఁడు వసంతకుఁడు ప్రవేశించును.]

వసంతకుఁడు— [సంతోషముతో] హీహీ ! ఓహోహో ! ఆశ్చర్య మాశ్చర్యం. ఇప్పుడు నావల్ల ప్రియవచనం వినడంచేత నా ప్రియవయస్యుడికి ఎంతహృదయానందము కలుగుతుందో అంతఆనందము కౌశాంబీరాజ్యము రావడంచేతకూడా కలగలే దని అనుకొంటాను. కనక వెళ్లి ప్రియవయస్యుడికి చెప్తాను. [పరిక్రమించి చూచి] ఏమి! ఇదుగో 5 ప్రియవయస్యుడు ఈదిక్కునే చూస్తూఉండడం చూడగా నాకోసమే ఎదురుచూస్తూవున్నా డని తోస్తుంది. ఇతణ్ణి సమీపిస్తాను. [అని సమీపించి] జయం జయం ప్రియవయస్యుడికి. వయస్యా, నీఅదృష్టం పండింది ; నీకోరిక సిద్ధించింది.

రాజు.—[హర్షముతో] వయస్యా, ప్రియకు సాగరికకు కుశలమా ?

విదూ.—[గర్వముతో] ఓహోయి, త్వరలో నీవే చూచి తెలుసుకొంటావు. 10

రాజు.—[పరితోషముతో] వయస్యుఁడా ప్రియను చూడనుగూడ చూచెదనా?

విదూ.—[అహంకారముతో] ఓయి, ఎందుకు చూడవు, బృహస్పతిబుద్ధివిభవాన్ని పరిహసించేవాణ్ణి నేను నీకు మంత్రినై ఉండగా ?

రాజు.—[నవ్వి] ఇది చిత్రముగాదు, నీప్రభావమునకు మితి యెక్కడిది? చెప్పు మఱి, విస్తరముగా వినఁగోరెద. 15

[విదూ.—చెవిలో ఇట్లు ఇట్లు అని చెప్పును.

రాజు.—[పరితోషముతో] వయస్యుఁడ ఇదిగో నీకు పారితోషికము.

[అని చేతినుండి తివిచి కడియము నొసంగును.

విదూ.—[కడియముం దాల్చి తన్ను తాఁ జూచికొని] ఈలా గగుగాక. శుద్ధ సువర్ణకడియముతో అలంకృత మైనయీనా చేతిని ఇంటికి వెళ్లి నాభార్యకి చూపిస్తాను. 20

రాజు.—[అతనిచేయి పట్టుకొని పోనీక ఆఁపుచు] మిత్రమా, తర్వాతఁ జూపుదువుగాని, ఇంకను పగలు ఎంతమాత్రము శేషించియున్నదో కనుంగొనుము.

విదూ.—[పరిక్రమించి చూచి సంతోషముతో] ఓయి, చూడు చూడు. మిక్కుటంపుటనురాగము తనహృదయాన్ని ఈడుస్తూవుండగా ఇదుగో వేయివెల్గుల భగవానులు సంధ్యావధువు ఏర్పరిచినసంకేతస్థానానికి బోలె అస్తాద్రిశిఖరపు అడవిపోతూవున్నాడు. 25

రాజు.—[చూచి హర్షముతో] మిత్రుఁడా చక్కగా కనుంగొంటివి. పగలు ముగిసినది. అట్లేగదా,—

చ అరద మి దేక చక్రము మహాధ్వము లోకమితంబు దాఁటియుఁ
సరగున వేకువ౯ మరల సాగ నశక్త ము టన్న చింత నా౯

తర మిడి సంజ తెరఁ గొన్నఁ దళ్కున రశ్మి లెప్పెడి మాకు లా
హారిదురుచక్ర మ్ముఁ గడపు చక్కఁడు నిల్చెను పశ్చిమాద్రిపై. ౫౨

మఱియు,

తే. పదుయ మిది నాకుఁ బద్మాక్షి, చనఁగవలయు,
5 నిద్రితను నిన్ను మేల్కొల్ప నేనె వత్తు ;
ఇట్లని ప్రమాణ మొనరించునట్లు తోఁచు
నస్తమస్తకమునఁ గరం బత్తి హేళి. ౫౩

మఱి, లేలెమ్ము.—ఆమాధవీలతా మండపమునకే పోయి ప్రియతమా సంకేత
గృహమయమును నిరీక్షించుచుందము.

10 విదూ.—శోభనముగా పలికినావు. [అని లేచి, చూచి] వయస్యుడా, చూడు
చూడు. ఇదుగో చీకటి మొత్తము కలకలని వనరాజినన్ని వేశాన్ని దట్టము చేస్తూ, దట్టంగా
బురదలు ధరించడంచేత వాస్తవంకంటె ఎక్కువబలువుగా కనబడుతూవుండే అడవిపం
దులయొక్కను అడవిదున్నలయొక్కను కారునలుపులో దిక్కుల నన్నిటినీ కనబడ
కుండా చేస్తూ వ్యాపిస్తూ వున్నది.

15 రాజు.—[హర్షముతో, కలయం దిలకించి] వయస్యా, చక్కగా కంటివి. అట్లే
సుమా,—

తే. క్రమ్మఁ దొలిఁ దూర్పున్నే, లాఁతిక్కడను బిదప,
ముంచు నొయ్యన గిరితరుపురభిదలను,
బలువు గొని మాపు జనులదృక్షలము వెనుక,
20 హరగళద్యుతిఁ గెరలు మోహాగపుటికులు. ౫౪

మఱి దారి చూపు.

విదూ.—రావయ్యా, రా ప్రియవయస్యుడా. [పరిక్రమింతురు.

విదూ.—[నిరూపించి] వయస్యుడా ఇదే మకరందోద్యానం, దగ్గరనే వుంది,
చెట్లబావులుళ్యంచేత ఒకటే చీకటిమద్దగా వుంది. మరి యిందులో దారి గేలాగ అగ
25 పడుతుంది !

రాజు.—[గంధము నాఘ్రాణించి] వయస్యుఁడా, ముందు నడువుము. ఇట దారి మనకు చక్కఁగా తెలిసినట్టిదే గదా. అట్లే.—

మ. ఇది సంపెంగలవాటి, యీయదియె యాహ్వాద్యంపునిర్గుండి, యీ
యది జీబైనకదంబపాళి, యిది సుమ్మా పాటలాపంక్తి; యి
ట్లుదితాఘ్రాతవిభిన్నగంధములచే నుర్వీజము ల్గుర్తుగాఁ, 5
బడవిఁక వ్యక్తముగా నెఱింగితిఁ దమోౘైవాగుణ్యసంఛాదతన్. ౧౫

[పరిక్రమింతురు.

విదూ.—ఓయి, ఇది మకరందపానంచేత మత్తెక్కిన తేంట్లు వాలడంచేత కిందికి రాలుతూవున్న పొగడపువ్వులపరిమళాన్ని దశదిక్కులకు నెఱుపుతూవున్నది, మృదువైన పచ్చలతోటిన్నీ వసన్నిలలతోటిన్ని కట్టిన రాకట్టుమీది యీ నడకలో మన యడుగులకి 10 సుఖం గలిగిస్తూవున్నది, మాధవీలతామండపం. ఇందు ప్రవేశించాము గదా. ఇక్కడనే నీవు కూర్చో, నేను వెళ్లి దేవివేషము వేసుకొనివున్న సాగరికని క్షణములో తోడ్కొని వస్తాను.

రాజు.—వయస్యుఁడా, అటయిన త్వరపడుము.

విదూ.—వయస్యుడా, ఉత్తలంపడకు. ఇదుగో వస్తున్నాను. [నిష్క్రమించును. 15

రాజు.—అందాఁక నేనును పచ్చలరాతిన్నియమైఁ గూర్చుండి ప్రియాసంకేత సమయమును నిరీక్షించుచుండెద. [కూర్చుండి సచింతముగా] అహో! కామిజనునికి తన యిల్లాలికూటమిని పరిభవించువానికి క్రొత్తచెలువమీఁద ఏమో పక్షపాతము! అట్లేగదా,

చ. దయితముఖంబుఁ బ్రేమవిశదం బగుచూపునఁ జూడ దల్కనన్,
హాయలుగ నిక్కఁజన్నుఁగవ నొత్తదు కంఠముఁగౌఁగిలించుచోన్, 20
నయమునఁ జిక్కఁ బట్టినను నస్తన నిమ్మని పల్కుమాటి, కి
ట్లయినను నిశ్చితస్థలము నందినకామిని ప్రీతిఁ బెంచెడిన్. ౧౬

ఏమి! వసంతకుఁడు ఆలసించుచున్నాఁడే! ఈవృత్తాంత మేమయిన దేవికి వాసవదత్తకు ఎఱుకపడి యుండునా?

[అంతట వాసవదత్తయు కాంచనమాలయు ప్రవేశింతురు] 25

వాస.—ఓసే కాంచనమాలా, నిజమేనా నావేషముధరించి సాగరిక ఆర్యపుత్రుణ్ణి అభిసరిస్తుం దన్నమాట!

కాంచ.—కాకపోతే భట్టినికి నివేదింతునా? కాక, చిత్రశాలికాద్వారమందు కూర్చున్న విదూషకుడే నీకు తార్కాణ మగును.

వాస.—అటయితే అక్కడికే వెళ్దాము.

కాంచ.—రా భట్టినీ రా. [పరిక్రమింతురు.

5 [అంత కూర్చున్నవాఁడు ముసుఁగిడికొన్నవాఁడు

వసంతకుఁడు ప్రవేశించును ]

విదూ.—[చెవి యొగ్గి] చిత్రశాలికాద్వారాన అడుగులచప్పుడు వినబడుతూ వుంది, కనక సాగరిక వచ్చిం దని తలుస్తాను.

కాంచ.—భట్టినీ, ఇదే ఆచిత్రశాల, ఇందులో ప్రవేశించి వుండు. నేనున్ను 10 వసంతుడికి సన్న చేస్తాను. [అని చిటిక వైచును.

విదూ.—[హర్షములో సమీపించి చిఱునవ్వుతో] సుసంగతా, నీవు సరీగా వేసు కొన్నావే కాంచనమాలవేషాన్ని! మరి సాగరిక ఏదీ?

కాంచ.—[వ్రేలితో చూపుచు] ఇదుగో.

విదూ.—[చూచి ఆశ్చర్యముతో] ఈమె స్ఫుటంగా దేవి వాసవదత్తే.

15 వాస.—[ఆశంకతో ఆత్మగతము] ఏమి వీడు నన్ను ఆనవాలుపట్టినాడే! కనక వెడలిపోతాను. [అని పోనుంకించును.

విదూ.—అమ్మా, సాగరికా, ఇటు రావమ్మా.

[వాసవదత్త నవ్వి కాంచనమాలను చూచును.

కాంచ.—[అపవారించి వ్రేలితో విదూషకుని బెదరించుచు] హతాశుడా, 20 ఈమాట మరవకు.

విదూ.—త్వరగా పద, త్వరగా పద, సాగరికా. ఇదుగో తూర్పుదిక్కున చంద్రుడు ఉదయిస్తున్నాడు.

వాస.—[సంభ్రమముతో అపవారించి] స్వామీ, మృగలాంఛనుడా, నీకు నమస్కారము. రవంతసేపు నీదేహమును మఱుగున ఉంచు, ఈలోపల ఇతని భావాను 25 బంధాన్ని చూస్తాను గాక. [అందఱు పరిక్రమింతురు.

రాజు —[ఉత్కంఠతో ఆత్మగతము] ప్రియాసమాగమము సమాసన్న మై యున్నను ఏమి యిది నామనస్సు మిక్కిలి ఉత్తలపడుచున్నది. కా కేమి?

తే. ఇంచువిల్తునిశిఖ తో ల్త నేఁప దట్టు
 లెట్టు లేఁచునొ పొందుసమీప ముగుడు,
 కారున న్నికటోదకాగమము దినము 5
 పుటము వెట్టెడుఁ గాదె యపూర్వగరిమ. ౧౭

విదూ.—[విని]అమ్మా సాగరికా, ఇదుగో ప్రియవయస్యుడు నిన్నేగూర్చి బాళిగొని తాళలేక యీలాగ పలుకుతూవున్నాడు. కనక నీ విట వుండు. నీవు వచ్చినా వని ప్రియవయస్యుడితో చెప్పి వస్తాను.

[వాసవదత్త శిరఃసంజ్ఞ నొసఁగుచున్నది. 10

విదూ.—[రాజును దఱిసి] వయస్యా, అహా నీవు వర్ధిల్లుతున్నావు. ఇదుగో నేను సాగిరికను తెచ్చినాను.

రాజు.—[హర్షముతో తటాలున లేచి] ఏదీ ఎక్కడ ఎక్కడ?

విదూ.—[భ్రూసంజ్ఞతోఁ జూడ] ఇదుగో.

రాజు —ప్రియా సాగరికా, 15

మ. అమృతాంశుండు మొగంబు,కల్వలు కనుల్,హస్తంబులంభోజముల్;
 విమలోరుల్ కదళోదరంబులు, బిసాభిఖ్యంబు లౌ బాహువుల్;
 రమణీ,హ్లాదకరాఖిలాంగకవు, మారక్రూరబాణాగ్ని చేఁ
 గమలం గ్రాఁగిన నాదుగాత్రములకాఁక న్గ్రొఁగిట న్మాన్పవే ౧౮

వాస.—[బాష్పములతో అపవారించి] కాంచనమాలా, ఈలాగు ఆర్యపుత్రుడు 20 స్వయంగా పలుకుతున్నాడు. మళ్లీ నాతో యేలాగ మాట్లాడుతాడో! అహా ఏ మాశ్చర్యము!

కాంచ.—[అపవారించి] భట్టిని, ఈలాగే ఇది. సాహసికు లయినపురుషులు ఏమి చేయరు!

విదూ —అమ్మా సాగరికా, ఎందుకు విశ్వాసము వహించి ప్రియవయస్యుణ్ణి 25 పలకరించవు? ఎప్పటికిన్ని నిత్యరోష మైనయావాసవదత్తదేవి పలికే దుర్వచనాలచేత ఈయనచెవులు చేదెక్కిపోయినవి, నీ మధురవచనోపన్యాసము వాటికి సుఖ మొసగుగాక.

వాస.—[అపవారించి సరోషస్మితముగా] ఓసీ కాంచనమాలా, నేను ఇటు వంటిదానను చేదులు పల్కెడుదానను, ఆర్యవసంతకు డైతే ప్రియంవదుడు.

కాంచ.—[అపవారించి, వ్రేలితో బెదరించుచు] హతాశుడా, ఈమాట మరవకు.

విదూ.—[చూచి] వయస్యుడా, చూడు చూడు, ఇదుగో కోపగించినకామిని చెక్కిలితో సమాను డై మృగలాంఛనభగవానుడు తూర్పుదిక్కును వెలిగించుచు ఉదయించినాడు.

రాజు.—[చూచి సస్పృహముగా] ప్రియా, చూడు చూడు.

క. తనకాంతి నెల్ల నీయా
ననము హరింపంగ, రజనినాయకుఁడు బదుల్
పొనరింప నెక్కె గిరికొనఁ,
గను మదె నీప్రోల, నూర్ధ్వకరతఁ దపించున్. ౧౯

ప్రియరో, ఈతఁడు పొడతెంచుచు తనజడత్వమును ప్రకటించుకొన్నాడు సుమా. ఎట్లనఁగా,

మ. నయనానందకరుండు గాఁడో, యరవిందశ్రీని ఖండింపఁడో,
నయనాంతేక్షణమాత్ర దర్పకునికిన్ సామ్రాజ్యముం గూర్పఁడో,
ప్రియకందర్పుఁడు నీముఖేందుఁ డుఱఁ, దా వేఱిందుఁ డుప్పొంగునే?
స్మయమేనిన్ సుధచేతఁ, బూర్ణ మది నీసారోష్ఠబింబంబునన్. ౨౦

వాస.—[రోషముతో మేల్ముసుంగు తివిచి] ఆర్యపుత్రా, నిజంగా నేను సాగరికను గాను, నీహృదయాన్ని నీవు సాగరికమీద వేసినందున నీకు సర్వమూ సాగరికామయంగానే కనబడుతూ వున్నది.

రాజు.—[చూచి వైలక్ష్యముతో అపవారించి] అయ్యో! అక్కటా! కట్టా! ఏమీ దేవి వాసవదత్త! వయస్యుఁడా, ఇదేమి?

విదూ.—[విషాదముతో] వయస్యా, మరి వే రే మున్నది. ఇది మనకు ప్రాణసందేహాకరముగా వచ్చినది.

రాజు.—[కూర్చుండి కేల్మోడ్చి] ప్రియా, వాసవదత్తా, మన్నింపు మన్నింపు.

వాస.—[అతనియెదురుగా కన్నీళ్లు కార్చుచు] ఆర్యపుత్రా, అలా గనకు, ఈయక్షరాలు వేఱొకతెవా లయినవి.

విదూ.—[ఆత్మగతము] ఇందులకు ఇప్పుడు ఏమి చేయుందును ? కానీ, ఇట్లు అందునుగాక. [ప్రకాశము] అమ్మా, నీవు మహానుభావురాలవు. కనుక ప్రియవయస్యుడి యీ యొక యపరాధమును మన్నించు.

వాస —ఆర్యా, వసంతకా, మరి తొలికూటమిలో విఘ్నము చేసి నేనే ఈయ నకు అపరాధము చేసితిని, ఈయన నాకు చేయలేదు 5

రాజు.—ఇట్లు నాదోషము ప్రత్యక్షమై యుండఁగానే నేమి వచింతును! అయినప్పటికి విన్నవించెదను.—

తే. దేవి, నీపదములకెంపు నే వెలార్తు
లాక్షికము నాశిరముచే విలక్షమతిని;
ఆస్యశశియందుఁ గోపగ్రహణజనితముఁ 10
గెడపుదును నీకు నాపయిఁ గృప గలిగిన. ౬౧

[అని పాదముల వ్రాలును.

వాస.—[చేతితో వారించుచు] ఆర్యపుత్రా, లే లే, ఆర్యపుత్రుని యిటువంటి హృదయాన్ని యెరిగియు మళ్లీ కోపగించునది లజ్జ లేనిది గదా. కనక ఆర్యపుత్రా, నీవు సుఖ ముండు, నేను వెళ్తాను. [అని పో నుద్యమించును. 15

కాంచ.—భట్టిని, మన్నించు. ఈలాగ పాదాలలో పడినమహారాజును వదిలి వెళ్తే నీవు అవశ్యం పశ్చాత్తాపంచేత దుఃఖపడతావు.

వాస.—పోవే బుద్ధిహీనురాలా; యిక్కడపశ్చాత్తాపాని కేమికారణ మున్నది? చాలు, వెళ్దాం రా. [నిష్క్రమింతురు.

రాజు.—దేవీ, మన్నింపు మన్నింపు. "దేవి, నీపదముల" ఇత్యాది మరల 20 పఠించును.

విదూ.—లేవోయి లే, ఆమె వెళ్లింది దేవి వాసవదత్త.

రాజు—[మొగమెత్తి] ఏమి! ప్రసాదము సేయకయే పోయినది దేవి !

విదూ—ప్రసాదం చేయలే దంటా వేమి ? ఇప్పటికిన్ని అక్షతశరీరులంగా వున్నాము గామా? 25

రాజు.—ఛీ మూర్ఖుఁడా, ఏమి ఇట్లు నన్ను హేళనము చేసెదవు ? ఈ యన ర్థము నీవలననే సంభవించినది. ఎట్లన,

చ. ప్రణయబహూకృతిప్రభవబంధురరాగము గల్గి నాపయిన్
గని యిట నాకువాళము నకల్పితపూర్వము, తెచ్చుపాటు గాక,

దనువు దొరంగ కున్నె దయితామణి మానిని? యేమి సెప్పుదున్,
ఘన మగుప్రేమలో స్ఖలితకంబును దుస్సహ మౌట క్రొత్తయే? ౬౨

విదూ.—ఓయి, దేవి కోపము చెందినది, ఏమి చేయునో తెలియదు. మరి సాగరిక ఇక ప్రాణాన్ని ధరించడం దుష్కర మని నే ననుకొంటాను.

5 రాజు.—వయస్యుఁడా నేనును అట్లే తలంచుచున్నాను. హా! ప్రేయసీ! సాగరికా!

[అంతట వాసవదత్తా వేషధారిణి సాగరిక ప్రవేశించును.]

సాగ.—[ఉద్వేగముతో] ఈ దేవీవేషంతో ఈ సంగీతశాలనుంచి వెడలివస్తూవున్న నన్ను నాపుణ్యాన ఎవ్వరున్ను చూడరైరి. మరియిక్కడ నే నేమి చేయుదును?
10 [అని కన్నీళ్లు విడుచుచు చింతిల్లును.

విదూ.—ఏమోయి, మూఢుడిలాగ నిల్చిపోయినావు? ఇందు కేమయినా ప్రతీకార మాలోచించు.

రాజు.—వయస్యుడా అదే ఆలోచించుచున్నాను. దేవిని ప్రసన్నురాలిని చేయుటకన్న వేఱుపాయము కనఁబడదు. రా, అక్కడికే పోదము. [పరిక్రమింతురు.

15 సాగ.—[కన్నీళ్లతో నవ్వి] ఇక్పుడు స్వయంగానే ఉరిబోసుకొని ప్రాణము విడవడం మేలు. ఆలాగే చేస్తాను. సంకేతవృత్తాంతము తెలిసిపోయినయిప్పుడు సుసంగతవలె దేవిచేత అవమానపడి బ్రతికివుండడం సరిగాదు. కనక అశోకవృక్షముకింద నాయాయిష్టం నెరవేర్చుకొంటాను! [అని పరిక్రమించును.

విదూ.—[విని] ఉండవోయి ఉందు అడుగులచప్పుడు వినబడుతూవుంది. ఒక
20 వేళ దేవియే పశ్చాత్తాపము పొంది మళ్లీ వచ్చినా వచ్చు నని అనుకొంటాను.

రాజు.—వయస్యుఁడా మహానుభావురాలు సుమీ దేవి, ఒకవేళ అట్టే చేసినను చేయును, కావున త్వరగా కనుంగొనుము.

విదూ.—నీయాజ్ఞ. [అని పరిక్రమించును.

సాగ.—[సమీపించి] కనుక ఈ బండిగురివెందతీగతో ఈ అశోకవృక్షములో
25 ఉరిదీసుకొని ప్రాణము వదలుతాను. [అని తీగతో త్రాడుచేసికొనుచు] అయ్యోబాయనా! అయ్యో అమ్మా! నే నిప్పుడు అశరణనై మందభాగ్యను మడిసిపోతున్నాను. [అని మెడకు తీగయురిం దగిలించుకొనును.

విదూ.—[చూచి] ఎవ రీమె? ఏమి వాసవదత్తాదేవియే! [సంభ్రమముతో బిగ్గరగా] వయస్యా, కావవోయి కావు. ఇదుగో దేవి వాసవదత్త ఉరిబోసుకొని ప్రాణము వదులుతూ వున్నది!

రాజు.—[సంభ్రమముతో సమీపించి] వయస్యా, ఏదీ ఏదీ!

విదూ.—ఇదుగో ఇక్కడ. 5

రాజు.—[మెడనుండి ఉరిం దివియుచు] ఓసి సాహసకారిణీ, ఏమి యీయకార్యము చేసెదవు?

తే. కంఠగత మయ్యెఁ బ్రాణంబు కలికి నాకు,
నీకుఁ బాశంబు కంఠసన్నిహిత మగుచు;
అపహతస్వార్థ మగుట నీయత్న మిట్లు 10
వదలు మీసాహసంబును బ్రాణదయితే! ౬3

సాగ.—[రాజును చూచి] అహో! ఏమి ప్రభువే! [హర్షముతో ఆత్మగతము] నిజముగా ఈయన్ని చూడగానే నాకు మళ్లీ ప్రాణంమీద ఆశ కలుగుతూవుంది. కాకేమి? ఈయన్ని చూచి ధన్యురాలినై సుఖంగా ఉరిబోసుకొని ప్రాణం వదులుతాను. [ప్రకాశము] నన్ను వదులు ప్రభూ, నన్ను వదులు. పరాధీను రాలినిగదా నేను! నాకు 15 మరణానికి ఇటువంటి సమయము మళ్లీ దొరకదు. నీవున్ను దేవియెడల అపరాధివి గాక ఉందువు. [అని మరల మెడకు పాశమును తగిలించుకొన నుంకించును.

రాజు.—[చూచి హర్షముతో] ఏమి నాప్రియ సాగరికయా! [అని కంఠము నుండి పాశమును విడిచివైచి]

మాలిని. 20

విడుము విడుము గోలా వెఱ్ఱియీసాహసంబుణ్;
విడుము విడుము దీనిన్ వే లతాపాశకంబుణ్;
వడిఁ దరలిననాజీవంబు నిల్పన్ సుధాంగీ
వడి నిడు మిఱుతన్నీబాహుపాశంబు నాకున్. ౬౪

[అని బాహుపాశమును విడిచి తనకంఠంబున నుంచుకొని స్పర్శసుఖము నభి 25 నయించి విదూషకుంగూర్చి] సఖుఁడా, ఇది మేఘములేనివృష్టి.

విదూ.—ఓహో! అలాగే యిది, అకాలపుసుడిగాలి యై వాసవదత్తాదేవి రాకుంటే.

[అంతట వాసవదత్తయు కాంచనమాలయు ప్రవేశింతురు.]

వాస.—ఓసీ కాంచనమాలా, ఆలాగున పాదాల్లో బడిన ఆర్యపుత్రుణ్ణి ధిక్కరించి రావడంచేత నేను మిక్కిలి నిష్ఠురంగా వర్తించితిని. అందుచేత ఇప్పుడు వెళ్లి స్వయంగానే ఆర్యపుత్రుణ్ణి ఊరడిస్తాను.

5 కాంచ.—దేవి తప్ప యీలాగు చెప్పగలవారు మరెవ్వరున్నారు! అతడే దుర్జనుడు కావడం మేలుగాని, దేవి కఠినురాలు కాగూడదు. మరి రా దేవీ, రా.

[పరిక్రమింతురు.

రాజు.—ఓసి దేవ్యా, ఏమి ఇప్పుడును నీవు ఉపేక్షచేత నా మనోరథమును విఫలము చేయుచున్నావు?

10 కాంచ.—[చెవి యొగ్గి] భట్టినీ, ఈచెంతనే ప్రభువు మాటలాడుతూవుండడం చూడగా నాకు తోస్తున్నది నిన్నే ఓదార్చడానికి వస్తున్నాడని. కనక భట్టినీ సమీపించు.

వాస.—[హర్షముతో] ఆయనకు కనబడకుండా వెనుకవైపు వెళ్లి కంఠము కౌగిలించుకొని ప్రసాదింప జేస్తాను.

విదూ.—అమ్మా సాగరికా, భయము మాని ప్రియవయస్యుణ్ణి పలకరించు.

15 వాస.—[విని విషాదముతో] కాంచనమాలా, ఏమి! సాగరికకూడా ఇక్కడనే ఉన్నది! కనుక వింటాముగాక తర్వాత సమీపిస్తాను. [అని అట్లు చేయును.

సాగ.—ప్రభూ ఎందుకు ఈకపటదాక్షిణ్యము? నీకు ప్రాణముకంటె ప్రియమైన దేవియెడల మళ్లీ యెందుకు అపరాధి వవుతావు?

రాజు.—ఓసీ అనృతము పల్కుచున్నావు. ఎట్లనఁగా,

20 ఉ. ఊరుపులన్ ఘనస్తనము లుద్దవిడిన్ వడఁకన్ వడంకితిన్,
చేరఁగ బొమ్మ లంఘ్రులను జేరితి, మానితఁ దియ్యఁ బల్కితిన్;
ఆరసి దేవి కేఁ గులజతార్థ్వతఁ జేసెడి సేవమాత్ర మౌఁ,
గూరిమినో రసోద్ధురముఁ, గ్రుచ్చితి నీయెడనే తలోదరీ. ౬౫

వాస.—[సమీపించి రోషముతో] ఆర్యపుత్రా, ఇది తగును! ఆర్యపుత్రా, ఇది 25 తగును!

రాజు.—[చూచి వైలక్ష్యముతో] దేవి, కారణము లేకుండ నన్ను నిందించుట కరిగాదు. నీవే అనుకొని వేషసాదృశ్యము చేత మోసపోయి నేనిక్కడికి వచ్చితిని. కావున క్షమింపుము. [అని పాదముల వ్రాలును.

వాస.—[రోషముతో] ఆర్యపుత్రా, లేలే. ఏల యిప్పుడిన్ని సహజాభిజాతజనిత మైన సేవచేత దుఃఖ మనుభవిస్తావు ?

రాజు.—[స్వగతము] అహో దీనినికూడ దేవి విన్నదే ! కావున ఎల్లవిధములను దేవీప్రసాదనమునుగూర్చి నిరాశుడ నైతిని. [అని యధోముఖుఁడై యుండును.

విదూ.—అమ్మా, నీవే ఉరిబోసుకొని ప్రాణం వదులుతూ వున్నా వని వేష 5 సామ్యము చేత మోసపోయి నేను ప్రియవయస్యుణ్ణి ఇక్కడికి తోడ్కొని వచ్చినాను. నామాట నమ్మవేని చూచుకో ఈఉరి తీగని. [అని లతాపాశమును చూపును.

వాస.—[కోపముతో] ఓసే కాంచనమాలా, ఈ లతాపాశముతో నే కట్టి యీ బాపణ్ణి కట్టుకో. ఈదుర్వినయపు కన్యను ముందర నడిపించు.

కాంచ.—దేవిగారియాజ్ఞ. [లతాపాశముతో వసంతకుని కంఠమును కట్టి, 10 కొట్టును.] వసంతకుడా, నీయవినయానికి ఫలము అనుభవించు. దేవి దుర్వచనముల చేత చెవులు చేదెక్కిన వస్నావే ఆమాటని జ్ఞప్తికి తెచ్చుకో. సాగరికా, నీవున్ను ముందర నడువు.

సాగ.—[స్వగతము] పుణ్యము చేసుకోని నాకు నాయిచ్ఛప్రకారము మరణించ డానికికూడా వల్లపడ దాయెను. 15

విదూ.—[విషాదముతో] వయస్యుడా, దేవిగారిచెఱలో మృతి చెందేనన్ను తలుచుకో. [అని రాజును చూచును.

[వాసవదత్త రాజును చూచుచు, సాగరికను వసంతకునిం గొని, కాంచనమాలతోఁగూడ నిష్క్రమించును.

రాజు.—[ఖేదముతో] కటకటా ! కటకటా ! 20

మ. తలఁగెఁ దేవిముఖంబు బెట్టిదపుఁగాంతాళాన స్నిగ్ధేక్షలన్ ;
బలుగోహా రిడ దేవి సాగరిక నిర్భాగ్యాత్మ యయ్యెన్ వెఱన్ ;
చెలికానిం జెఱ వైచె దేవి; యిట నేచేతం దలంతుం గటా !
కలగుం డైతిని మువ్వేతన్ మునిఁగి;యింకంగందునో నిర్వృతిన్ ! ౬౬

మఱి యిప్పుడు ఇక్కడ నుండిన నేమి ప్రయోజనము? దేవినే ప్రసన్నను చేయం 25 టకు లోఁగిటికే పోయెదను. [అందఱు నిష్క్రమింతురు.

సంకేత మనుతృతీయాంకము సమాప్తము.

## ప్ర వే శ క ము

[అంతట రత్నమాల చేలఁ గొని సబాష్ప సుసంగత ప్రవేశించును.]

సుసం.—[సకరుణముగా నిశ్వసించి] అయ్యో ప్రియసఖి సాగరికా, అయ్యో లజ్జాశీలా, హా సఖీజనవత్సలా, అయ్యో ఉదారశీలా, హా సౌమ్యదర్శనా, ఎక్కడికి వెళ్లినావు? నాకు బదులు పలకవే. [అని యేడ్చును. ఊర్ధ్వము చూచి నిశ్వసించి] అయ్యో హతవిధీ! కరుణాహీనుడా! అటువంటి ఆ అరుదైన సౌందర్యంతో సృజించినవాడవు ఎందుకోసమని ఇటువంటి అవస్థపాలు చేసినావు. అందువల్లగదా, ప్రియసఖి ప్రాణంమీద ఆశ వదులుకొని ఈరత్నమాలని ఎవడైనా బ్రాహ్మడిచేత పెట్టుమని చెప్పి నాచేత నుంచినది. మళ్లీ అందుకోసము ఎవరినైనా ఒకబ్రాహ్మణ్ణి వెదకుతాను. [నేపథ్యమువైపు చూచి] ఆహా! ఏమి! ఇదుగో బ్రాహ్మడు వసంతకయ్య, యిక్కడికే వస్తున్నాడు, ఈయనకే ఇస్తాను.

[అంతట హృష్టుఁడు వసంతకుఁడు ప్రవేశించును.]

వసం.—హీహీ బళిబళి ప్రియవయస్యుడు అలక తీర్చగా, దేవి వాసవదత్త మహాత్మురాలు ఇప్పుడు నన్ను చెఱనుండి విడిపించి తనచేతులతో తానే పెట్టిన మోదకాలని లడ్డుకాలని కడుపునిండా తినిపించినది. మరిన్నీ, ఈపట్టువలిపాలజోడున్నూ ఈ కర్ణాభరణాలనున్నూ ఇచ్చినది. మరి వెళ్లి ప్రియవయస్యుణ్ణి చూస్తాను.

[అని పరిక్రమించును.

సుసం.—[ఏడ్చుచు చటాలున సమీపించి] వసంతకయ్యా, నీవు ఒక్క నిమిషం నిలు.

విదూ.—[చూచి] ఏమి సుసంగతా, సుసంగతా, ఏడుస్తున్నావేమి? సాగరికకి ఏమయిన అపాయం కలిగిందా?

సుసం.—వసంతకయ్యా, చెప్తాను విను. పాపము! దాన్ని దేవి ఉజ్జయినికి పంపినట్లు ప్రవాద కల్పించి అర్ధరాత్రివేళప్పుడు ఎక్కడికో తెలియదు, తీసికొని పోయింది.

విదూ.—[ఉద్వేగముతో] అయ్యో సాగరికమ్మా! అసాధారణసౌందర్యశోభితురాలా, హామృదుభాషిణీ, ఎక్కడున్నావు? నాకు బదులు పలుకు. నీమీద బొత్తిగా కనికరం లేక దేవి ఈలాగ చేసింది!

సుసం.—వసంతకయ్యా, చెలి ప్రాణంమీద ఆశ వదలుకొని ఈరత్నమాలని వసంతకయ్యచేతులలో అర్పించమని నాచేతి కిచ్చింది. కనుక దీన్ని పుచ్చుకోవయ్యా.

విదూ.—[సబాష్పము సకరుణము చెవులు మూసికొని] సుసంగతా, ఇటువంటి యీ ప్రస్తావంలో దీన్ని పుచ్చుకోవడానికి నాకు చేయి యేలాగు ఆడుతుంది!

[ఇరువురు నేద్తురు.

సుసం.—[అంజలి కూర్చి] అయ్యా ఆమెకే అనుగ్రహం చెయ్యడంగా దీన్ని పుచ్చుకో. 5

విదూ.—[చింతించి] అలాగే కానీ, లేదీనితో సాగరికావిరహపీడితుడికి ప్రియ వయస్యుడికి వినోదం కలగజేస్తాను.

[సుసంగత వసంతకుని చేత రత్నమాల నుంచును.

విదూ.—[గ్రహించి చూచి ఆశ్చర్యముతో] సుసంగతా, ఇటువంటి యీ యలంకారం సాగరికకి యేలాగ వచ్చింది? 10

సుసం.—అయ్యా, నేనే ఆమెని కుతూహలపడి అడిగినాను; ఆమె ఈలాగ చెప్పింది.

విదూ.—ఆమె ఏమి చెప్పింది?

సుసం.—అంతట ఆమె మీదు చూచి, నిట్టూర్పు పుచ్చి; 'నీకు దీనికథ ఎందుకే?' అని పలికి ఏడవసాగింది. 15

విదూ.—ఆమె చెప్పినట్టే, సామాన్యులకి దొరకని యీయాభరణం చూస్తేనే తెలుస్తూవుంది, ఆమె యెవరో గొప్పయింట పుట్టిం దని. సుసంగతా, యిప్పుడు ప్రియ వయస్యుడు ఎక్కడున్నాడు?

సుసం.—అయ్యా, ఇల్లిడుగో ప్రభువు దేవిగారిగిల్లోనుంచి వెడలి పటికరాతిలిన్నె మంటపానికి వెళ్లినాడు. నీవున్ను వెళ్లు. నేను వాసవదత్తాదేవి కొలువుకు వెళ్తాను. 20

[నిష్క్రమింతురు.

ప్రవేశకము ముగిసినది.

---

## చ తు ర్థాం క ము.

[అంతట రాజు ఆసనస్థుఁడు ప్రవేశించును.]

రాజు.—[చింతించి]

చ. హసనము గొల్పువర్తనము, హాళి, ప్రియోక్తులు, మాయబాసలన్
5 జరణనతుల్, విలక్షతయు, సారెకు నెచ్చెలు లాడుసాంత్వముల్
తెరలుపవాయె నాక్రియను దేవిరుషన్ దనుఁదానె యేక్రియన్
బ్రరుదిత యై తుదిన్ గడిగి వైచెనొ దేవి నిజాశ్రుధారచేన్. ౬౭

[ఉత్కంఠతో నిట్టూర్పు పుచ్చి] ఇట్లు దేవి ప్రసన్నురాలైనందున ఇప్పుడు కేవలము సాగరికచింత యొక్కటే నన్ను బాధించుచున్నది. ఏల యన—

10 తే. తామరసగర్భసుకుమారతనువు దయిత
యపుడు నవరాగకంఠగ్రహమునఁ గరఁగి
తోడ మరుమఁటుల్కులకు నైనతూంట్లవెంట
నాయెడఁ జొచ్చిన దటంచు నాతలంపు. ౬౮

[చింతించి] మఱి నావిశ్రామస్థాన మెవఁడో ఆవసంతకుఁడుగూడ దేవి చెఱలో
15 వైచినది. ఇఁక నెవరితోఁ జెప్పకొని బాష్పములు విడుతును. [అని నిట్టూర్చును.

[అంతట వసంతకుఁడు ప్రవేశించును.]

వసం.—[పరిక్రమించి చూచి ఆశ్చర్యముతో] బలారే, ఇదుగో ప్రియవయస్యుడు ఎడతెంపులేని వలవంతచేత కృశించియున్నా అద్భుతమైనలావణ్యం కలవాడై ఉదయించిన విదియచంద్రునిలాగ మరీ ప్రకాశిస్తూవున్నాడు. [సమీపించి] నీకు
20 మేలుకలగుగాక. ఓహో బళీ! వర్ధిల్లుతున్నావు; నేను దేవిచేతులలో బడ్డప్పటికి మళ్లీ ఈకళ్లతోటే నిన్ను చూచినాను గదా.

రాజు.—[చూచి హర్షముతో] ఆహాహా! వసంతకుఁడు వచ్చినాఁడు! మిత్రమా నన్ను కౌగిలించుకొమ్ము.

విదూ.—[కౌఁగిలించి] వయస్యుడా, దేవి నన్ను అనుగ్రహించినది.

రాజు.—దేవీప్రసాదము నీవేషముచేతనే తెలియుచున్నది. మఱి చెప్పు మిప్పుడు సాగరికవార్త యేమో.

[విదూ—వైలక్ష్యముతో అధోముఖుఁ డగును.

రాజు.—వయస్యా, చెప్ప వేమి ?

విదూ.—నీకు అప్రియాన్ని చెప్పలేకున్నాను. 5

రాజు.—[ఉద్వేగముతో, సంభ్రమముతో] వయస్యుఁడా అప్రియ మెట్లు? ఏమి జీవితమును వదలనే వదలినదా ప్రియ? అక్కటా! ప్రియా సాగరికా !

[అని మూర్ఛను నటించును.

విదూ.—[సంభ్రమముతో] ఊరడిల్లు ఊరడిల్లు ప్రియవయస్యా.

రాజు.—[ఊఱడిల్లి కన్నీళ్లతో] 10

తే. నను నదక్షిణు విడుచు ప్రాణంబులార,
దక్షిణుల రగుఁ డోరి;హితంబు వినుడు ;
వడిఁ బఱవ రేని చెడుదురో వెడఁగులార,
యిప్పటికె దూర మేఁగు మత్తేభయాన ౬౯

విదూ.—అయ్యో అంతదూరం శంకించకు. పాపము! ఆమెను దేవి ఉజ్జయినికి 15 పంపిం దని వినికి. అందుచేత నేను అప్రియ మని చెప్పితిని.

రాజు.—ఏమి ఉజ్జయినికి పంపినదా? అహో నాయందు కొంచె మయినను కని కరము లేదాయెను దేవికి ! వయస్యుఁడా, అట్లని నీతో ఎవరు చెప్పినారు ?

విదూ.—సుసంగత చెప్పింది. మరి ఒకటి, ఏఉద్దేశ్యంచేతనో ఆమె నాచేతికి ఈరత్నమాలను పంపించింది. 20

రాజు.—న కొంసులకు? నన్నూఱడించుటకే. కావున తెమ్ము.

[విదూషకుఁడు అందిచ్చును.

రాజు.—[కైకొని రత్నమాలను పరికించి ఎదయం దుంచుకొని] అహాహా !

క. పడఁతుక కంఠాశ్లేషముఁ
బడసియు నీరత్నమాల ప్రభ్రష్టంబై 25
పడి సమదశలో సఖివలెఁ
దడయక యోదార్చు నాదుతనువుం గంటే. ౭౦

వయస్యా, నీవు దీనిని తాల్పుము, అందువలన నేను దీనిఁజేని కనుచు ధృతిం జెందెదను.

విదూ.—సీయూష్ష. [అని కంఠమునం బొల్చును.

రాజు.—[సబాష్పము నిశ్వసించి]వయస్యా,దుర్లభముగదా ప్రియాదర్శనము ఇఁక!

విదూ.—[భయముతో దిక్కులు చూచి] ఓయి అలాగని బిగ్గరగా అనకు. ఒక వేళ దేవికి చెప్పేవారు ఎవరైనా ఇక్కడ తిరుగుతూ వుండేరు.

5 [అంతట బెత్తము కేలం గలది వసుంధర ప్రవేశించును.]

వసుంధర.—[సమీపించి] జయంజయం ఏలినవారికి. ఇదుగో రుమణ్వంతుడు గారి మేనల్లుడు విజయవర్మ ఏలినవారి కేమో నివేదించడానికి వచ్చి ద్వారములో కని పెట్టి వున్నాడు.

రాజు.—వెంటనే అతనిం బ్రవేశపెట్టుము.

10 వసుం.—ఏలినగారి ఆజ్ఞ [అని నిష్క్రమించి విజయవర్మను తోడ్కొని మరల ప్రవేశించి] విజయవర్మా వారుగో దొరవారు, దగ్గిరికి వెళ్లు.

విజయవర్మ.—[సమీపించి] జయము జయము ఏలినవారికి. దేవా, రుమణ్వంతుని విజయముచేత ఏలినవారు వర్ధిల్లుచున్నారు.

రాజు.—[పరితోషముతో] విజయవర్మా, కోసలులను జయించితిరా?

15 విజ.—ఏలినవారి ప్రభావముచేత.

రాజు.—బళీ! రుమణ్వంతుఁడా బళి! స్వల్పకాలములో గొప్పప్రయోజనము సాధించితివి! విజయవర్మా, చెప్పుము కడు విరివిగా వినఁగోరుచున్నాను.

విజ.—దేవరా, చిత్తగింపవలయును. మేము ఇటనుండి ఏలినవారియాజ్ఞచేత కొలఁదిదినములకే అనేకగజతురగపదాతిదుర్ధర మయినమహాసేనతో పోయి వింధ్యదుర్గ

20 స్థుఁడైన కోసలరాజు ద్వారము ముట్టడించి సేనలను ఆయాయితావుల పన్నందొడంగితిమి.

రాజు.—అంతట? అంతట?

విజ.—అంతట కోసలరాజు అతిగర్వముచేత అవమానము సహింప లేక ప్రధానమైన తనదండంతయు సన్నద్ధము చేసెను.

విదూ.—ఓయి వడివడిగా చెప్పి ముగించు. నాగుండె అదురుతూ వుంది.

25 రాజు.—అంతట అంతట?

విజయ.—దేవా, అతఁడు నిశ్చయము చేసికొని,—

ఉ. పంత మెలర్ప వింజమును బాసి, యతం డెదిరించి తా రుమ
ణ్వంతుని లాఁతివింజమున నా గజతఁ దశదిక్కు లొత్తుచున్,

దంతులచేఁ బదాతిగమిఁ ద్రచ్చఁగ, నీతఁడడర్చు చంపకన్
చింతితసిద్ధిఁ జేర్చి కదిసెన్ రిపు నెక్కటిఁ జోర గ్రక్కునన్. ౭౧

మఱియును,

క. కత్తులు జోమిడికములపై
హత్తి పగిల్చినవి, నెత్తు లగలెన్, మిగులన్ 5
నెత్తురుటేఱులు వాఱెన్,
మొత్తుల మిడుఁ గుఱులు దూల మ్రోఁగెన్ గుఱువుల్.

తే. గుంటి యిడి కోసి రిరుపరి నొంటరీలు;
క్షణములో ముఖ్యబలములు పడిసిపోయె;

రాజు.—ఏమి! మన బలములు గూడ భగ్నములా ? 10

విజ.—
అంతఁ గోసలు దలఁపడి హాంతకారి
యొక్కటేఁడు రుమణ్వంతుఁ డుక్కుమడఁచె. ౭౨

విదూ.—జయం జయం నీకు. మనకు జయంవచ్చినది. [అని నృత్యము సేయును.

రాజు.—బళీ! కోసలపతీ! బళీ! శత్రువులు సయితము నీ పురుషకారమును ఇట్లు 15 మెచ్చుచున్నారు! నీ మృత్యువుకూడ శ్లాఘ్యముసుమా. తర్వాత తర్వాత ?

విజ.—దేవా అంతట రుమణ్వంతుఁడు కోసలదేశమున నాయన్నను జయవర్మను నియమించి ఏనుఁగుపిండ్లు లోనుగా గాయపడిన మనబలము నంతయుం తోడ్కొని మెల్ల మెల్ల నిపయనములలో వచ్చుచున్నాఁడు.

రాజు.—వసుంధరా, నాప్రసాదముయొక్క విభవమును చూపు మని యౌగంధ 20 రాయణునితో చెప్పుము.

వసుం.—ఏలినవారియాజ్ఞ. [అని విజయవర్మతో నిష్క్రమించును.

[అంతట కాంచనమాల ప్రవేశించును.]

కాంచ.—దేవి ఆజ్ఞాపించింది,— ఒసే వెళ్లి ఈఐంద్రజాలికుణ్ణి ఆర్యపుత్రుని దరిశనం చేయించు అని. [పరిక్రమించి చూచి] ఇదుగో ప్రభువు. మరి యీయన 25 దగ్గిరికి వెళ్తాను. [సమీపించి] జయం జయం ఏలినవారికి. దేవరా, దేవి విన్నపిస్తున్నది, ఉజ్జయినినుంచి వచ్చినాడు ఈ ఐంద్రజాలికుడు, శంబరసిద్ధి అని యితడిపేరు. ఇతణ్ణి ఏలినవారు చూడవలె నని.

రాజు.—మాకును ఐంద్రజాలికునియందు కుతూహలము కలదు. కావున శీఘ్రముగా ప్రవేశపెట్టుము.

కాంచ.—ఏలినవారియాజ్ఞ. [అని నిష్క్రమించి నెమలికుంచె కేలంగల యైంద్రజాలికునితోఁ గూడఁ బ్రవేశించి.] ఇటురా అయ్యా, ఇటురా.

5 [ఐంద్రజాలికుఁడు పరిక్రమించును.

కాంచ.—వీరుగో ఏలినవారు. నీవు దగ్గరికి వెళ్లు.

ఐంద్రజాలికుఁడు—.[సమీపించి] జయం జయం ఏలినవారికి. [కుంచెను త్రిప్పి బహువిధముల హాస్యము గావించి]

క. దండ మిదుం డింద్రునికిన్

10 దండ మిదుం డింద్రజాలదైవ మతఁడె గా;
దండ మిదుఁడు శంబరునికి,
దండ మిదుఁడు మాయ కతఁడె దైవతము గదా. ౨౩

దేవరా,

క ధరణీతలమున శశి, నం

15 బరమునఁ బర్వతము, నీట వాయువయస్సున్,
గరిమ ధ్వాంతంబున నిసిఁ,
బరఁగించెద, నానతిమ్ము వసుధారమణా. ౨౪

క. హరిహరచతుర్ముఖులనున్,
సురలన్ సురరాజు, నీకుఁ జూపెదనయ్యా;

20 సురసిద్ధచారణవధూ
వరహల్లీసములఁ జదల వఱలింతు నయా. ౨౫

కాకేమి,

తే హెచ్చుపల్కు లేల? హెచ్చరింతువయేని,
యీవు దేనిఁ జూడ నిచ్చగొనుదొ,

25 దానిఁ దెచ్చి నీకు దరిసింతు దేవరా,
గురుని మంత్రమహిమ గుటికి రాఁగ. ౨౬

విదూ.—వయస్యా, హెచ్చరికగా వుండు ఇతడి ధైర్యం చూస్తే ఇతడు ఇంతా చెయ్యగలవాడే.

రాజు.—భద్రా, ఉండు రవంత. కాంచనమాలా, దేవితో విన్నవింపుము. "మీ వాఁడే యీ యైంద్రజాలికుఁడు. ఈప్రదేశమును విజనముం గావించితిమి. కావున నీవును రమ్ము, కలసియే చూతము." అని. 5

చేటి.—ఏలినవారియాజ్ఞ [అని నిష్క్రమించి వాసవదత్తతోఁగూడ ప్రవేశించును.

వాస.—కాంచనమాలా, ఉజ్జయినినుంచి వచ్చినవాడని నాకు ఆ యైంద్రజాలికునిమీద పక్షపాతం కలదు.

కాంచ.—ఇది దేవికి పుట్టింటిమీదిగౌరవం కదా. రా మరి దేవి రా.

[అని పరిక్రమింతురు. 10

కాంచ.—భట్టినీ, వీరుగో ఏలినవారు, సమీపించు దేవీ.

వాస.—[సమీపించి] జయం జయం ఆర్యపుత్రునికి.

రాజు.—దేవి, ఈతఁడు వెల్లుగా గర్జిల్లుచున్నాఁడు. ఇతనివిద్యను ఇటనే చూతముగాక. [వాసవదత్త కూర్చుండును.

రాజు.—భద్రా, చూపుము నానావిధ మయిన యింద్రజాలమును. 15

ఐంద్ర.—ఏలినవారియాజ్ఞ. [నానావిధముల నాట్యమాడి కుంచెను త్రిప్పుచు "హరిహర" ఇత్యాది మరల పఠించును.

[అందఱును ఆశ్చర్యపడి చూతురు.

విదూ.—ఆశ్చర్య మాశ్చర్యం.

రాజు.—దేవీ, చూడు చూడు. 20

మ. అతఁడే బ్రహ్మ సరోజజన్ముఁ, డతఁడె చంద్రాపీడుఁ డంబాసఖుం,
డతఁడే శార్ఙ్గగదాసిచక్రగచతుర్హస్తుండు లక్ష్మీయుతుం,
డితఁ డైరావణవాహుఁ డింద్రుఁడు సురాధీశుండు వీరల్ సురల్,
సుతమంజీరరవల్ నభంబున నటింతు ర్వారె దేవాంగనల్. 22

వాస.—ఆశ్చర్య మాశ్చర్యం 25

విదూ.—[అపవారించి] ఓరిమూర్ఖుఁడా, ఐంద్రజాలికుఁడా, ఏమి ప్రయోజనం ఈ దేవతలని అచ్చరలని చూపడంచేత? ఈతని సంతోషంతో నీకు పనివుంటే సాగరికని చూపించు.

[అంతట వసుంధర ప్రవేశించును]

వసుం.—[రాజును దర్శించి] మంత్రి యౌగంధరాయణులుగారు ఏలినవారిచరణములకు విన్నవిస్తున్నారు. ఏమంటే "విక్రమబాహువు కంచుకి బాభ్రవ్యునితోఁగూడ తనప్రధానమంత్రిని ఈయనను వసుభూతిని పంపించినాఁడు. కావున ఈ శోభనముహూ
5 ర్తమందే ఏలినవారు ఈయనకు దర్శన మొసగుట తగును, నేనును కార్యశేషములు ముగించుకొని ఇప్పుడే వచ్చెదను." అని.

వాస.—ఆర్యపుత్రా, ఇంద్రజాలము ఉండనీ. మాతులగృహమునుంచి ఆర్యుడు ప్రధానమంత్రి వసుభూతి వచ్చిఉన్నాడు. ఆయనను చూడుము ఆర్యపుత్రా.

రాజు.—దేవి చెప్పినట్లే చేసెద. [ఐంద్రజాలికునితో] భద్రా, ఇప్పటికి నీవు
10 విశ్రమింపుము.

ఐంద్ర.—[మరల కుంచెం ద్రిప్పుచు] దేవరయాజ్ఞ [అని నిష్క్రమించుచు] ఇంకొక్కటి నా విద్య ఏలినవారు అవశ్యం చిత్తగించవలెను.

రాజు.—కానీ తర్వాత చూచెదము.

వాస.—కాంచనమాలా, నీవు వెళ్లి ఇతనికి బహుమాన మియ్యి.

15 చేటి.—దేవియాజ్ఞ. [అని ఐంద్రజాలికునిం దోడ్కొని నిష్క్రమించును.

రాజు.—వసంతకా, ఎదురువోయి వసుభూతిని తోడ్కొని రమ్ము.

విదూ.—దేవరయానతి. [అని నిష్క్రమించును.

[అంతట బాభ్రవ్యుఁడును, వసంతకునివలనం బ్రత్యుద్గమన సత్కారముం బొందుచు వసుభూతియు, ప్రవేశింతురు]

20 విదూ.—రావలెను అమాత్యుడు రావలెను.

వసుభూతి—[కలయం గాంచి] అహో! వత్సేశ్వరుని ప్రభావము! అట్లే గదా.

మ. జయహస్తిం గని డిల్లఁబోయి, కని ఆచ్ఛాదిత వల్లభాశ్వంబులన్,
ఖయిదై గీతికి, రాజగోష్ఠి క్షణ మాకర్ణించి, సాద్యస్కవి
స్మయవిస్మారితసింహళేంద్రమహితైశ్వర్యుండనై కశనే
25 యయితి న్గ్రామ్యుఁడ నాకుతూహలితచే ద్వ్యాస్థుఁగాంచెన న్నవ్వఁగాన్.

బాభ్రవ్యుఁడు—వసుభూతీ చిరకాలమున కిప్పుడు ఏలికను చూడనున్నా నని అది యేమో గాని ఆనందాతిశయముచేత అనిర్వచనీయ మైన దశావిశేషము ననుభవించుచున్నాను. ఎట్లన—

తే. వణఁకు నెచ్చించె సాధ్వసవశత చేత,
నస్ఫుటను దృష్టి నాఁపిన దశ్రుతతులఁ,
గొదుకునుడి జడపఱిచె డగ్గుత్తి చేతఁ,
దోడ్పడియె నాజకుఁ బరితోష మిపుడు. ౭౯

విదూ.—[ముందు నడిచి] రావలెను అమాత్యుడు రావలెను. 5

వసు.—[విదూషకుని మెడలో రత్నమాలం గని, అపవారించి] బాభ్రవ్యా, ఈ రత్నమాల తరలినప్పుడు మా యేలినవారు రాజపుత్రికి ఇచ్చిన యారత్నమాలయే యని నాకు తోఁచుచున్నది.

బాభ్ర.—అమాత్యా, పోలిక యున్నది. ఇది వచ్చినవిధము వసంతకు నడుగుదునా?

వసు.—బాభ్రవ్యా, వలదు. ఎన్నెన్నియో రత్నము లుండెడి యింతవిభవంపు 10 రాజగృహములో ఆభరణములపోలిక అరుదుగాదు. [అని పరిక్రమింతురు.

విదూ.—[రాజును ఉద్దేశించి] ఈయనే వత్సాధిపుడు అమాత్యుడు సమీపింప వచ్చును.

వసు.—[దఱిసి] జయము జయము దేవరకు.

రాజు.—[లేచి] నమస్కారము. 15

వసు.—అతిశ్రేయస్కుఁడవు అగుదువుగాక.

రాజు.—ఆసన మాసన మార్యునికి.

విదూ.—[ఆసనము తెచ్చి] అయ్యా, ఇదుగో ఆసనము. అమాత్యా, కూర్చుండుము.

[వసుభూతి కూర్చుండును

కంచుకి.—దేవరా, బాభ్రవ్యుఁడు ప్రణమిల్లుచున్నాఁడు. 20

రాజు.—[వీఁపున చేయిడి] బాభ్రవ్యా, యిటఁ గూర్చుండుము.

కంచు.—[కూర్చుండి] దేవి, బాభ్రవ్యుఁడు ప్రణమిల్లుచున్నాఁడు.

విదూ.—అమాత్యా ఇదుగో దేవి వాసవదత్త ప్రణమిల్లుచున్నది.

వాస.—ఆర్యా, మ్రొక్కెదను.

వసు.—ఆయుష్మతి, వత్సరాజునకు తుల్యుఁడగుపుత్త్రునిం బడయుము. 25

[అందఱుం గూర్చుందురు.

రాజు.—ఆర్యా, వసుభూతీ, సింహళేశ్వరునికి కుశలమా!

వసు.—[ఊర్ధ్వము చూచి నిశ్వసించి] దేవా, మందభాగ్యుఁడను ఏమి చెప్పుట కును తెలియక యున్నాను. [అధోముఖుఁ డగును.

వాస.—[విషాదముతో ఆత్మగతము] అయ్యో అయ్యో! ఏమి చెప్పనో కదా యిప్పుడు వసుభూతి ?

రాజు.—వసుభూతీ, చెప్పుము. ఏమి నన్ను దిగు లొందించెదవు!

బాభ్ర.—[అపవారించి] ఎప్పటి కైనను చెప్పక తప్పనిదానిని ఇప్పుడే చెప్పి వైపుము.

వసు.—దేవా, నివేదింప శక్యము గాదు. అయినను మందభాగ్యుఁడను వచించెదను. పూజ్యుఁ డైనయాసింహళేశ్వరునికూఁతురు రత్నావళి యను పేరిది, ఆయుష్మతి ; ఆమెం బెండ్లి యగువాఁడు సార్వభౌముఁ డగునని సిద్ధుఁడు ఆదేశించినాఁడు;

రాజు.—అటుపైని అటుపైని?

వసు.—ఆప్రత్యయముచే యౌగంధరాయణుఁడు ఆమెను దేవరనిమిత్తమై సింహళేశ్వరుని పలుమాఱు ప్రార్థించెను. ఐనను అతఁడు వాసవదత్తకు చిత్తఖేదము నొదవింప నొల్లనివాఁడై ఈయకయే యుండెను.

రాజు.—[అపవారించి] దేవి, ఏమి యిది, నీమామమంత్రి యిప్పుడు అనృతము పల్కుచున్నాఁడు !

వాస.—[విమర్శించి] ఆర్యపుత్రా, ఇందు ఎవరు అనృతము పల్కుచున్నారో నే నెఱుంగను.

విదూ.—తర్వాత ఏమైంది?

వసు.—అంతట లావాణకమున నిప్పులో దేవి కాలిపోయినదని ప్రవాద పుట్టించి, దేవర సింహళేశునికడకు బాభ్రవ్యుని పంపి అతనిచేత మరల నామెకై వేఁడించఁగా, పూజ్యుఁడు సింహళేశ్వరుఁడు ఆలోచించి దేవరతో నాకు సంబంధలోపము లేకుండునుగాక యని, ఆరత్నావళిని దేవరకు ఇచ్చినాఁడు. దేవరకు ప్రతిపాదించుటకు మేము తెచ్చుచుండఁగా సముద్రములో ఓడ పగిలి మునిఁగిపోయినది.

[అని యేడ్చుచు అధోముఖుఁడై యుండును.

వాస.—[బాష్పములతో] అయ్యో! చెడితిని మందభాగ్యను ! అయ్యో! చెల్లెలా రత్నావళీ! ఎక్కడ నున్నావే యిప్పుడు ? నాకు బదులు పలుకవే!

రాజు.—ఊరడిల్లు మూఱడిల్లుము. దైవగతి దుర్బోధము ! ఓడ పగిలి సముద్రములో పడియుం వచ్చినవారు వీరే నీకు నిదర్శనము కాదా.

[అని వసుభూతిబాభ్రవ్యులం జూపును.

వాస.—ఆర్యపుత్రా, ఇదియుం సంభవించునదే ; అయితే, నాకు అంతటి భాగ్యమా?

రాజు.—[అపవారించి] బాభ్రవ్యా, ఇదేమియు నాకు బోధపడకున్నది.

బాభ్ర.—దేవా వినుము.

[నేపథ్యమున మహాకోలాహలము] 5

ఉ. జ్వాలల మేలుమచ్చులకు బంగరుఁగ్రేవులయం గొసంగుచున్,
గేళివనిన్ ద్రుమాగ్రతతిఁ గేరి మహోజ్జ్వల మై కమర్చుచున్,
కేళిగిరిన్ సతోయఘనకృష్ణముఁ జేయుచు సాంద్రధూమ్యచే,
కాలుదు మంచు స్త్రీ లడలఁ, గాల్చెడిఁ జిచ్చవరోధముం గటా!

మఱియు, 10

క. లావాణకమునఁ బుట్టెనొ
యేవా దనలుండు దేవి నేర్చె నటంచున్,
ఆవాదు నిజము సేయఁగ
నా వెలసె నతండు దేవినగరం బెలుచన్. ౮౧

[అందఱును సంభ్రాంతులై చూతురు. 15

రాజు.—ఏమి! అంతఃపురములో నిప్పు! [సంభ్రమముతో లేచి] ఏమి ! దేవి వాసవదత్త కాలిపోయినదా ! హా ! అయ్యో ! నాప్రేయసీ వాసవదత్తా !

వాస.—ఆర్యపుత్రా, కావుము కావుము.

రాజు.—అహో, అతిసంభ్రమముచేత పజ్జ నున్నదానినే దేవిని ఎఱుంగ నైతిని. [దేవిచేతిని పట్టుకొని కౌఁగిలించి] దేవీ, ఊఱడిల్లు మూఱడిల్లుము. 20

వాస.—ఆర్యపుత్రుఁడా, నన్ను కావ మని నే నడగలేదు. మరేమంటే కనికరము లేని నాచేత సాగరిక కాళ్లు సంకెళ్లుపడి అంతఃపురములో ఉన్నది. ఈనిప్పుచే మడిసి పోయ్యేని: కనుక రక్షించు ఆర్యపుత్రా రక్షించు.

రాజు.—ఏమి! దేవీ, ఏమి! సాగరిక మడియునా ? ఇదిగో పోవుచున్నాను.

వసు.—దేవ, ఏల యకారణముగా శలభవృత్తి నవలంబించెదవు ! 25

బాభ్ర.—దేవా, వసుభూతి చెప్పినమాట యుక్తము.

విదూ.—[రాజును ఉత్తరీయము పట్టుకొని ఆఁపి] ఓయి సాహసం చెయ్యకు.

రాజు.—[ఉత్తరీయమును లాగికొనుచు] ఓసి మూర్ఖురాలా, సాగరిక మడిసెను సుమా. ఇప్పుడును నాప్రాణములను కాపాడుకోవలయునా? [జ్వలనప్రవేశము నటించి తన్ను ధూమము క్రమ్ముకొన్నట్టు నటించుచు-]

(మా లి ని)

5 వలదు వలదు మండఁ బాపు మీధూమ మగ్నీ,
వెలిచెద విటు లేలా పెల్లు జ్వాలోచ్చయంబుల్ ?
కలికివియుతి చిచ్చే కాల్పలేదాయె వేనిఁ
బ్రళయదహనకీలల్. వానిఁ దా మేమి సేయుఁ ? ౮౨

10 వాస.—ఏమి? ఈ దుఃఖభాగిని మాటవలన ఆర్యపుత్రుడు ఈలాగు పూనుకొన్నాడు. మరి యిక నే నేల ఉండడం! నేనున్ను ఆర్యపుత్రుణ్ణే అనుగమిస్తాను.

విదూ.—[పరిక్రమించి ముస్నాడి] అమ్మా, నేనున్ను దారి చూపుతాను.

వసు.—ఏమి! వత్సరాజు అగ్నిలో చొరనే చొచ్చినాఁడే. కనుక రాజపుత్రి విపత్తిని కన్నవాఁడ నైననాకును ఇక్కడనే అగ్నికి ఆహుతి యగుట తగును.

15 కంచు.—[బాష్పములతో] హా మహారాజా, ఏమి యిట్లు అకారణముగానే భరతవంశమును సంశయతుల నెక్కించితివి! మఱి ప్రలపించిన నేమి కలదు! నేనును భక్తికి తగినట్లు చేసెదను. [అని అందఱును అగ్నిప్రవేశమును నటింతురు.

రాజు.—[కుడిభుజ మదరుటను నిరూపించి] ఈదశలో నున్ననాకు దీనిఫల మెట్లు కలుగును? [మ్రోలం గని సంతోషోద్వేగములతో] ఏమి! సాగరిక అగ్నిచెంతనే 20 ఉన్నది! త్వరగా పోయి రక్షించెదను.

[అంతట నిగడితచరణ సాగరిక ప్రవేశించును.]

సాగ.—[కలయం గని] అహాహా! అన్నివైపులా నాలుకలు సాపుతూ మండుతూవున్న యీయగ్నిదేవుడు నాదుఃఖానికి అంతం కలుగజేస్తాడు.

రాజు.—[వడిగాఁ దఱిసి] ప్రియా, ఏమి యిప్పటికిని నాయెడ ఉపేక్షతోనే 25 వర్తిల్లెదవు?

సాగ.—[రాజును గని ఆత్మగతము] ఏమి! ఆర్యపుత్రుడే! ఈయనను కనగా నాకు మళ్లీ ప్రాణంమీద ఆశ కలుగుతూ వున్నది. [ప్రకాశము] ప్రభూ, కావు కావు.

రాజు.—ఓసి భయశీలా, భయము మానుము.

తే ఉద్ధవడిఁ బెన్పుపొగ మొత్త మోర్వ తీఱము ;
30 [మ్రోలం గని]

కట్టా! చనుఁ బాసి సుఱసుఱఁ గాలె నొల్లె;

[చూచి]

సారెఁ దడఁబడెదేల? [నిపుణముగా కని] హా! సంకలియలె!

పాతు నిచ్చటు నెదఁ గొని భామ, రమ్మ. ౮౩

[కంఠమునం గొని కనులుమూసికొని స్పర్శసుఖమును నటించుచు] అహో! 5
క్షణములో నాసంతాపము తీఱినది! ప్రియా, డోలిఁడిల్లు మూలిఁడిల్లుము.

తే. అంటినను నిన్నుఁ గాల్పఁడ హవ్యభుజుఁడు;
నిక్క మిది నమ్ము మెట్లు నా నీరజాక్షి,
నీదుసంస్పర్శ తానె మాన్పెడును గాదె
వెగ్గలపుఁదాపమును సుధావేణివోలె ౮౪ 10

[కన్నులు తెఱచి చూచి సాగరికనువిడిచి] అహో! ఏమాశ్చర్యము!

తే. అనల మేమాయెఁ! దొలియఁగ్ల యంతిపురియు
నలరు!

[వాసవదత్తం గని]

ఇదిగో నవంతిన్నపాత్మజాత! 15

వాస.—[రాజుదేహమును నిమురుచు సంతోషముతో] ఏమిపుణ్యము! అక్షత
శరీరుడు ఆర్యపుత్రుడు!

రాజు.—చూతు బాభ్రవ్య!

బాభ్ర.—విజయ మగుఁగాక మహారాజునకు. దేవా, ఆహా వర్ధిల్లుచున్నావు!
మేము మరల బ్రతికినారము. 20

రాజు.—బలె! వసుభూతి!

వసు.—దేవా! అహాహా వర్ధిల్లుచున్నావు!

రాజు.—సఖుఁడు!

విదూ.—జయము జయము నీకు.

రాజు.—[ఆలోచించి వితర్కముతో] 25

స్వాప్నికమతిభ్రమయొ, యైంద్రజాలికంబొ ! ౮౫

విదూ.—ఓయి సందేహం లేదు, ఇంద్రజాలమే యిది. ఆదాసికొడుకు ఐంద్రజాలికుడు, వెళ్లేటప్పుడు చెప్పినాడు గదా, అవశ్యం దేవర ఇక నొక్కయాట చూడవలె నని. కనుక అదే యిది.

5 రాజు.—దేవీ, నీమాటవలన నే నిదె సాగరికను ఇక్కడికి తెచ్చినాఁడను.

వాస.—[నవ్వి] ఆర్యపుత్రా, నీచిత్తమును నేను చక్కగా ఎఱుగుదును.

వసు.—[సాగరికం గని అపవారించి] బాభ్రవ్యా, ఈబాల రాజపుత్రిని సరిపోలియున్నది.

బాభ్ర.—అమాత్యా, నాకును అట్లే తోఁచుచున్నది.

10 వసు.—[ప్రకాశము, రాజు నుద్దేశించి] దేవా, ఈ కన్యక ఎక్కడిది?

వాస.—అమాత్యా, ఈమె సాగరమునుంచి దొరికిం దని చెప్పి, అమాత్యయౌగంధరాయణుడు నాచేతిలో నుంచినాఁడు. అందువల్లనే సాగరిక అని పేరు పెట్టినాము.

రాజు.—[స్వగతము] ఏమీ ! యౌగంధరాయణుఁడు ఉంచినాఁడా? ఏమి యితఁడు నాకు తెలుపకయే ఏమేమో చేయును.

15 వసు.—[అపవారించి] బాభ్రవ్యా, వసంతకుని మెడలోని రత్నమాల అంతపోలికగా నున్నది, ఈమెయును సాగరమునుండి దొరకినది. అందువలన స్పష్టముగా ఈమె సింహళేశ్వరుని కూఁతురు రత్నావళియే. [లేచి ప్రకాశము] అయ్యమ్మలీ, రాజపుత్రీ రత్నావళీ, నీవు ఇట్టియవస్థపా లైతివి !

సాగ.—[వసుభూతిం గని బాష్పములతో] ఏమి! అమాత్యుడు వసుభూతి!

20 వసు.—అయ్యో! చెడితిని మందభాగ్యుడను! [అని నేలం బడును.

సాగ.—అయ్యో! చెడితిని మందభాగ్యను! అయ్యో నాయనా! అయ్యో అమ్మా; ఎక్కడ ఉన్నావు? నాకు బదులు పలుకు.

[అని తన్నుఁ దాను క్రింద పడవైచికొని మూర్ఛిల్లును.

వాస.—[సంభ్రమముతో] కంచుకీ, ఈమె నాచెల్లెలు రత్నావళియా?

25 కంచుకి.—దేవీ, ఆమెయే యీమె.

వాస.—[రత్నావళిం గౌఁగిలించి] చెల్లెలా, ఊరడిల్లు ఊరడిల్లు.

రాజు.—ఏమీ ! ఉన్నతవంశమువాఁ డైనసింహళరాజు విక్రమబాహుని కూఁతురా ఈకన్య?

విదూ.—[స్వగతము] రత్నావళిని చూచి అదిగో నే ననుకొంటిని సామాన్య జనానికి ఇటువంటి ఆభరణం ఉండ దని.

వసు.—[లేచి] రాజపుత్రీ, ఊఁఆడిల్లు మూఁఆడిల్లుము. ఇదె నీయక్క మిక్కిలి దుఃఖపడుచున్నది. కావున ఈమెను కౌగిలించుకొమ్ము

రత్నావళి.—[ఊఁఆడిల్లి రాజును ఓరచూపునం జూచి స్వగతము] నేను అపరాధము చేసినదాన్ని. దేవికి ముఖము చూపనేరను. [అని మొగము వాంచును. 5

వాస.—[సబాష్పముగా బాహువులు చాఁచి] ఓసి అతినిష్ఠురాలా అనుగు చెల్లెలా, రావే యిప్పుడు, నెయ్యముం జూపు. [అని కంఠమునం గొనును

[రత్నావళి తొట్రుపాటు నటించును.

వాస.—[అపవారించి] ఆర్యపుత్రా, ఈనాకఠినత్వానికి నేను లజ్జపడుతున్నాను. కనుక త్వరగా ఈమెసంకెళ్లని తీసివేయి. 10

రాజు.—[పరితోషముతో] దేవిమాట చేసెదను.

[అని సాగరిక సంకెలలను తొలఁగించును.

వాస.—ఆర్యపుత్రా, అమాత్యయౌగంధరాయణుడు నన్ను ఇంతకాలము చెడ్డదాన్ని చేసినాడు. ఎందుచేత ననగా ఎఱిఁగియుండిన్ని నాకు చెప్పడాయెను. 15

[అంతట యౌగంధరాయణుఁడు ప్రవేశించును]

యౌగం.

ఉ. నావచనంబునన్ హృదయనాయకుఁ బాసెను దేవి యత్తఱిన్ ;
దేవిని శోకవార్ధిని దించితి నే సపత్నిఁ దెచ్చుటన్ ;
దేవికి హర్షమే యగు నధీశునిసర్వమహీశతాప్తిచే ; 20
నీవహిఁ గొల్పియున్ వెఱతు నేఁ డ్రప దేవికి మోముచూపఁగాన్

కాక మఱియేమి చేయనగును! స్వామిభక్తివ్రత మనఁగా నిట్టిది! అత్యంతమానవీయులయెడల సముచితము అనువర్తనకుఅవకాశ మెల్లదు. [చూచి] వీఁడుగో దేవర మహారాజు. సమీపమునకుం బోయెద. (సమీపించి) జయము జయము దేవరకు. [పాదములందు వ్రాలి] దేవా, నేను దేవరకు చెప్పక చేసినదానిని దేవర క్షమింపవలయును. 25

రాజు.—చెప్పక యేమి చేసితివో చెప్పుము.

యౌగం.—దేవరా, ఆసన మలంకరింపుము, సర్వముం జెప్పెదను.

[అందఱును రాజుతోఁగూడ వారివారిచోటః గూర్చుందురు.

యౌగం.—దేవా, వినవలయును. ఈమె కదా ఆసింహళేశ్వరుని కూఁతురు, ఈమెనుగూర్చి సిద్ధుఁడు ఆదేశించినాఁడు—ఈమెను చెట్టపట్టువాఁడు సార్వభౌముఁడు రాఁ గలఁడని. అందువలన ఆనమ్మకముచేత నేను దేవరకొఱకు ఎన్నిమాఱులు ప్రార్థించి నను సింహళేశ్వరుఁడు దేవికి వాసవదత్తకు చిత్తఖేదము కావింపనొల్లక కన్యను ఇచ్చి
5 నాఁడు గాఁడు.

రాజా.—అంతట నేమి?

యౌగం.—[లజ్జతో] అంతట లావాణకములో మందిరమున బుట్టినచిచ్చుచేత దేవి కాలి పోయిన దని ప్రవాదపుట్టించి మరల సింహళరాజునకు బాభ్రవ్యుని బంపితిని.

రాజా.—యౌగంధరాయణా, అటుపైవృత్తాంతమును నేను వింటిని. మఱి యీ
10 బాలను నీ వూహించుకొని దేవిచేతిలో నుంచితివి!

విదూ.—ఓయి చెప్పకున్నా ఈయనఅభిప్రాయం నాకు తెలియకనే తెలిసింది. నీ మంటే అంతఃపురంలో ఉండేది అంతఃపురంలో వుండేవాడికి సులువుగా కంట బడుతుం దని.

రాజా.—యౌగంధరాయణా, నీయభిప్రాయమును వసంతకుఁడు సరిగా గ్రహించి
15 నాఁడా?

యౌగం.—దేవర యానతిచ్చినట్లే.

రాజా.—ఐంద్రజాలికవృత్తాంతము కూడ నీప్రయోగమే అని తలంచెద.

యౌగం.—ఒండువిధమున అంతఃపురములో చెంత నున్న యీమెను వెలివారు చూచుట యెట్లు! చూడకుండ వసుభూతి యెట్లు తెలిసికొనును! [నవ్వి] తెలిసినంతట
20 ఇప్పుడు ఏమి చేయవలయునో అందులకు దేవి ప్రమాణము.

వాస.—[చిఱునవ్వుతో] ఆర్యా అమాత్యా, స్పష్టముగానే చెప్పవేమి! 'రత్నావళిని ఆర్యపుత్రునికి ప్రతిపాదింపుము' అని.

విదూ.—అమ్మా, అమాత్యుని యభిప్రాయాన్ని నీవు సరిగా కనిపట్టినావు.

వాస.—[రెండుచేతులుం జాఁచి] రావే రత్నావళీ రావే, ఇప్పుడయినా నాకు
25 భగినీసదృశవృత్తము అగుదుగాక. [అని తనయాభరణములతో రత్నావళిని అలంకరించి ఆమెచేయి పట్టుకొని రాజుకడకుం దఱిసి] దేవా, పరిగ్రహింపుము ఈమెను రత్నావళిని.

రాజా.—[హర్షముతో చేతులు చాఁచి] దేవిప్రసాదము విడి బహుమతము గాదు! [అని సాగరికను కైకొనును.

వాస.—ఆర్యపుత్రా. ఈమెపుట్టింటివారు దూరానగదా ఉన్నారు. వారిని ఈమె స్మరింపకుండేలాగున ఆర్యపుత్రుఁడు ఈమెను చూచుకోవలెను.

[అని అర్పించును.

విదూ.—[హర్షముతో నృత్యము సేయును] హీహీ ! ఓహో ! జయం జయం నీకు ప్రియవయస్యుడికి; ఇప్పుడు పృథివియే హస్తగత యైనది గదా ! 5

వస.—రాజపుత్రీ వాసవదత్తాదేవిని ప్రణామముచేత అర్చింపుము.

[రత్నావళి అట్లు చేయును.

బాభ్ర.—దేవీ, నీకు దేవీశబ్దము మిక్కిలి తగియున్నది.

[వాసవదత్త రత్నావళిని కౌఁగిలించుకొని దేవీపదమును అనుగ్రహించును.

బాభ్ర.—ఇప్పుడు నాపరిశ్రమ సఫల మైనది. 10

యౌగం.—దేవా, మఱి చెప్పుము, నీకు ఇంకను ఏమి ప్రియమును గావింతును.

రాజు.—ఇంకనుం బ్రియ ముండునా? ఎట్లన,

మ. చెలఁగె న్విక్రమబాహుఁ డాత్మసముఁ డై; చేపట్టితిన్ సర్వభూ
వలయప్రాప్తివిధాత్రి సాగరిక ; లంభగ్నుల్ఖలు ల్గోసలుల్ ;
అలరెన్ బ్రీతి వహించి దేవి భగినిం బ్రాణాధికం గూడుటన్ ; 15
వెలయ న్నీవ యమాత్యసింహుఁడవ్వుగా, వే తేమి నేఁ గోరుదున్ ?

అయిన నిది యగుఁ గాక,—

[భరతవాక్యము]

మ ఇల నింద్రుం డొనరించుతన్ సకలసస్యర్ధిన్ సువర్షంబుచే ;
నిలవేల్పుల్ దనియింత్రు గాత విధివద్యజ్ఞేష్టులన్ వేల్పులన్ ; 20
కలకాలం బుఱుఁగాక సాధువులసంగంబు న్సుఖోత్తుంగ మై;
ఖలవాగ్దుర్జయవజ్రలేపము లఱుం గాతన్ సమూలంబుగాన్. ౮౧

[అందఱును నిష్క్రమింతురు.

[ఐంద్రజాలిక మనెడి చతుర్థాంకము సమాప్తము.]

---

Printed at the Chandrika Press, Madras—1937

# ఇందలి పాత్రములు

## పురుషులు

ఉదయనుఁడు—వత్సరాజు.

యౌగంధరాయణుఁడు—అతని ముఖ్యామాత్యుఁడు.

వసంతకుఁడు—విదూషకుఁడు.

వసుభూతి—సింహళేశ్వరుని యమాత్యుఁడు.

బాభ్రవ్యుఁడు—వత్సరాజు కంచుకి.

శంబరసిద్ధి—ఐంద్రజాలికుఁడు.

విజయవర్మ—వత్సేశ సేనానాయకుఁ డగు రుమణ్వంతుని మేనల్లుఁడు.

## స్త్రీలు

వాసవదత్త.—వత్సేశుని దేవేరి.

రత్నావళి (సాగరిక).—కథానాయిక, సింహళేంద్రుని కూఁతురు.

కాంచనమాల—దేవేరికి చేటి.

సుసంగత—మఱియొక చేటి, సాగరిక చెచ్చెలి.

నిపుణిక, మదనిక, చూతలతిక—చేటికలు.

వసుంధర—ప్రతీహారి.

## ప్రస్తావితులు

విక్రమబాహువు—సింహళేశ్వరుఁడు.

రుమణ్వంతుఁడు—వత్సేశుని సర్వసేనాపతి.

# రత్నావళీ ప్రభ.

---

ఆశీర్నమస్క్రియావస్తునిర్దేశములలో ఆశీరూపమున నిందు తొలుతటి నాల్గు పద్యములచే మంగళాచరణము చేయఁబడినది.

౧. ప. గౌరియొక్క శివపూజాకుసుమాంజలి సామాజికులకు సకలసంపదల నిచ్చును గాక అని యిట ఆశీస్సు.

తా. పెద్దదంపుఁ బాలిండ్లబరువుచే పార్వతిమేను వంగియుండుటచే ఆమె శివుని శిరముపై కుసుమాంజలి నుంచుటకు (శిరము అందక) పలుమరు మునిగాళ్లపై నిల్చియు, నన్నిమారులును స్తనభరముచే మరల నమ్రభావము వహించినది. అప్పుడు శివుఁడు ఆమెను మహోత్కంఠతో మూఁడుకన్నులతోను జూడసాగెను. ఆకారణముచే నామె లజ్జను పొందెను; ఆమెకు పులకలుదోఁచుటయు, చెమర్చుటయు, వణఁకుటయు, (నను సాత్త్వికభావములు)ను గల్గెను. అట్టితరి శిరమును పూజింప నామె పైకిమీటిన పుష్పాంజలి శిరమును చేరక నడుమనే చెదరిపడిపోయినది. ఆపుష్పాంజలి ఓ సామాజికులారా మీకు సకలసంపదల నొసంగునుగాక.

చరణ+అగ్ర+స్థిత ; స్తన+ఉచ్ఛ్రితిక్ = పాలిండ్లవలుదతనమునకు, అందుచే స్తనభరమునకు. శశ్వత్ =మాటిమాటికి ; నమ్ర = వంగినది; హైమవతి = హిమవంతుని కూతురు పార్వతి ; లజ్జ+ఆన్వీత = సిగ్గుతో కూడుకొన్నది ; గరుపాటు = పులకాంకురము ; నను+చెమట, నను ప్రత్యయం బల్పార్థకము. సాత్త్వికభావము గావున నించుకగా చెమటఁ బెట్టుట ; కుసుమ+అంజలి=పూలదోసిలి ; అంతరమందు=నడుమ, అనఁగా శిరముచేరులోపల; ఆకులము=చెదరినది.

తన్ను పూజింపఁ బార్వతిపడుపాటులు, ఆమె స్తనోచ్ఛ్రితి, దానఁ దేటపడు తద్యౌవనాతిశయము, ఆమె సౌందర్యవిశేషమును శివునిచూపును హరించి, ఆయనమనసును చూఱఁగొన్నవి. అందుచే సతతము 'ఆసాసలఁజూచుట.' రెండుకనులు చాలలేదు. కావున 'దృక్త్రయిక్.' (కోపముతోఁ జూచినచే మూఁడవకన్ను కాల్చును. "కినుక జ్వలియించు దృక్త్రయిఁ గనినయంత పూఁదుపహ్నులునుక్ మచ్చముడిఁగి సమసె." (౪-వ పద్యము.) పార్వతికిని ప్రణయావిర్భావమయ్యె ననుటకు ఆమె సాత్త్వికభావములు 'గరుపాటుక్ నునుజెమ్మటల్ వణఁకు.' అట్టియవస్థలో ఎట్టకేలకు నామె చేతి పూలు శివశిరము పైకిమీటఁగా అవి సూటిగా శిరముపైఁబడక నడుమ చెదరిపోవుట సహజము రమణీయమును. ఇట్లు శివపూజ స్మరపూజయైనది.

కవిప్రపంచమున సుమములవియు, సుమాస్త్రునివియుఁగదా ప్రాభవము. అందుచే

సుమాంజలియాశీస్సు చెప్పుట. మఱియు, ఆసుమాంజలి గౌరిది కావునను, శివపూజానియుక్తముగావునను, 'అనంతశ్రీల' నిచ్చు ప్రభావముకలది. (వేణీసంహారమునందును సుమాంజలిచే ఆశీస్సుకలదు.) గౌరిచేతిపూలు శివుని శిరముచేరకున్నను, గౌరిహృదయము శివునిహృదయమును చేరినది. ఆమెకు శివునిప్రణయము లభించినది. అట్లే సామాజికులకును మహాఫలము కలుగును.

నాందీశ్లోకములలోనెల్ల కావ్యార్థసూచన యుండవలయునని కొందఱమతము. వారు ఈపద్యమునందు ప్రథమాంకమున మదనమహోత్సవములో మదనపూజయందలి పుష్పాంజలిప్రదానమునకు సూచనకలదందురు. ఇందు పుష్పాంజలి శివునిశిరము చేరక నడుమనే చెదరిపోవుట రత్నావళి సింహళమునుండి వత్సరాజునకర్పితయయ్యును ఓడపగులుట ఇత్యాదికారణములచే ఆయనను కొంతకాలము చేరలేకపోవుటకు సూచన యని మఱికొందఱు.

"లజ్జాస్వీకృతయై" మున్నగుపదములచే సుమాంజలి యాతులమాటకు హేతువు గమ్యమగుటచే కావ్యలింగాలంకారము.

ఇది నాందీశ్లోకము. లక్షణము 'నాటకలక్షణప్రతి' యందుఁ జూడవలయును.

శ్రీ. ప. పిమ్మట, నూత్నసంగత పార్వతి సామాజికులకు మేలుచేయునుగాత యని యాశీస్సు.—

తా. ప్రథమసంగమవేళ పార్వతి వరునిసరసకు ఔత్సుక్యముతో బయలుదేరెను గాని, వధూజనసహజమైనసిగ్గుచే వెనుకాడెను. అప్పుడు బంధుస్త్రీలు ఆమెను మంచి మాటలతో బ్రతిమాలి వరుని సన్నిధానమునకుం జేర్చిరి. ఎదుట వరునిగాంచి నివ్వెఱ పడి, పులకలుజనింప, సరసకుఁజేరు పార్వతిని నవ్వుచు శివుఁడు కౌఁగిట గ్రుచ్చెను. ఆ పార్వతి మీకు మేలుచేయునుగాక.

మరులు=వలపు. సహజ = నైజమైనట్టి; తోడఁబుట్టువు. బంధులలనల్ = బంధుస్త్రీలు. త్రాసము = భయము-సాత్త్వికభావము. గగురు = పులక, రోమాంచము. సరస+ఉక్తంబులు=మంచిమాటలు; భయముతీర్చు బుజ్జగింపుమాటలు. సరసన్=సమీపమునకు, మెయిగొను=కౌఁగిలించు. శర్వాణి=పార్వతి (వ్యు. శర్వునిపత్ని)

పార్వతి ముగ్ధ, 'లజ్జావిజితమన్మథ' మనసులో ప్రియునిచేర నుత్కంఠ సందడించుచుండ, బయలుదేరియు, స్త్రీజనసహజము, అందును క్రొత్తపెండ్లికూఁతులకు మఱింతసహజమును, ఐన లజ్జచే వెనుకకుఁ బోఁజొచ్చెను. 'సహజ.' (మూలము. 'సహాభువా') సిగ్గు అను తోఁబుట్టుచేత నని స్వారస్యము. చెల్లెండ్రు పెండ్లికూఁతును మరల్చుటయును నన్యబంధుస్త్రీలు వరుని సాముఖ్యమునకుఁజేర్చుటయును స్వభావము.

అలంకారము స్వభావోక్తి.

ఇంకు కొందఱు 2-వ యంకమున వత్సరాజ సమాగమకాలమున సాగరిక యౌత్సుక్య సాధ్వసప్రవృత్తికి సూచనకల దందురు.

3. ప. హరిహరాత్మకుఁ డగుదేవుఁడు సామాజికుల రక్షించుఁగాక.

సవతిని దెచ్చినందుకు లక్ష్మీపార్వతుల యుపాలంభనవాక్యములు,—

[హరిపరమైన యర్థము] మకరధ్వజుఁ=మొసలిటెక్కెమువానిని సముద్రుని, మును=పూర్వము (సముద్రమథనకాలమందు) నాకొఱకె, ప్రచ్ఛిలివిగావె = చిలికితివి గదా; కావున, మత్స్యమత్స్యమ=నాయెదుటనే, ఓ బహుమార్గ=పెక్కుదారుల (బోవు) వాఁడా. (పెక్కవతారములవాఁడా, తీరుతెన్ను నీతినియమములేనివాఁడా) లేదా, 'మృగస్వభావః మార్గః' బహుమార్గ = అనేకమృగములరూపములను (మత్స్యాదిని) తాల్చుటచే వానిస్వభావముకలవాఁడా; ధరను = భూదేవిని, మోవఁ = మోచుటకు (ఆదివరాహమూర్తి తనకోఱపై భూమిని దాల్చెను); నీకతగుర = నీకేసరిగానున్నది. మఱెవ్వరికిఁ గాదనుట. భూమి గోరూపయని ప్రసిద్ధి కావున అమృగము మృగమైన నీకు తగిన భావము; దానినే = అభూమినే, భావకుటిలను = కుబ్జగోళాకారను, వంకర టింకరగా నున్నదానిని, దన్పుకోర = వాక్యవ్యాపారములచే ననునయించుకోర (ఇట ఆక్షేపదము సొంపుగనున్నది.) ఓకృష్ణ = ఇట కృష్ణావతారమర్థముకాదు, ('విష్ణుర్నారాయణఃకృష్ణః', ఓనారాయణుఁడా, నా-కంధరా+గ్రహము = కంఠాశ్లేషమును, విడు, నాగండ = సిగ్గుమాలినవాఁడా, (అని) కిన్కఁ = కోపముతో, ఎవనిఁ, అబ్ధిభవ = (క్షీరసాగరకన్యక) లక్ష్మి, అనుఁ = అని యుపాలంభించునో, ఆదేవుఁడు = నారాయణుఁడు.

[హర] మును=గౌరీకల్యాణమందు, నాకొఱకె, నీవు, అమకరధ్వజుఁ = మన్మథుని, ప్రచ్ఛిలివిగావె=కాల్చిచంపలేదా, కావున, మత్స్యమత్సమె, (ధరఁ =లోకమందు) బహుమార్గఁ=త్రిపథగను గంగను, మోవఁ = తలపైకెక్కించుకొని మోచుటకు, నీకు తగుర, దానినే=ఆగంగనే, భావకుటిలను = (నదికావున వక్రముగా ప్రవహించుస్వభావముకలది) ఆకుటిలస్వభావను, తన్పుకోర; కృష్ణకంధర = నల్లనిమెడకలవాఁడా, (విషకంఠుఁడా, కనఁబడుచు కంఠమునను కనఁబడక నిలువెల్లను విషముకలవాఁడా) గ్రహము=నీయాపట్టును (అలింగనమును) ఉజ్జగింపు=వదలుము, నాసగండ, అని, కిన్కఁ, ఎవని, నగప్రభవ = హిమవంతునికూఁతురు పార్వతి, అనుఁ, ఆదేవుఁడు = అశివుఁను అనల్పకరుణఁ = మిక్కిలిదయతో, మీకు=సామాజికులకు, సర్వసౌభాగ్యములు = సకలసంపదలు, ఒసంగుఁగాక.

ఇందు ఉభయార్థములును శ్లేషచే నిర్వహింపఁబడినవి కావున శ్లేషాలంకారము.

ఇందు తృతీయాంకమున వత్సరాజును, సాగరికాకాముకుని, వాసవదత్త ఉపాలంభించుటకు సూచన కలదందురు.

౪. ప. దక్షయజ్ఞధ్వంసచరిత్రను పార్వతికి అభివర్ణించు శివుఁడు మిమ్ము రక్షించునుగాక.

తా. "కోపముచే మండుచున్న మూఁడుకన్నులతో నేను జూడఁగనే దక్షాధ్వర త్రేతాగ్నులు పూర్తిగా చల్లారిపోయెను. రణోత్సాహులు నా ప్రమథగణములు తలసిర లొడిసిపట్టఁగా ఋత్విజులు భయముచేఁ దరి నేలపైఁబడిరి. దక్షుఁడు ("సర్వదేవాధిదేవుఁడవు, మహాదేవుఁడవు") అని నన్ను నుతింపసాఁగెను; దక్షపత్ని దీనగముగ నేడ్వసాఁగెను; యజ్ఞమునకై వచ్చిన దేవతలెల్ల నాకు వెఱచి పలాయితులైరి"— అని యిట్లు స్వప్రభావము ప్రకటముచేయు దక్షాధ్వరధ్వంసకథను, సాట్టహాసముగా, పార్వతికి వర్ణించిచెప్పు శివుఁడు మిమ్ము రక్షించునుగాక.

"వృత్త్రయి" కోపమువచ్చిన ఫాలనేత్రమే కాదు, మూఁడుకన్నులును నిప్పులు గురియును.

ఋత్విజులు=యాజ్ఞికులు. మూఁడువహ్నులు = ఆహవనీయము, గార్హపత్యము, దక్షిణాగ్ని; చిఱుతలగు = మిక్కిలి చపలులైన; "చపలశ్చికురస్సమా" అని అమరుఁడు. (=ఉత్సాహశీలురైన) గణములు=ప్రమథగణములు, శివునిపరివారము; ముచ్చముడిఁగి= (ముడిఁగి+ముడిఁగి = మిక్కిలిముడిఁగి) పూర్తిగాచల్లారి; 'హాసించు' స్వప్రతాపమహిమ ప్రకటమగుట.

"బిట్టు వెసదాను చిచ్చుఱపికొనువోలె
మిడుకురతిఁదాఁకు మెఱుముచ్చ ముడిఁగిపడఁగ" కన్నె. కుమార ఆ. ౮.

ఇందు నాలవయంకమున మాయాగ్ని వృత్తాంతమునకు సూచన కలదందురు.

౫. ప. రిక్కలదొర = నక్షత్రములరాజు, చంద్రుఁడు, రిక్క (ప్రా.) ఋక్షము; ద్విజవృషుల్ = బ్రాహ్మణశ్రేష్ఠులు. 'వృష' రూ. వృషభ. ఉత్తరపదమైనప్పుడు వృషభ సింహశార్దూలపన్నగ లలామరత్నాదులు శ్రేష్ఠవాచకములు. "విభుఁడు చంద్రవపువు" రాజుచంద్రునిశరీరమువలె శోభాయమాన శరీరుఁడగుఁగాక.

ఇది ప్రక్షిప్తశ్లోకము. నాంద్రశ్లోకములలో చంద్రకమలాది శబ్దములు లేవని ఎవఁడో వ్రాసి చేర్చినశ్లోకముగానోపును.

"ఈ పైశ్లోకములలో మొదటిది నాందీశ్లోకమని కొందఱును, కడమవియును నాందిలోఁ జేరినవే యని కొందఱును చెప్పుదురు. అయినను ఇట్టి రూపకారంభశ్లోకములు

రంగద్వారముగాని నాంది కాదని విశ్వనాథకవిరాజు మతము." విస్తరము సాహిత్యదర్ప
ణమునఁ జూడవలయును. నాందిలక్షణము నాటకలక్షణప్రతిలోఁ జూడఁగును. నాందీ
పద్యములలోఁ బదసంఖ్య నియమితముగానే; అందును కాళిదాసుని విక్రమోర్వశీయ
నాందిలో అవి సరిపడలేదు; తెలుఁగునను మఱియుఁ జెల్లవు.

## ప్రస్తావన.

ప్రస్తావించునది=కథ నవతరింపఁజేయునది ప్రస్తావన. లక్షణము నా. ల. ప్ర. చూ.
'నాంద్యంతము సూత్రధారుఁడు.' చూ. నా. ల. ప్ర.

సూత్రధారుఁడు="సూత్రం=కథాసూత్రం, ధారయతీతి సూత్రధారః" కథా
సూత్రమును ధరించువాఁడు గావున సూత్రధారుఁడు. ఇతఁడు ప్రధాననటుఁడు.
సూత్రధారుఁడు నటిని 'ఆర్య' అనియు, నటి సూత్రధారుని 'ఆర్యపుత్ర' అనియు
సంబోధించుట నాటకశాస్త్రసమయము.

"అతివిస్తరమేల!" శబ్దములవిరివి విస్తరము, అక్షరములయొక్క విరివి విస్తారము.
"విక్రమసింహపురీ శ్రీరంగనాయకస్వామి వసంతోత్సవమునఁ" నెల్లూరిలో
ఉత్తరపినాకిని దక్షిణతటమందున శ్రీరంగనాయకస్వామివారి దేవాలయము కలదు.
"నెల్లూరి పెరుమాళ్ల సేవ" అని యుత్తరమండలములలో ప్రసిద్ధి.

రసికవతంసులు = రసజ్ఞశేఖరులు. 'కావ్యము రసాత్మకమైన వాక్యము' గావున
కావ్యాత్మయైన రసమును గ్రహించునేర్పరులు రసికులు. కావ్యముయొక్క గుణాగుణము
లకు వారె ప్రమాణము. 'నేపథ్యరచన' గావించి=వేషముదాల్చి. "నేపథ్యం రఙ్గభూమావా
స్యాన్నేపథ్యంచ ప్రసాధనే" విశ్వుఁడు. పరిక్రమించి = కొంచెము నడచి. "పరిషత్తు"-
(పరితః సీదన్త్యస్యా మితి పరిషత్) సభ. "సామాజికులు" = (సమాజః సమావేశః తం
ప్రయోజన మేషా మితి సామాజికాః) నాటకముచూచువారు.

౫. వ. కృతి = నిపుణుఁడైన, "ప్రవీణేనిపుణాభిజ్ఞ విజ్ఞనిష్ణాతశిక్షితాః వైజ్ఞానికః
కృతముఖః కృతీకుశల ఇత్యపి" అమరము. ప్రణేత=రచయిత (చూ. నిపుణః కవిః");
పరిషత్తు = సభ; హృద్యము = మనోహరము ; ఈహాసిద్ధి = కోర్కె నెఱవేరుట ; భాగ్య
ము = అదృష్టము, 'ఆనందరాజ్యంబుగాక' అనితాత్పర్యము.

౬. వ. కోవిదసత్తములు = పండితోత్తములు ; టెంకి = స్థానము ; దైవము =
భాగ్యము, అదృష్టము. 'దైవం దిష్టం భాగధేయం'

'శ్రీహర్షుఁడు', 'వేంకటరాయశాస్త్రి'—అను పదములు మహానిపుణులు అని
సాభిప్రాయములు గావున పరికరాంకురము అలంకారము.

౫, ౬, పద్యములందు 'నేడు సర్వగుణంబులుంగలిగె' అనుటచే సముచ్చయా లంకారము.

ఈపద్యములు ప్రరోచనయనెడు ప్రస్తావనాంగము. కవికావ్యనటాదుల ప్రశంస ప్రరోచన యనఁబడును. (సా. ల. ప్ర) ప్రరోచనయందు కవి తన్నగ్గించుకొనుట నాటకలక్షణమర్యాద.

''సంగీతకము'' (స్త్రీభిఃకృతంతు సంగీతం సంగీతకముదా హృతమ్.) సంగీతక మనఁగా స్త్రీలు కలిసి చేయుసంగీతము.

పం. 12. 'నేపథ్యము.' తెరమాటున నటకుటుంబము వేషములు దాల్చుచోటు. (Green room)

పం. 13. సనిర్వేదము=దుఃఖముతో ; 'నీకు చింతలేదు'—ఇంటివిషయములు మనసునఁ బెట్టవు కావున.

పం. 15. 'దేశాంతరంలో ఇచ్చినావు.' ఇట 'ఇచ్చినావు' = వరనిశ్చయము చేసినావు' 'Betrothed'. నటి గ్రామ్యము భాషించుట గమనింపుఁడు. సంస్కృత నాటకమున స్త్రీలును నీచపాత్రలును ప్రాకృతము భాషింతురు. తెలుఁగున ప్రాకృత స్థానమున గ్రామ్యము నెలకొల్పఁబడినది. ఇది శాస్త్రులవారిమతము, సహృదయమత మును. శాస్త్రులవారి 'గ్రామ్యభాషాప్రయోగనిబంధనము'న ఈమతము సిద్ధాంతితము

౭. ప. కడలి = సముద్రము. (కడఁ=అలలు-కడలుకలది కడలి)-బహువ్రీహి. ఇకారము సమాసాంతకార్యము.

కడ=దిక్కు, కడలకావలినుండి = దిగంతములనుండి ; ఒండు = ఒకానొక, తత్పూర్వము పరిచితముగాని; విధి = అదృష్టదేవత.

''కడలినడుమ'' ఇత్యాద్య ప్రస్తుతవర్ణనచే సూత్రధారుని కన్యకకు దూరదేశ వరునితో వివాహము సుసంభవమే యనియు, అట్లే రత్నావళిని సముద్రమునుండి తెచ్చుటయు సుసంభవమే అనియు ప్రస్తుతము తోచుటచే నప్రస్తుతప్రశంస అలం కారము.

ఇందు కావ్యార్థసూచన తప్పక కలదు—'దవ్వులనున్న' సింహళ ''ద్వీపము'' నుండి వత్సరాజుకడకుఁ బంపఁబడిన రత్నావళి ఓడపగిలి 'నడిసముద్రముపాలై' 'విధి యభిముఖుఁడగుట'చే వత్సరాజు నాస్థానము చేరి, కడకు అతనిరాణి యాటయను 'నభి మతమును' బడసె నను కథయెల్ల సూక్ష్మముగా సూచితము.

ఇట ప్రస్తావనాంగము కథోద్ఘాతము కలదు. సూత్రధారుని వాక్యమునుగాని దానియర్థమునుగాని కొని పాత్రము ప్రవేశించుట కథోద్ఘాతము. 'ఇచట కడలినడుమ' ఇత్యాది సూత్రధారవాక్యముంగొని యౌగంధరాయణ పాత్రప్రవేశము.

భరతపుత్త్రుఁడు—నాట్యశాస్త్రప్రవక్తలలోఁ బ్రసిద్ధుఁడు భరతముని. భరతపుత్త్రుఁడు లక్షణవేత్తయగు నటుఁడు. ''భరతవాక్యము'' నిట్టే.

''వీఁడుగో నాతమ్ముఁడు యౌగంధరాయణ వేషముం దాల్చి వచ్చియున్నాఁడు'' ఇట ప్రస్తావనాంగమగు ప్రయోగాతిశయముం గలదు. ''వీఁడె'' మన్నగు మాటల వలన పాత్రప్రవేశము నిర్దిష్టమైనచో ప్రయోగాతిశయము.

## ప్రథమాంకాదిని విష్కంభకము

ఇందు 'సిద్ధుని యాదేశము' మొదలు 'రుమణ్వంతునితోఁ గలిసె' అను వఱకు పూర్వకథయెల్ల సూక్ష్మముగా నతినిపుణముగాఁ జెప్పఁబడినది. ఇందు యౌగంధరాయణుని నీతివిభవమును, 'ఎల్లవిధముల నాయేలికకు అభ్యుదయములు ఒనఁగూడుచున్నవి,' 'ప్రభుప్రయోజనము సిద్ధప్రాయము'—అనుటచే తన్నీతిప్రభావమూలమున కడకు రత్నావళీవివాహమును వత్సరాజ సార్వభౌమత్వప్రాప్తియు కలుగనున్నవనియు, 'స్వచ్ఛందచారి నగుచు' ననుటచే తత్ప్రయోగము రాజునకు తెలియదనియు వర్తిష్యమాణకథ సూచితము.

సిద్ధాదేశము-చూ. 54 పుట. ''ఈమెను (రత్నావళిని) పెండ్లియగువాఁడు సార్వభౌముఁడగునని సిద్ధుఁడు ఆదేశించియున్నాఁడు.''

''ఇట్లు దైవంబు చేయూఁత యిచ్చియుండ'' (1) రత్నావళీరక్షణము (2) అదియు కౌశాంబీవర్తకునిచే నగుట, (3) అతఁడు ఆమెను గుర్తించుట, (4) యౌగంధరాయణునికడకుఁ జేర్చుట, (5) కడపట సాగరిక రత్నావళియే అని గుఱుతింప వీలుకలుగ బాభ్రవ్యవసుభూతులు సముద్రమునుండి గట్టెక్కి రుమణ్వంతునిఁ జేరుట.—ఇవి దైవ మిచ్చిన చేయూఁతలు. దైవసహకృతమగు యౌగంధరాయణుని యుత్సాహము నాటకమునకు బీజము.

. సిద్ధప్రాయము.—ఇంచుకకొంతగా నెఱవేఱినది. Almost achieved. ప్రాయ, కల్ప, ఇత్యాదులు ఇట్టియర్థమును తెల్పును. రాజాంతఃపురమునున్న సాగరికపై రాజునకు మరులు గల్గుటయు, ఆమె రత్నావళియని యెఱుంగుటతోడనే వాసవదత్తయే ఆమె వివాహమును నెఱవేర్చుటయు సులువుగ జరుగును.

ధృతి=ధైర్యము. యౌగంధరాయణునికి ధైర్యముకలుగమి రాజెఱుంగనటుల నిచ్చల్ల దాఁజేయుటచే గల్గినభీతిచేత. అనుగతము = తోడజరుగునది. చర్చరీధ్వనులు= చర్చరీ *ద్విపదీఖండములు గీతికావిశేషములు.

---

* ''ద్రుతమధ్యలయం సమాశ్రితా, పఠతిప్రేమభిరా నటీయది
ప్రతికణ్ఠ ప్రపూరకేణవా, ద్రుతమధ్యా ప్రథమాహిచర్చరీ.''

ద్విపదీఖండము,—

౯. ప. ఇందు వత్సరాజు మన్మథుఁడుగా నుపమింపఁబడినాఁడు. ప్రియవసంతుండు = (వత్స) వసంతకుఁడనువానిని నర్మ సచివుఁడుగాఁగలవాఁడు. (మన్మ) వసంత ఋతువు సఖుఁడుగా గలవాఁడు; విశ్రాంతవిగ్రహుండు = (వత్స) శమించిన యుద్ధములుకలవాఁడు. (మన్మ) (ముక్కంటి కంటి మంటచే) సమసిపోయిన శరీరముగలవాఁడు ; జనమనోనిలయుఁడు = ప్రజలమనములు రాజునందు అనురాగము కలవి గావున నిత్యము నతనిని ఆధ్యానించుటచే, వారిమనసులే వాసస్థానముగాఁ గలవాఁడు. (మన్మ) ['హృదయవసతిః పఞ్చబాణస్తు బాణః' ప్రాఘువ.] అనురాగరూపమున జనుల మనసులయందు వసించువాఁడు; వసంతము మదనోత్తేజకము గావున మఱియును. స్వమహామును = (వత్స) తానును తనవారలును జేయునట్టి యుత్సవమును (మన్మ) 'మదనోత్సవము' కావున తన్నుఁగూర్చి చేయు నుత్సవమును ; చూచు తివుటన్ = చూచు నుత్సుకతతో, సాక్షాత్కరించు = (శరీరములేనివాఁడయ్యు) శరీరిగా ప్రజల కనులయెదుట పొడకట్టి, ప్రసవధనుఁడన = (పూవిల్తుఁడు) మన్మథుఁడోయన, అదె = వాఁడుగో, వత్సరాజువచ్చున్ = ప్రాసాదము (మేడ) పైకి వచ్చుచున్నాఁడు.

ఇందు వత్సరాజ ప్రసవధనులకు సాదృశ్యము చెప్పఁబడుటచే నలంకారము ఉపమ ; ఉభయసామాన్యములుగా చెప్పఁబడిన విశేషణములు శ్లేషచే నిర్వహింపఁబడుటచే ఉపమ శ్లేషానుప్రాణితము.

ఇందు వత్సేశుని మన్మథునిగాఁ జెప్పుట, "ఏమి ప్రత్యక్షుఁడే అపూర్వుఁడు కుసుమాయుధుఁడు" (I అం) అని సాగరిక రాజును సాక్షాత్తుగా పూజగైకొనవచ్చిన మన్మథునిగా పొరపడుటకు పూర్వనిర్దేశప్రాయముగ నున్నది.

అదెవత్సరాజు వచ్చు—ఇందు వత్సరాజుప్రస్తావము వెంటనే ఆపాత్రము ప్రవేశించునని సూచించుచున్నది. నిర్దిష్టముగాక పాత్రరంగస్థలమును ప్రవేశింపరాదని నాటకశాస్త్రసమయము. ఇది ఈనాటకమున సర్వత్ర నత్యద్భుతముగ నిర్వహింపఁబడినది.

విష్కంభకలక్షణము నాటకలక్షణ ప్రతియందు చూడుఁడు.

## ప్రథమాంకము.

కథాంశము—సాగరిక వత్సరాజును మదనోత్సవములోఁ జూచి వలపుఁగొనును.

---

" భవేత్ ద్విపదికాగీతిః భరతేన ప్రకీర్తితా
యుక్తా చతుర్భిశ్చరణైః చతుర్దశకలాత్మకైః. "
" త్రయోదశకలాత్మకైః" అనియుం గొందఱు.

౧౦. ప. సన్మంత్రికేక్ = మంచి (=యోగ్యుఁడైన మంత్రి చేతియందు ; యౌగంధరాయణుని ప్రభుహితైషిత్వము జగత్ప్రసిద్ధము. ఉజ్జయిని చెఱ తప్పుటయు, ఈనాటకమునందు రత్నావళీ ద్వితీయముఁగ సార్వభౌమత్వము సాధించుటయు తన్మహిమ చేతనే. శమిత+ఉపద్రవతక్ = బాధలుఁలేరుటచే ; విహిత - రక్షా - ప్రాప్తి-రక్తుల్ - జనుల్ = ప్రశస్తమైన రక్షణము కలుగుటచే (రాజునందు) ప్రీతిగలవారు ప్రజలు ; అమని = వసంతఋతువు (సర్వసుఖోపభోగక్షమము); ఈవు = నర్మసఖుఁడవు, కామప్రసాదదక్షుఁడవు నీవును ; (వసంతకుఁడు రాజునకు ఎంతసహాయుఁడో ఈనాటకమునఁ జూడనగును ) అవంతిభవయుక్ = (ఉజ్జయినికి అవంతియని మఱొక పేరు) ఉజ్జయినిరాజగు చండమహాసేనుని పుత్త్రి వాసవదత్తయు (-నుండఁగా) వాసవదత్తావత్సరాజుల పరస్పరానురాగము ప్రసిద్ధము. కథాసరిత్సాగరమునందును, స్వప్నవాసవదత్తానాటకమునందును, తాపసవత్సరాజనాటకమునందును విస్తరము తెలియవచ్చును. సంకేతమాత్రక్ = (ఇది మదనోత్సవముగావున) పేరునకుమాత్రము; ధృతిక్ = ముదమును.

ఈపండుగు నాదియని తలంచుటకు సముయంజేసినవైరులక్ మున్నగు వాక్యార్థములు హేతువులు అగుటచే అలంకారము కావ్యలింగము. పెక్కుహేతువులు ఏక కార్యమందు అన్వయించుటచే సముచ్చయాలంకారమును. ఇట కావ్యలింగము సముచ్చయానుప్రాణితము.

వత్సరాజు ధీరలలితనాయకత్వమునకు ఇది చక్కనియుదాహరణము.

'శమిత........రక్షా ప్రాప్తి' సంయుక్తాక్షరయతి. క్షకారమును వైయాకరణులు సంయుక్తాక్షరముగ (క్+ష=క్ష) గణించిరి. అందుచేతనే తత్పూర్వలఘువునకు గురుత్వము.

విదూషకుఁడు — నాయకునకు నర్మసఖుఁడు. [నా.ల.ప్ర] వత్సరాజునకు నర్మసఖుఁడు వసంతకుఁడు. అతనితండ్రి వత్సరాజుతండ్రి యగు సహస్రానీకునకు నర్మసఖుఁడు, వసంతకుఁడు వాసవదత్త కెట్లు కథావినోదము గూర్చుచుండినదియు, ఉజ్జయినీకారానిముక్తియందును వాసవదత్తాహరణమందును వత్సరాజున కెట్లుపకరించినదియు కథాసరిత్సాగరమున చదువవచ్చును.

(1) విదూ—"నీవు చెప్పినదినరే" (2) రాజు—"నాదె యీ పండుగా" (3) యౌగం (౯ పద్య) "స్వమహిమను..." ఇట్లు రాజునకును మన్మథునకు ఔపమ్యము.

13. వం. "ఈమదనమహోత్సవం బాపనపటువనైన నా ఒక్కనిదే" విదూషకుఁడు ప్రాయికముగ భోజనప్రియుఁడు, చూడు "మటిలే, అక్కడికే వెళ్ళాం ఎందు

కంటే బాపనపుట్టువాడికి నాకు స్వస్తివాచనం ఏమయినా దొరుకుతుంది" 8 పుట; వాసు: అర్యా, ఇదిగో స్వస్తివాచనం పుచ్చుకో 12 పుట.

'చిమ్మనగ్రోవి.' మూ. 'శృంగః', 'క్రీడామ్బుయన్త్రః' (Syringe). మదన మహోత్సవము రూపుదాల్చినది. దిఙ్ముఖములె తన్ముఖములు; నృత్యమృదంగచర్చరీ ధ్వనులే తచ్ఛబ్దములు; పౌరులనృత్యమే తచ్చేష్ట. వసంతమని వర్ణనలు కొన్ని కావ్య స్పర్శకలవిగ నున్నవి.

18. పం. మొగాలాలు = ముఖములు, మొదళ్లు.

౧౧. ప. తా. కుంకుమపొడితో కలిసి పచ్చనైన గందవొడి జల్లులచేత దిక్కు-లన్నియు ప్రాతస్సంధ్యారాగశోభను దాల్చినవి; అశోకపు సిగదండలు పౌరులశిరముల మెండుగ వెలయుచున్నవి. బంగారు నగల కాంతులు వారల శరీరములం దంతటను వ్యాపించియున్నవి. అందుచే కౌశాంబీ నగరమంతయు స్వర్ణవర్ణమయమై తనయలం కారముల సౌభాగ్యముచే కుబేరుని ధనగృహమును కొల్లగొనిన ట్లొప్పుచుండ నందలి జను లెల్ల తమశరీరములకు బంగారు నీటిపోఁత పోసికొన్నట్లు చూపట్టుచున్నారు. ఎచటఁ జూచినను ఒకటే పచ్చఁదనము పరిఢవిల్లియున్నది.

టీక. కొంకుమ క్షోదగౌర బుక్కా ప్రవృష్టి' గీటు అంతయు నొకసమాసము కాదు. క్షోదము=పొడి (క్షోదః పేషణచూర్ణయోః). గౌర(మైన)=పచ్చనిదైన, బుక్కా ప్రవృష్టి = గందవొడిజల్లు; వంజుల-శేఖరములు = అశోకపు సిగదండలు ; శిరములను వంప, (సిగదండల బాహుళ్యము తేటపడుచున్నది.) కడాని-డాలు = బంగారుకాంతి; మేనులను-ముంప = శరీరములను ముంచివేయఁగా, (నగలబాహుళ్యము తేటపడు చున్నది.) 'ధనేశు ధనగృహంబు' అట్టివిభవము మఱెచ్చటను ఉండదు గాన. జవురు కొనె = ఒకమారే పూర్తిగా కొల్లఁగొట్టెను; మొలాము = పూఁత, తొలుసంజసిరి = ప్రాతస్సంధ్యాశ్రీ. తొలుసంజసిరి తొలుసంజయందే యుండును. అటులైనను తొలు సంజ సిరివంటి సిరి ఇట సకల దిశలయందుఁ గలదని యభిప్రాయము. 'సంజసిరిగా' అను పదముయొక్క యర్థముచే తత్సదృశమైనసిరి (ఉపమానము) ఆక్షిప్తమైనందున అలంకారము పదార్థవృత్తి నిదర్శన.

౧౨. ప. తా. పౌరులు చిమ్మనగ్రోవులచేఁ గురిపించిన యెడతెగని హిమాంబు పూరము ముంగిళ్లలో వరదలు గట్టియున్నది. ఉత్సవపు తమకముచే ప్రమోదాతిశయ మున నటించు పౌరుల మితిమీరిన కాలితొక్కుడులచే నేర్పడిన రొంపి ప్రమదల చెక్కిళ్లనుండి జారుచున్న సిందూరము కలిసి యెఱ్ఱనైనది, ఆ యెఱ్ఱరొంపిని త్రొక్కిన

జనుల పదన్యాసములచే (పూర్వము తెల్లఁగనుండిన) యంతిపురపు మొగసాల రాకట్టరి తయు నెఱ్ఱనై యొప్పారినది.

టీక. హిమాంబుల్ = పన్నీటి ప్రవాహము, ధృతుల్ - మీరింబో = సంతోషము-అతిశయింపఁగా, యేపు = అతిశయము; చెక్కుచెంద్రము = కపోలములయందలి సిందూరము; ఉరలన్ = జారఁగా, నానాపదన్యాసమై = అందఱు జనుల యడుగులు కలదై, రాకట్టు (రాయి+కట్టు) Pavement. సమాసమున సంత్యాక్షరలోపము. చెంది రము+ఐ = సిందూరవర్ణము కలదై, ఎఱ్ఱనై, ఎమ్మెకత్తెలు, రూ. ఎమ్మెకత్తియలు, 'కత్తియ' తద్ధితప్రత్యయము.

౧౩. వ. ఎడతెంపిలేక రాలుచున్న గండపాడిమబ్బులు దెసలనావరింపఁ గ్రమ్మిన చిమ్మచీఁకటిలో రత్నభూషణముల కాంతుల మొత్తములచే మాత్ర మొకిం చుక కానవచ్చుచు, పడగల పైకెత్తినట్లు వసంతములఁ జల్లుకొనుటకై చిమ్మనగ్రోవుల పైకెత్తుచు, భుజంగసమూహము నాకు పాతాళము తలంపునకుఁ దెచ్చుచున్నది.

టీక. రశ్మి=కిరణము, కాంతి; ఫణలు (రూ. ఫణము లు) పడగలు ; ఆధ్యానము మీఱన్ = ఉత్కంఠ హెచ్చఁగా. (ఉత్కంఠాపూర్వక స్మరణము ఆధ్యానము.)

ఇచ్చటి బుక్క మబ్బులచీఁకటి పాతాళపు జీఁకటి; ఇచటి భుజంగలోకము (= ఎమ్మెకాండ్రసమూహము) పాతాళమున భుజంగలోకము (= పాములగుంపు.) ; ఎమ్మెకాండ్ర గ్రోవులు పాములపడగలు ; ఇచట ఎమ్మెకాండ్రు గ్రోవులనెత్తుట పాతాళమున పాములు పడగలనెత్తుట; ఇచట మణిభూషణములకాంతులచే నెమ్మెకాండ్రును, ఫణామణులకాంతులచే పాములును కానవైనవి. ఈసాదృశ్యముచే నుదయ ననికి పాతాళము స్మరణకువచ్చినది కావున స్మరణాలంకారము.

౧౪. వ. ఇందు వసంతధర్మములు చెప్పఁబడినవి,—వలకడ = దక్షిణదిక్కు ; తెమ్మెర (తెమ్మ+ఎర=గాలి) = చల్లనిగాలి, దక్షిణమారుతము ; వలరాజు నానలి తెచ్చె నే=మలయమారుతము మదనసందేశము దెచ్చుననుట కవిసంప్రదాయము. మదనోద్దీపక మని భావము; "ఎలనాగ..." యువతిజనులకు తాపముకల్గించెను ; ఎలమావులను = తీయమామిడి పూఁచును. (నన = పూవు)

పొగడ, మామిడి, చంపకము, అశోకము—ఇవి వసంతమునఁ బూచును. 'మగువల......—" కాముకుల యుపభోగములకు అత్యంతము ప్రియమయినది వసంతము; 'తొగకంటి యీలువు......'యువతిజనుల ప్రణయకోపము వసంతమున చిరకాలము నిల్వను కాదు. ఈలువు = పాతివ్రత్యము, ఇటదూనము, ప్రణయ

కోపము అనునర్థమునఁ బ్రయుక్తము. చిగురుఁబోఁడుల...... = ప్రియవిరహము ననుభవించు యువతిజనులధైర్యము సన్నగిల్లెను.

చిగురుఁబోఁడి మున్నగునవి బహువ్రీహిసమాసము లనియు చిగురువంటి మేను కలది అను నర్థమున మేనుశబ్దమునకాదేశముగ బోఁడిశబ్దము వచ్చెననియు బాల వ్యాకరణము. చిగురువలె బోఁడి = మనోజ్ఞురాలు అని యర్థమనియు, ఉపమాన పూర్వ పదకర్మధారయ మనియు ప్రౌఢవ్యాకరణము.

'పూవిల్తుఁడు' బహువ్రీహి; 'పుప్పొడి'-పూవు+పొడి. ప్రాతాదిచే నాద్యక్షరము శేషము, పరవర్ణమునకు ద్విత్వము.

౧౫. ప. తా. తొలుదొల్త వసంతఋతువు ఇచ్చట జనులహృదయముల మెత్త పఱచి (యవకాశము కల్పింపఁగా) పిమ్మట ప్రవేశించుటకు వీలుకల్గుటచే, మదనుఁడు పుష్పబాణములను నాటునట్లు వేయును.

అంతన్ = మెత్తపఱచినపిమ్మట, కాఁడఁగన్ - (కాఁడు-ధాతువు) - నాటు కొనునట్లు.

౧౬. ప. చనుఁగొండల బరువుచే వంగినదైన నడుము తెగిపడునట్లు ఆప్రమద నటించుచుండ, ఆపీడచేతనో యన, వేసలి, అందియలు, హారమును నడుమును రక్షింప నుద్యమించినవి. ఆయాటయెమ్మెకత్తె జడ 'ఇసీ, కౌను తెగఁబడుచుండ నాకెందులకు ఈకైసేఁత' అని విరాగముదాల్చి తన నెలవువీడి పర్యాకులమై, అల్లిన పూలదండల సొగసుఁదనమును పరిత్యజించెను; అందియలు ఆటకత్తె పాదములను పట్టుకొని సిసువక "ఆడవద్దే, పాపము కౌను తెగఁబడుచున్నది." అని తొంటికన్న ద్విగుణతరముగా బ్రతిమాలుకొని యాక్రందించుచున్నవి. మఱి హారము కంఠమందు "ఆ కౌను తెగం బడుచుండ నాడెదవా! ఆఁ" అని ఇటునటు రొమ్మును ప్రహరించుచున్నది.

మత్తాగొని యాటచేడియ ఆడునప్పుడు జడవీడి చెదరిపోవుచున్నది, అందెలు మ్రోయుచున్నవి, హారము కంపించుచున్నది, కౌ నసీయాడుచున్నది - అని భావము.

టీక. వేసలి = జడ; స్రస్తమై = జారి, ఎత్తు = పూలసరము, పోణిమి (రూ. పోఁడిమి) = అందము; అక్కునన్ = కంఠమందు; కౌను = నెన్నడుము, కుచాద్రి నమ్రము = కొండలవంటి వలుద పాలిండ్ల బరువుచే వంగినది, ఇది కౌనుకువిశేషణము; మత్త = సారాయిచే కయిపుకొన్న చేడియ.

అలంకారము.—ఇందు వేసలి స్రస్తమౌట మున్నగువానికి కారణము కాని పీడను కారణముగా సంభావించుటచే ఉత్ప్రేక్ష.

11. పం. కాసెగట్టిన = (మూ. 'బద్ధపరికరాణాం') ఆటకై నడుముఁగట్టిన, పూనికతోనున్న. కాసె = దట్టి.

12. పం. హోళీపండుగ = మదనోత్సవము. పం. 18. ద్విపదీఖండము, చర్చరి, ఇవి గీతికావిశేషములు. పం. 19. (ఖండము) = కలకండ అనుమాటచే వసంతకుని నోట నీరూరినది.

మోదకాలు = భక్ష్యవిశేషము, ('మోదకైస్తాడయ' కథాసరిత్సాగరమున సాతవాహనుని కథ) "లినేదికాకుంటే నాకెందుకిది", విదూషకుని భోజనప్రియతకు ఉదాహరణము.

పుట. 8. పం. 2. 'నర్తించితిని' 'నృతీగాత్రవిక్షేపణే' - నృత్ ధాతువునకు అంగవిక్షేప మర్థము-అంగవిక్షేపము క్రీడనమునందును పలాయనమునందును గావచ్చును గదా. పం. 9. దేవిగారు ఆజ్ఞాపిస్తున్నారు = మామూలుగా ఎల్లరతో పలుకు విధమున చేటికలు రాజుతోనుఁ బల్కురి.

పుట. 9. పం. 3. మేలుకట్టు = చాందినీ Canopy (మేలు = పైభాగమున, కట్టు = వస్త్రముకట్టు. తేనెతిండి = మధుభక్తము = తేఁటి ; బహువ్రీహి.

౧౦. ప. ఈతరువుల పగడపు మోసులఁబోలిన లేఁజివుళ్ల యెఱ్ఱనికాంతి కల్లు ద్రావిన వానిముఖ నేత్రముల యెఱ్ఱఁదనమువలెను, తేఁటితుటుముల యవ్యక్త మధుర స్వనములు వాని యొడలు తెలియని కైపుఁగూఁతలవలెను, ఈచెట్లు గాలికి కొమ్మలతో తూలుట వాఁడు మత్తుచే తోడిస్త్రీలతో (=కోమలతో) తూలియాడునట్లును, చూపట్టుచున్నవి. ఇందుచే నీ మకరందోద్యానమునందలి తరువులు మధుభక్తము లగుటచే (= వసంతర్తు ధర్మములు గలవగుటచే) మధుభక్తములో యనునట్లు (=సారాయిత్రాగినవో యనునట్లు) కైపుగొన్నవియుంబోలె భాసిల్లుచున్నవి.

టీక. వైద్రుమ = విద్రుమసంబంధమయిన. తద్ధితమున అణ్ ప్రత్యయము ; మొట్టుట = మించుట, లక్ష్యార్థము. గాసట బీసట = అవ్యక్తధ్వని ; అళుల-క్రందు-కల-అర్భటిన్ = తేంట్ల-దట్టమయిన-అవ్యక్తమధురమయిన-ధ్వనిని ; గేలిపల్కుచున్ = మించుచు ; "మహీంజముల్, మధుభక్తము లౌట, కైపుగాంచెననభాసిలున్—" అని ౪-వ పాదము నన్వయము. 'అనన్' 'కైపుగాంచెన్' తో నన్వయించును.

ఇచ్చట నుపమేయములైన మహీజములందు చివుళ్లయెఱ్ఱఁదనము, తేంట్లకలార్భటి, కొమలతోఁదూలుట అను ధర్మములు, ఉపమానమయిన మధుభక్తజనము లందుండుటచే, ఉపమేయమునందు దృఢముగ సంభవించుటచే ఉత్ప్రేక్ష. మధుభక్తము లౌటచేత నా అనుటచే హేతూత్ప్రేక్ష. 'మధుభక్తము' అనుచో అది శ్లేషకలిమిచే శ్లేషానుప్రాణితము.

౧౯. ప. ఇందుదోహదక్రియలు చెప్పఁబడినవి ; పొగడపూఁవు మూలాన రాలుట-మునుపు దోహదక్రియగా సమ కర్పితములైన కల్లు గండూషములను పొగడ తరువు మఱల వెలిగ్రక్కు నటునట్లున్నది (పొగడకు కల్లు పుక్కిళ్లచే యౌవనులు తడుపుట దోహదము) "వెనుకఁజిక్కిన" ఎండలు ముదిరిన వెనుక పూచు ("గంధఫలి బల్కిక కర్ణ దపంబంది." వసు.) మద్య-తామ్ర-తరుణీముఖేందు-సంధానగరిమ=సారాయిచే నెఱ్ఱనయిన యౌవనవంతుల చంద్రునివంటి ముఖముల చేరికచే - జవ్వనులు ముఖరాగము చూపుట చంపకమునకు దోహదము. వెనుఁజిక్కి ఖూవవలసిన చంపకము దోహదముచే ముందుపూచినది. జవ్వనులు పాదములతో అశోకమును దోహదార్థము తన్నఁగా కల్గిన యందెలస్వనములను ఝుంఝుమ్మను ధ్వనులచే తేటులు అనుకరించుచున్నట్లున్నది- అశోకమునకు దోహదము జవ్వనుల పాదతాడనము.

'కాంచనమాల' వాసవదత్తకు పుట్టింటినుండి వచ్చినచెలి. వత్సరాజుతోడ వాసవదత్త పయనముయినప్పుడు ఆమె గుట్టుగాచి తోడవచ్చెను. (కథాసరిత్సాగరము)

10 పుట, 4 పం. 'దీనికవల...' దీనిదోహదము 14 పుట, పం 9 చూడుఁడు. నవమాలిక = వెన్నెలతీఁగ (శకుంతలకు ప్రియమయినది)

11 పుట. ౨౦. ప-పజ్జ (ప). పార్శ్వము-ప్రక్కన. 'కుసుమసుకుమారమూర్తి= ఇది 'బిసరుహాక్షి'కిని ధనుర్యష్టికిని విశేషణము-స్త్రీ. పువ్వువలె కోమలమయిన శరీరము కలది, (ధను) పుష్పమయము గావున సుకుమారమయినది ; వ్రతముచే గౌను సూక్ష్మతరంబుగాఁగ = (వాస) మదనపూజావ్రతశమముచే, అసలే సన్ననైన నడుము మఱింత సన్నమయినది ; (ధను) నియతముఁగ (=వ్రతముచే), కౌను = మధ్యభాగము ; సూక్ష్మతరంబు = మిక్కిలి సన్నముగానుండఁగా, ఈబిసరుహాక్షి - మకరకేతనుఁడు = మన్మథుఁడు, పజ్జఁ+ఉనిచికొన్న = ప్రక్కనుంచుకొన్న, ధనుర్యష్టియో యనంగ = వింటిదబ్బయో యనునట్లు, తనరుచున్నది. మన్మథుఁడు ప్రక్కనుంచుకొన్న ధనుర్యష్టియెట్లుండునో, ఈ వాసవదత్త ఇచట మదనపూజావిగ్రహము పజ్జనున్నప్పు డట్లుండెనని భావము. ఉత్ప్రేక్షాలంకారము.

9. పం. ఆసనగ్రహం = గ్రహమే గ్రహణము.

10. పం. నాట్యముచే కూర్చుండుట = కూర్చుంచుట నభినయించును.

౨౧. ప. తా. అప్పుడే చేసిన స్నానముచేఁ గలిగిన అపూర్వమును పవిత్రమునైన మేలి కాంతితోడను, మేలి చెంగావివన్నెతో సొగసుగ ప్రకాశించు వసనాంచలముతోడను (ఒప్పి) మన్మథుని పూజించుచు నీవు కోమలమగు లేఁత పవడపుఁదీపవలె నాకనుల కెంతయు హర్షము గొల్పుచున్నావు.

టీక. అబ్జదళ+ఆయత+నేత్రరో = (తామరరేకులవలె వెడల్పైన కన్నులు గల దానా) ఓసుందరీ ; నూతన......శోభితక్-నూతన = క్రొత్త (అప్పుడే చేసిన), మజ్జన =స్నానమువలన, ప్రభవ = పుట్టినదియు, నూత్న = అపూర్వమయినదియు, వివిక్త = పవిత్రమయినదియు, ('వివిక్తౌపూతవిజనౌ' అమ), విశిష్ట = ఉత్తమమయినదియును అగు, శోభలక్=కాంతికలిమి చేతను, ఖ్యాత...లక్, ఖ్యాత=(అందమయినదిగ) ప్రసిద్ధ మయిన, కుసుంభరాగ = కుసుమపూవు కెంజాయవంటి కెంజాయచే, రుచిర = మనోజ్ఞ మయి, పరిస్ఫురత్ = మిక్కిలి ప్రకాశించుచున్న, అంశుక+అంతలక్ = చీరయంచుల కలిమి చేతను, (నీవు) మనోజాతుని = మదనుని, నోముచుక్ = పూజించుచు, మృదుల ...కైవడిక్-మృదుల = కోమలమయిన, శైశవ = లేత విద్రుమశాఖకైవడిక్ = పగడ తీఁగవలె, (నాకు) అతుల మోదముక్ = మిక్కుటమగు సంతోషమును, కొలిపెదు=కలి గించుచున్నవు. కుసుంభరాగము = కుసుమపూవన్నె, పాంచెంగావివన్నె, కవులకు ప్రియమైనది. ఉపమాలంకారము.

౨౨. ప. కైతో = చేతితో ; కంగేళి (రూ) కంకేళి = అశోకము. నవోదయ = క్రొత్తగాఁబుట్టిన, మృదుతర = మిక్కిలికోమలమయిన, అపర — మఱియొక (అపూర్వ) కిసాలయ = (రూ. కిసలయ) చివురో, యనునట్లు, నానేత్రయుగళిని = నా రెండుకనులకు ; లాలనగొల్పక్ = ప్రీతిని గల్గించుచున్నది—చేయి చివురువలె కోమలముగ, నెఱ్ఱగనుండుట చేతను, పూజార్థము అశోకవృక్షమును దాకుటచే అంటి యుండుట చేతను ఆ యశోకముయొక్క మఱొండు మేలిచిగురో అని ఉత్ప్రేక్ష.

౨౩. ప. అనంగుఁడు = మన్మథుఁడు ; అనంగతను = శరీరము లేమిని. భవత్-కర-హేలా-స్పర్శ-ఉత్సవంబు = నీయొక్క చేయి యొక్క సవిలాస స్పర్శము అను సంతోషమును, ఎనయుక్ = పొందును. "నిజముగ" అన్నను దూఱుట అసత్యమే ; ఉత్ప్రేక్ష.

పుట. 12, పం. 9. "ఏమి ప్రత్యక్షుఁడే కుసుమాయుధుఁడు" మఱల రాజునకు కుసుమాయుధసాదృశ్యము. కుసుమాయుధుఁడనుకొని సాగరిక తాను కామింపఁబోవు రాజుపై పూవులు చిమ్ముట - ప్రణయనాటకమునకు పూర్వరంగము సొంపుగనున్నది.

పం. 13. "శుభదర్శనుఁడవు కమ్ము" రాజువిషయమున పిమ్మట నంతయు సాగరిక కోరఁదగినది. వైతాళికుఁడు = స్తుతిపాఠకుఁడు.

౨౪. ప. ఓ యుదయనమహారాజా, సూర్యుఁడు తన కాంతులెల్లఁ గోల్పోయి ఆకాశము తుదిభాగమున (= అస్తాద్రి సమీపమున) చేరఁగా, ఈసంజప్రొద్దున, కనుల పండువు సేయునట్టియు, కమలముల కాంతుల మాయించుచున్నట్టియు నీపాదములను

చంద్రకిరణములనుంబోలె సేవించుటకై నీసభయందు ఇపుడు సామంతరాజులు గుమి గూడి యున్నారు.

టీక. చమరగిరి = అస్త్రాద్రి; రుచి = కాంతి ; చారువృగ = మనోజ్ఞముగ, 'కనుపించుల,' 'సారసప్రభాహారముల' ఈరెండు విశేషణములును ఉదయనుని పాద ములకును, అబ్జుని పాదములకును సమానములు. సారసప్రభాహారములు = వత్సరాజు పాదములు సౌకుమార్యారుణత్వములయందు పద్మములకన్న మిన్నలు. (చం) చంద్రోద యము వేళ కమలములు ముగిడి కాంతిగోల్పోవును. చంద్రకిరణములు సారసప్రభాహార ములు. హేళి = సూర్యుడు. పాదము=కిరణము, అడుగు.

26. పం. తత్పూర్వము రాజును ప్రత్యక్షుడైన వత్సరాజునుగా భావించు చుండిన సాగరిక వైతాళికుడు ఉదయనా అని సంబోధింపగా ఆయనను వత్సరాజు నుగా నెఱింగినది.

28. పం. నొగులు = తపించు "తగిలిన కాలే తగులును నొగిలినకొంపే నొగు లును" (= కాలిన).

పుట. 13. పం. 1. వ్యగ్రుడు = ఆసక్తుడు ; సంధ్యాతిక్రమము = సంధ్యా కాలము గడచిపోవుట.

౨౫ ప. ఉదయగిరి-తట-అంతరితునిక్ = పొదపు కొండ చఱియను - మఱుగు పఱుపబడిన వానిని, ప్రాచి = తూర్పుదిక్కు ; యామిని నాథుక్ = చంద్రుని ; వదనపరిపాండిమము = (దిక్కు) దిఙ్ముఖములయొక్క తెల్లందనముచే ; (ప్రియు) విరహముచే గల్గిన మోము తెల్లదనముచే; హృదయస్థితుడు = (దిక్కు) (ఉదయగిరి) చఱియలో నున్నవానిని ; (ప్రియ) హృదయమం దున్నవానిని. కొండచాటున చంద్రుడున్నాడు ఇంకను ఉదయింపలేదు. అతని కాంతులు మాత్రమే పైకి వ్యాపించి యున్నవి. అట్లే ప్రియుడు హృదయమున నున్నాడు ఇంకను తత్సమాగ మాభ్యుదయము కలుగలేదు. అందుచే కార్శ్యముచే పాండిమము. ప్రాచికి ప్రియ తోను, ఉదయగిరితటమునకు ప్రియాహృదయముతోను, అందు మఱుగుచున్న చంద్రునికి — ప్రియాహృదయస్థుడగు దయితునితోను సాదృశ్యము.

పాండిమము—పాండుశబ్దముపై భావార్థమున ఇమనిచ్ ప్రత్యయము. 'యామినినాథుక్' సాధ్యసమాసము. అలంకారము ఉపమ. నాలవపంక్తిలో ఋత్వ సంబంధ యతి ;

౨౬. ప. దేవీ, చూడుము, అమృతాంశుని కాంతిని చిన్నఁజేయుం నీముఖ కాంతిని గాంచినంతనే పద్మములు సిగ్గుపడి కాంతివిహీనములై వెలవెలఁబోవుచున్నవి.

శేర్వరులగు నీపరివారవేశ్యలగానము వినినంతనే ఈ యూఁడు తేఁటికదుపులు సిగ్గుతో పూలమొగ్గలలో డాగికొనుచున్నవి.

అమృత+రుక్ = అమృతకిరణుఁడు. వేవె = తక్షణము; నాన = సిగ్గు; విచ్ఛాయతక్ = కాంతివిహీనతను; విస్మాణను=నేర్పు; నిస్తంద్రతక్—నిర్+తంద్రతక్ = తూగులేక, అనఁగా లెస్సగా, పుష్పంధయము = వ్యు పుష్పమును అన్నముగా కలది. అలఁ: ఉత్ప్రేక్ష.

## ప్రవేశకము.

కథాంశము—రాజు నవమాలికకు దోహదము చేయించును. సాగరిక చిత్రపరికరములతోడ అరఁటిచెట్ల యింటికి పోయినదని విని సుసంగత అచ్చటికే పోవును.

ధార్మికుఁడు = శ్రాద్ధసన్న్యాసి; యోగి. "దొరగారు......నవమాలికని" చూ. పుట. 10 పంక్తి. 5.

## ద్వితీయాంకము.

కథాంశము—సుసంగత సాగరికవ్రాసిన రాజప్రతిమనుచూచి ఆమె వలపు గ్రహించును, అందె సాగరిక ప్రతిమను తాను వ్రాయును. సాహిణపుఁగోతి యుడాపుడి. సాగరికా సుసంగతలు చిత్తరువు నట వదలి చీఁకటి చెట్లలోనికిఁబోవుదురు. రాజు శారికచే సాగరిక వలపు వృత్తాంతమును వినును. చిత్తరువును చూచును. సాగరికను వలచును. వాసవదత్త చిత్తరుఁబలకనుచూచి రాజుపై అలిగిపోవును.

4 పుట. చిత్రఫలకము = చిత్తరుఁబలక. వర్తిక=చిత్తరువ్రాయుకుంచె—'వర్తిక' వర్తి, Brush. దుర్లభజన ప్రార్థనాహతము = పొందుటకు సాధ్యముకాని వానిని కోరు పట్టుదల. మేనులేనివాని నారసాలథాక = అనంగుని బాణముల ధాటి. నారసము (ప్ర) నారాచము.

15 పుట. "ఈదుర్నిమిత్తము" - రాజదర్శనము-అతనిపై వలపు—ఈరెండును దుస్సాధ్యములు కావున దుఃఖకారణములు. చిత్తరువు (ప్ర) చిత్రము. వృత్తియందుఁ గడపటి వర్ణము వికల్పముగ లోపించును-చిత్తరుఁబలక. సావష్టంభముగా = ప్రయత్నముతో. 13 పంక్తి. ఇట్లె శాకుంతలమున - 'తీయమావి తప్ప మఱియేది చిగిర్చిన గురివెంద తీవకు తగును' సంవాదము. మేధావిని - శారికపేరు; వ్యు. తెలివికలది. యథాక్షరము = ఉన్నదున్నట్లు (ఒక యక్షరముకూడ వదలక.) శారికముందు రాజునకీవృత్తాంతము సర్వమును తెలుపునని సూచింపఁబడినది.

16 పు. 22 పం. మఱల రాజునకు మదనునితో సామ్యము. గేయము = పాడఁదగినది. గళముపట్టెను = మాటకు అర్థము గొంతుపట్టుకొనుట—ఎక్కువగ బాధిం

చుట లక్ష్యార్థము. ఉసురు తక్కి = ప్రాణమువదలి. విరాళి = వియోగవ్యథ, వక తుణము = దుఃఖముతో.

౭౮. వ. రాజుగుఱ్ఱపుసాలయందలి పెంపుడుకోతి మెడకుఁగట్టియున్న బంగారు గొలుసును త్రెంపికొని తెగఁగా మిగిలిన గొలుసుసు-మెడనువ్రేలుచున్న దానిని-ఈడ్చికొనుచు. దాని కాలిగజ్జెలు మ్రోయ ఆకులులై యశ్వపాలకులు దానిం బట్టుటకు వెన్నంటి బరువిడుచుండ వేవేగ ద్వారములనుదాటి స్త్రీలను భయపెట్టుచు అంతఃపురములోఁ జొచ్చెను.

టీక. దారితశిష్ట = త్రెంపఁగా మిగిలినది ; కంఠగ = మెడనంటుకొనియున్నది; అధఃస్థిత = క్రిందికి వ్రేలుచున్నది. ఈ మూఁడును హైమశృంఖలకు విశేషణములు. దూటుచు = చొచ్చుచు ; ఉదారరణత్ పదకింకిణీకము = హెచ్చుగా మ్రోయుచున్న కాలిమువ్వలు గలది. అను విద్రవత్ - ఆకులిత - అశ్వపాలము = వెన్నంటి పరువిడుచున్న కలతనొందిన అశ్వపాలురు కలది. సాహిణము = గుఱ్ఱపుసాల, సాహిణపుకపి - షష్ఠీతత్పురుషసమాసము. "కర్మధారయంబులందు మువర్ణకంబునకుఁ బుంపులగు" అను సూత్రమున 'కర్మధారయంబులందు' అను బహువచనప్రయోగము అన్యత్రకూడ కొన్నిచోట్ల పుంపాదేశములు కలుగునని సూచించుచున్నది.

రాజుల యశ్వశాలలయందు కోతినికట్టిపెట్టుట ఆచారము. పశ్చిమదేశముల యందును ఇట్టి ఆచారమున్నట్టు King Robert of Sicily అనుకథ చేఁ దెలియును. అందు సాహిణములోకపితో డ విదూషకుని భోజనము వర్ణితము. ఇందుకుఁ బ్రమాణము,-

* "'పరటం వారయే ద్వత్నాత్ప్రవిశ న్తం హయాలయే
మన్దురాగ్రే తథాధార్యోర క్తవక్త్రో మహాకపిః" ఇతి నకుల ఆపి''' అని శార్ఙ్గధరుఁడు.

ఇత ఇతః పరేషామశ్వానాం కేశకల్పనాక్రియతే. అయమపరః పాటచ్చర ఇవ దృఢబద్ధోమన్దురాయాం శాఖామృగః" మృ. క (iv)

ఇచటకోతి తప్పించుకొని యంతిపురములోనికిఁ బాఱుచుండ, దానిని పట్టుకొనుటకై అశ్వపాలురు వెంటఁ బరువెత్తిరి. దారితశిష్టకంఠగ = కంఠేకృత్తావశేషమ్. అని మూ. పా.

౭౯. వ. ఇందు వామనాదిశబ్దముల వ్యుత్పత్త్యర్థములు గ్రహింపఁబడినవి. వామనుఁడు = పొట్టివాఁడు. కంచుకి = కంచుకము (పెద్దయంగీ) కలవాఁడు ; కిరాతకులు = (కిరమ్) గ్రామసీమను (అతన్తి) తిరుగువారు. కుబ్జులు = మరుగుజ్జులు, త్రుంపటచే మఱియుం కనంబడనంతటి పొట్టివారైరి.

* శాస్త్రులవారి జ్ఞాపిక.

"అంతఃపురమునందు గుజ్జులు, షండులు, కిరాతులు, మ్లేచ్ఛులు, ఆభీరులు, శకారులు, మరుగుజ్జులు, లోనగువారు సహాయులు" సా. ద.

చీఁకటి చెట్లు=కానుఁగుచెట్లు. పెరుగుకూటియూనపోతు మూ. దధిభక్తలంపటః.

17 పుట. 23 పం. వసంతకుని రూప సౌభాగ్యము.

26 పం. ఏలినవారి పార్శ్వవర్తికావున జూడఁదగినవాఁడు.

18 పుట. రాజు ఇచట దోహదక్రియచే పూచిన నవమాలికాలతను మదనార్తింబొందుచున్న తనప్రియా విశేషముగ నుత్ప్రేక్షించుచున్నాఁడు. (లత) పాండువును = తెల్లనిదియు, వనజ్యోత్స్నకావున; (కాంత) విరహబాధచే పాలినదియు, (ల) స+ఉల్ (=ఉద్గత) + కలిక = పైకి పొటమరించిన మొగ్గలతోఁగూడినది (కాంత) ఉత్కంఠకలది ; ప్రాప్తజృంభ = (ల) వికసనముపొందినది. (కాం) మదనార్తిచే ఆవులింతలు గలది. అవిరళశ్వసన+ఉద్గమ+ఆయాసిత+ఆత్మ = (ల) ఎడతెగనిగాలి సోకుడులచేత బాధింపఁబడిన (బడలిన) మేనుకలది (కాం) తెంపులేని నిట్టూర్పుల యావిర్భావముచేత బడలిన శరీరముగలది ; అయినట్టిదీనిన్, లతన్ = ఉద్యానలతను, కంతుయుతలాలినకిఁబోలెన్ = మదనార్తితోఁగూడిన (దేవికన్న) వేఱైనప్రియనుఁబోలె, కనుచు = చూచుచు, దేవిముఖమునన్, కినుక కెంపు = కోపారుణిమను, పొనరిచెద = కలిగించెదను.

ఇచట దోహదవశమున రాజునవమాలిక పుష్పించినది. రాణీమాధవి పుష్పింపలేదు. అందుచే రాజు తన నవమాలికనుచూచి సంతోషించినపుడు దేవికి కోపము కలుగుటనైజము. ఆకినుక - రాణికన్న వేఱుకాంత రాజునువలచి యతనిచే చూడఁబడినపుడు దేవికి కలుగు నాగ్రహముతో బోల్పఁబడినది.

ఇందు తుల్యవిశేషణములచే చెప్పఁబడిన నాయికాదర్శనవృత్తాంతము సాఁగరికను రాజుచూచినపుడు వాసవదత్తకు కలుగఁబోవు కోపమును సూచించుటచే నిది పతాకాస్థానము.

ఉపమాలంకారము-సాధారణ శ్లిష్టవిశేషణములచే సాధర్మ్యము నిర్వహింపఁబడెను.

౩౧. ప. ఇందు వరుసగ మూఁడువాక్యములయందు మణిమంత్రౌషధముల ప్రభావములు దర్శితములు.

కలనన్=యుద్ధమునందు. పన్నగంబులు = పాములు. దాకొవె = దాగికొనవా ? రామానుజ, వీరవానరభటాదులు = లక్ష్మణుఁడును, వీరులగు వానరభటులును, మూర్ఛితులగువారు, మేఘనాద-ఆహతుల్ = ఇంద్రజిత్తుచే కొట్టఁబడినవారు, బలు = శ్రేష్ఠమైన, అని = మూర్ధాని, అనిర్హ్రాది = ప్రతిధ్వని లేనివి. శారిక=గోరువంక.

కొండెగాండ్ల హృదయంబులాగున, కుటిలము. చూ. భరతవాక్యము 'ఖలవాగ్దుర్జయ వజ్రలేపములు.'

33. వ. కంతుబారి = కుసుమశరవ్యథ. శుక+శిశు+శారికల్ = చిలుకలు, శిశువులు, గోరువంకలు. ఇందులకు సంవాదము,

"దంపత్యోర్నిశి జల్పతోర్గృహశుకే నాకర్ణితం యద్వచ,
స్తత్ప్రాతర్గురు సన్నిధౌ నిగదత స్తస్యాతిమాత్రం వధూః,
కర్ణాలంబితపద్మరాగశకలం విన్యస్యచంచూపుటే,
వ్రీడార్తా విదధాతి దాడిమఫల వ్యాజేనవాగ్బంధనమ్." అమరుకము.

3౪. వ. ఇందు స్త్రీకిని రాజహంసికిని పోలికచెప్పఁబడినది. ఈచిత్తరువునందలి తొయ్యలి యెవరో నామానసమును హరించుచున్నది.

లీలావధూతపద్మ = (స్త్రీ) ఒయ్యారముచే తిరస్కరింపఁబడిన లక్ష్మిగలది. (హం) క్రీడయందు కదలింపఁబడిన తామరలుగలది; పక్షపాతంపుపేర్మి = (స్త్రీ) స్నేహానువర్తిత్వము యొక్క అతిశయము. (హం) ఱెక్కల కదలిక యొక్క అతిశయము; చిత్రగత = (స్త్రీ) చిత్తరువునందున్నది, (హం) విచిత్రపు నడకగలది; మానసము = (స్త్రీ) మనస్సు, (హం) మానససరస్సు. హేమంతాది ఋతువులందు మానసమున మంచుఉండును. మంచుహంసలకు రోగకారి. కనుక హంసలు ఆమంచుదినములను ఇతరస్థలములందు గడపి వర్షాకాలమునందు మానససరస్సునకు పోవును. అని ప్రసిద్ధి.

3౫. వ. ఇంచు = హెచ్చైన. ఉక్కిరి బిక్కిరి చెందెను = ఊపిరియాడక కష్టపడెను. అపూర్వపూర్ణచంద్రుఁడు = అపూర్వత్వమేమనఁగా పూర్వము ధాత సృజించిన పూర్ణచంద్రుఁడాయన పీఠమైన యంబుజమును ముకుళింపఁజేయలేదు, ఇతఁడు చేసెను. అలం: ధాతకు దుఃస్థితికలిమితో లేని సంబంధము నున్నట్లు చెప్పుటచే నసంబంధమున సంబంధరూపమగు నతిశయోక్తి.

౩౬. వ. నాచూపు ఎటులోకష్టపడి యూరుద్వయిని దాటి నితంబమండలిని చాలకాలము తిరిగి యలలంబోలిన వళిత్రయముచే నెగుడుదిగుడుగనున్న కౌనుకడ నిలిచి దప్పిగొన్నదియుంబోలె ఇపుడు నెమ్మదిగ చనుఁగొండలపైనెక్కి, బాష్పాంబువులఁ గురియుచున్న నీకనులను మాటిమాటికి ఆసతో చూచుచున్నది.

టీక. ఊరుభ్రమించి = ఊరిని చుట్టివంత సేపు (చాలసేపు) తిరిగి, హారివళిత్రయీవిషమము = అందమైన మూఁడు వళులచే నెగుడు దిగుడైనది; దుర్వార-తృష = ఆపరాని దప్పి; కుచధరంబులు=చనుఁగొండలు; వారక = ఉడుగక - మాటికి; బాష్పలవవాహిని = కన్నీటి బిందువులను ప్రవహింపఁజేయుచున్నట్టిది - విలోచనద్వయి.

"ఎట్టులో (కృచ్ఛ్రాత్) - సన్నఁదనముచేతను నిలువుఁదనముచేతను, లావణ్య ప్రవాహమును దాఁటఁజేయుటచేతను మిఱు మిట్లు గొల్పుటచేతను." అని శాస్త్రుల వారి టీక.

అలం. ఒకేదృష్టి పెక్కింటియందు క్రమముగనున్నట్లు చెప్పుటచే పర్యాయా లంకారము. ప్రాణిధర్మములను అప్రాణియగు దృష్టియందున్నట్లు చెప్పుటచే సమాధి అలంకారము.

౩౯. ప. వపువు = మేను; ఘర్మాంబు పుంజము — స్వేదజల సమూహము. అలం: ఉత్ప్రేక్ష.

౩౯. ఈ లేఁదామరాకు పాన్పు రెండ కొనల బరువైనచనుదోయి యొక్కయు, గురునితంబము యొక్కయు నొత్తిడిచే వాడియున్నది. సన్నని నడుము పాన్పును తాక మిచే నడుము మాత్రము వాడక పచ్చగనున్నది. విరహబాధ తాళలేక చేతులనిటునటు విసరుటచే ప్రక్కలు చెల్లాచెదరై యున్నది. ఇట్లు పాన్పు ఈమె విరహబాధను తెల్పు చున్నది.

టీక. ఇరు గడలు (= రెండు కడలు) వృత్తియందు 'ఇరు' రెండునకు సర్వా దేశము. సమిద్ధ = గొప్ప, హరితము = పచ్చనిది. నభః ప్రతిమము = ఆకసము నంటినది. కరము = మిక్కిలి. ఈ యర్థమున నిది దేశ్యము, అవ్యయము. ఓరలకు = ప్రక్కలు. పీటతాటము = చెల్లాచెదరైనది. మృణాలినీచ్ఛదన తల్పము = తామర యాకుల సెజ్జ.

అలం: శయ్యామ్లానతా వికారములంజూచి కారణమును విరహతాపము నూహించుటచే అనుమానము.

౪౦. ప. పయ్యెద (పయి + ఎద) = పైట. రూ. పయ్యద. (సంధివర్ణ వికా రము) మండలములు = వలయములు. కడిమి = అతిశయము. పాలిండ్ల దండితనము = స్తనముల వలుదతనము.

౪౧. ప. గిండి = కలశము. పసివాడు = మిక్కిలివాడు. మృణాలసరము = తామర తూండ్ల దండ. అలం: "(1) సన్నని పోగునకే చోటులేకుండఁగా (2) తూడు నకు చోటెక్కడ" అని యిట్లు కైముత్యన్యాయమున నొకయర్థముచే (= 1) మఱి యొక యర్థము (= 2) సాధింపఁబడుటచే కావ్యార్థాపత్తి.

౪౨. ప. నలుమోములు - నాలుగునకు వృత్తియందు నలు సర్వాదేశము. తనదు గద్దియ = తనసింహాసనము - కమలము, కమలాసనుఁడు గావున; రుచి = కాంతి. అబ్బురము + పోయి (అబ్బురం పోయి) 'పడ్వాదులు పరమగు నప్పుడు ముపర్ణకమునకు లోపపూర్ణబిందువులగు' నను సూత్రముచే పూర్ణబిందువు. తెఱ + వా = తెఱవ. అలం: అతిశయోక్తి.

౪౩. ప. కనలు = కోపము. భామిని = కోపశీల, ప్రకరణోచితమగు సం బోధనము. రూక్షభావము = కోపభావమును; అకుంఠితము = మొక్కవోనిది, అధిక

మైనది. అమందఖేదము = అధికాయాసము. అలం : ఇందు హేతువు కోపము ఉన్నను కోపకార్యములు కలుగమిచే విశేషోక్తి.

౪౪. ప. పైదలి = స్త్రీ ; స్వేదచ్ఛద్మమునన్ = చెమట అను నెపముచేత. శీకరము = తుంపురు. అలం : రూపకము, స్వేదచ్ఛద్మము—అపహ్నుతి.

౪౫. ప. చిక్కకచిక్కక యెట్లో అదృష్టవశమున చిక్కి నాపై గాఢానురాగ మూనిన ఈకాంత ఎఱ్ఱనికాంతులసీను రత్నహారముంబోలె నేను కంఠమునఁదాల్పక మును పే (కాంతపక్షమున ఆలింగనము చేయుట, హారపక్షమున మెడనలంకరించుకొనుట) నీ తెఁవి తక్కువదనముచే జారిపోయెను.

టీక. కథితరాగ = ప్రకటింపఁబడినప్రేమగలది. (కాంత) ఎఱ్ఱనికాంతి గలది హారము ; తుదుకు+దుడుకు = తుందుడుకు = ఆలోచింపక త్వరపడుట, క్షోభము, కలఁత. 'ఇది ద్విరుక్తముగానే ప్రయోగములం జూపట్టెడు. శ. ర.

28. పు. పం. 22. ముఖము ప్రసన్నముగా నుండుటకు వాస్తవముగు కారణము సాగరికా ప్రథమదర్శనము.

29. పు. ఘుణాక్షరన్యాయము = మ్రానియందునుసి పురుగు తొలువఁగా నేర్పడిన యక్షరము. అది అక్షరాకారముగ తొలఁప వలయునని తొలఁపదు. కాని అలవోకగా నక్షరాకృతి యేర్పడును. అట్లె ఊరకవ్రాసిన చిత్తరువు అలవోకగా సాగరికాకృతిఁ దాల్చెనని భావము.

౪౬. ప. నాపై నీకు కోపము కలదో లేదో ఎఱుఁగను. కనుక లేనిచో "నన్ను దయతోఁజూడుమనుట పాడిగాదు కదా." 'ఇఁకముందు నేను అపరాధము చేయను' అందమన్న ఇపు డపరాధము చేసినట్లు ఒప్పు కొన్నట్లగును. నేను నిరపరాధిని అన్నచో నామాట అసత్యమందువు మఱియిపు డేమి పల్కిన నుచితముగ నుండునో తెలియక నేను వగచుచున్నాఁడను.

నాయము. ప్ర. న్యాయము. పొనరుపను = చేయును. పొచ్చెము = దోషము. అనాగసుఁడు = నిరపరాధి. మృష = అసత్యము.

౪౭. వాసవదత్తకు మనసులో కోపము కలిగెను. కాని ఆమె పైకి వినయము కనఁబఱుచుచు కోపమును పైకి తోఁపనీయలేదు. విదూషకుఁడు దేవిగాఢకోపమును గ్రహింపలేదు. కావుననే రాజు 'మూర్ఖుఁడా' అనుట.

వెడన్ = అల్పముగా ; అంతరశ్రుజడము = లోపలికన్నీటిచే మొద్దుపడినది ; వినీతి = వినయము ; అరణ్యరుదితము = నిర్జనస్థానమున అసహాయస్థితిలో చేసిన విలపనము, వ్యర్థమని యర్థము.

## ప్రవేశకము.

సాగరిక వాసవదత్త వేషముతో వత్సరాజు నభిసరించునని దేవిచెలికత్తె లెఱింగిరి.

30. పు. 18 పం. ('ఆకాశము) కౌశాంబికా...' ఇత్యాదికము ఆకాశభాషితము. చూ. సా. ల. ప్రతి. భట్టిని = దేవేరి.

20 పం కాంచనమాల రాణికడకు తిరిగిపోవుచు దారిలో సాగరికా వత్సరాజ సమాగమమునకై వసంతకుఁడు సుసంగతతో కలిసి చేసిన పన్నాగమును వారి సంభాషణ మూలమున నలవోకగా తెలిసికొనుచు అలసించినది. ఆవృత్తాంశము దేవితోచెప్పి ఆమెను చిత్రశాలాద్వారము కడకుఁ దెచ్చుట 3 వ యంకమున.

23. పం. సోత్ప్రాసముగా = ఎకతాళిగా. 24 పం. సంధివిగ్రహచింత - రాజనీతిలో చతురుపాయములలో సంధి (= శత్రువులతో సంధి) విగ్రహము (= యుద్ధము) అనునవి రెండు. అంటె యౌగంధరాయణుని చింత, వసంతకుఁడు సాగరికావత్సరాజులకు సంధి (సమాగమము) సమకూర్చుటకు, అందుచేఁ గలుగు వాసవదత్తావత్సరాజుల విగ్రహము (= కలహము, అలుకయుండె) పొడుటకు - ఈరెంటిని గూర్చినచింతలో (ఆలోచనలో) ఆరితేరినచేయి. ఈతార్పులను తీర్పులను నీతివిశేషములకుపోల్చి, నీతియందు సిద్ధహస్తుడైన యౌగంధరాయణునికన్న గట్టివాఁడనుట. ఉత్ప్రాసము.

25. పం. మదనిక చిఱునగవునకు కాంచనమాలా సోత్ప్రాసశ్లాఘమే కారణము.

31. పుట. 3 పం. దంట = సమర్థురాలు. ప. 10 ప్రతీకారము = అస్వస్థత తీరుచుపాయము. ప. 13. దేవిచిత్రఫలక వృత్తాంతము. ద్వి. అం. పు, 29. చూడుఁడు. పం. 14. నాచేలికప్పగిస్తూ = రాజుకంటఁబడకుండ కాపాడుమని. 'నేపథ్యాన్ని' = వాసవదత్త అప్పుడుతాల్చియున్న యలంకారములను. సుసంగతకు బహుమానము చేయుట, ఇఁకమీఁద జాగరూకతను వహించిరాజుకంటపడకుండ సాగరికను గట్టిగా కాపాడుమని. పం. 24. 'తిన్ననిది'. మూ—'అతిబుజుకాసాదేవీ' = సరళహృదయ. దంతతోరణవలభి = దంతనిర్మిత బహిర్ద్వార (= తోరణ)ముయొక్క వలభి (=వాచూరు) ఆచోటు విజనముగను, (నుండునదియు) మంచిగాలి తగులునదియునుగ నుండును.

## తృతీయాంకము.

రాజు సంకేతస్థలమున వాసవదత్తావేషసాగరికకై నిరీక్షించుట - వాసవదత్తయే వచ్చుట - రాజు ఆమెను సాగరికయనుకొని అనునయించుట - గుట్టుబయలుపడుట -

అందుకై భయపడి సాగరిక లతాపాశమున నసువులవాయ బ్రయత్నించుట - రాజు రక్షించుట - వాసవదత్త సాగరికా వసంతకుల చెఱనుంచుట.

౪౮. ప. సాగరికా సమాగమ విషయమున దేవిభీతిచే రాజునైరాశ్యము; తదుత్కంఠాతిశయమును. 3. 4. పాదములు—ఆప్రియను ఎటులో పొందియు మూఢుండవై మంచిగంధపురసమువోలె: జల్లనైన ఆప్రియురాలి కరమును నీపై చిరకాలము ఉంపనైతివిగదా! (అదియె తప్పిదము) వందురెదు = దుఃఖించెదవు. వృథా, సదా, సంస్కృతావ్యయములు ఏమార్పులను బొరయకయుం తత్సమములుగా బ్రయోగింపఁబడును. 'వృథ' మాత్రము వైకల్పికముగ హ్రస్వాంతమగును.

పొరసియు = పొందియు, కైకొనియు. చందన - ద్రవ - సుషీమము = మంచి గంధపురసము వలె చల్లనైనది. 'పొరసిఎట్టకేసి' = 'దైవవశమున నెట్లోకో తాఁదొరకియు'. ౧. అం. ఘట. ౪౯. శిలీముఖంబులు = సూదిమొన బాణములు.

పం. 8 'అహో! ఎంతయాశ్చర్యము.' ఈయాశ్చర్యకారణమే పద్యమున చెప్పఁబడినది.

౪౯. ప. తా. మనసు నైజముగనే చంచలమైనది. (అందుచే గుఱిపెట్టియేయుట దుర్ఘటము) మఱియుం బరమాణు స్వరూపమగుటచే దృష్టికగోచరము. అట్టినా మనస్సును మన్మథుఁడు ఎట్టులేసెను. అందును ఒక్కసారిగనే ఎల్లనారసములతోను ఎట్టులేసెను. ఆశ్చర్యము!

మనస్సును అణుస్వరూపముగఁ దార్కికులు చెప్పియున్నారు. శృం. నై. 3 ఆ. (౫3.) 'నలినదళాయతేక్షణమనః పరమాణువునందు.'

చలలక్ష్యవేధనము విలుకానినేర్పునకు నిదానమని—'కాదో లోలశరవ్యవేధనమహోత్కర్షంబు విల్కానికిన్.' శాకుం. ౨. అ. లోలమును, అగోచరమును, శరముతోఁ గొట్టుట, ఒక్కమాటే ఒక్కలక్ష్యమునే అన్ని శరములతోను, దాకునట్లు కొట్టుట - ధానుష్కకౌశల పరమావధి. ఇట్లు త్తరోత్తరోత్కర్షము చెప్పుట సారాలంకారము.

౫౦. ప. టీక. అలుగులు = బాణములు; చిత్తజాతుఁడు = మనసిజుఁడు; లక్ష్యులు = గుఱిపెట్టి వేయఁబడువారు - శరవ్యులు. దర్పక = మన్మథ, ఇటసార్థకము. దర్పించు (గర్వించు) వాఁడు. కామిజనున్ = కాముకుని (నన్ను) ఒంటిన్ = ఒక్కనిన్, పంచతంగాలిపితివి = 1 అయిదుగురనుగాఁజేసితివి. 2 చంపితివి. అసంఖ్య శిలీముఖంబులన్ = లెక్కలేని బాణములచేత.

తా. మన్మథునిబాణము లైదని లెక్కకలదనియు, వానికి లక్ష్యులు నాబోఁటివారలు లెక్కకెక్కువయనియు లోకప్రసిద్ధము. కాని ఓ మదనుఁడా ఈప్రసిద్ధి

నీవిషయమున తారుమారైనది. (1) నీయైదుబాణములు అసంఖ్యములైనవి ; (2) అసం ఖ్యులు లక్ష్యులు ఇప్పుడు నేనొక్కఁడ నైతిని ; (3) బాణముల పంచత్వము (ఐద గుట, మృతినొందుట నను బొందినది. ఇట్లు వైరుద్ధ్యము. పంచ = పంచభూతాత్మక మగు శరీరము మరణసమయమున పృథక్త్వమును చెందును.

వడ్రంగి ఒక్కబొమ్మనే అయిదుగాఁ జెక్కినట్లు నీవు నన్ను పంచత్వమొందించు చున్నావు. (అయిదుగా చెక్కి చంపుచున్నావు.) చిత్తజాతునిబాణముల పంచత్వము కామిజనునికిని కాముజనుల యసంఖ్యాకత్వము చిత్తజాతుని బాణములకును సంక్రమిం చుటచే విపర్యయము అలంకారము. "పంచతంగొలిపితి వొంటిఁగామిజను' అనుచో తోలుత విరోధముతోఁచి పిమ్మట పంచత్వమునకు హననార్థముచెప్పుటచే నావిరోధము నివర్తిల్లుటచే విరోధాభాసాలంకారము.

సం. 18, 19. 'నేను - ఎంతచింతింతునో' యని యన్వయము. అగ్గమైన = పాత్రమైన, గుఱియైన. 'నిందుకోపమును లోలోన నడంచుచున్న దేవి'. మూ. 'అంత ర్గూఢకోపసంరమ్భాయాః' -గానఁగుములు నిప్పు మిక్కిలి వెతవెట్టును. "అనిర్భిన్నోగభీర త్వా దంతర్గూఢఘనవ్యథః,పుట పాకప్రతీకాశో రామస్య కరుణోరసః" ఉ.రా.చ.3.అం.

౫౧. ప. వృత్తము = వృత్తాంతము; 'పల్కికొన' తనకువినరానియట్లు; ఉలిక్కి దుర్ =భయపడును. పెఱకతలర్ =అన్యసందర్భములయందు; 'సఖులు'ఇతరులు నవ్విన వారలకు తనవృత్తాంతము తెలిసియుండకపోవచ్చునుగాన భయములేదు. సఖులే నగిన తన్నుఁగూర్చియేయని వైలక్ష్యము. విలక్షభావము సిగ్గు. మఱిఁగెడుర్ = తపించును; మానసనిష్ఠభయంబు పెంపునర్ = మనసులోనున్న భయాతిశయముచే. అలం. స్వభా వోక్తి. ౧.బంతిలో ఋక్త్వసంబంధయతి.

పు 33. హృష్టుఁడు = కార్యలాభముచే సంతుష్టుఁడు. "ఇప్పుడు నాప్రియ వచనం వినడంచేత నాప్రియవయస్యుడికి ఎంత ఆనందం కలుగుతుందో అంత ఆనందం కౌశాంబీరాజ్యం రాడంచేతకూడా కలుగలేదు. ఇట్లే విక్రమోర్వశీ. 3. అం. "నా కేకాతపవారణంబిడదటుల్ ..."

'కౌశాంబి' వత్సరాజురాజధాని. చిత్రముకాదు = వింతకాదు, ఎఱింగినదే. పారితోషికము = బహుమానము. 'శుద్ధసువర్ణకడియము' - సమాసగ్రామ్యత విదూషకుని భాషలో సరిగనేయున్నది. 'మిక్కుటంపు......అడవికి పోతున్నాడు' ఈవర్ణనము ప్రకృతోపయోగి. సాగరికనుగూర్చి రాజుసంకేతమునకుఁ బోవుటకు పూర్వసూచన.

రాజు - (హర్షముతో). హర్షము పగలుముగిసినందులకు, రాత్రికదా సాగరి కను సంకేతస్థలమున కలిసికొనుట.

౫౨ ప. తా. 'ఒక్కటేచక్రము గలదియగు నీరథము లోకపరిమితమైన గొప్ప మార్గమునుగడచిపోయి త్వరగా మఱల రేపువేకువ ఉదయగిరిని చేరునట్లు దారి సాగింప

శక్తి గలదిగాదు.' అను చింతచేతనోయన సూర్యుఁడు (రెండవచక్రమును కల్పించుకొన నుద్యోగించినవాఁడై) సంధ్య క్రమక్రమముగా త్రెంచివేయఁగా మిగిలిన కిరణములె బంగారుకలుగాఁ గలదియైన దిక్చక్రమును (సూర్యునకై తనరథముకడకు) నడపుచు పడమటికొండపై నిలిచియున్నాఁడు.

టీక. లోకమితము = లోకము మేరగాఁగలది - అంతపెద్దది. సరగునన్ = త్వరగా; తరమిడి = క్రమముగా; త్రెక్కొనఁగన్ + తక్కిన = త్రెంచివేయఁగా మిగిలిన; హరిత్ + ఉరు + చక్రము = పెద్దదగు దిక్చక్రము. పెద్దచక్రమైనచో మహాధ్వము త్వరఁగా మగియును. రశ్మి = కిరణము. సూర్యునిచక్ర మేకచక్రమనుటకు - 'సప్తయుంజంతి రథమేకచక్రమ్.', 'నభస్సమాక్రామతి కృష్ణవర్త్మనా స్థితైకచక్రేణ రథేన భాస్కరః', సూర్యునిరథము బంగారుది; 'హిరణ్మయేన సవితా రథేన దేవో యాతి భువనాని పశ్యన్' అందుచే తద్రథచక్రమును తచ్చక్రారములును (అరము = ఆకు) బంగారువి. సాయంకాలము సూర్యకిరణములు స్వర్ణవర్ణములుగఁ దోఁచును.

అలం. సూర్యుఁ డస్తాద్రిపై నిల్చుటను హేతువుగాని మహాధ్వగమనచింతను హేతువుగ సంభావించుటచే హేతూత్ప్రేక్ష.

౫౩. ప. తా. 'ఓపద్మాక్షీ ఇది నాకు నియతసమయము. నే నిదే పోవలయును. నిదురించుచుండు నిన్ను మేల్కొల్పుటకు నేను ప్రొద్దుపొడుపువేళకు మఱల వచ్చెదను' అని (తనప్రియురాలైన) తామరతీఁగకు విశ్వాసము కల్గించుటకై అస్తాద్రి శిఖరముపై (కరము) కిరణమను చేయిపెట్టి సూర్యుఁడు ప్రమాణ మొనరించుచున్నట్లు తోఁచుచున్నాఁడు.

టీక. హేళి = సూర్యుఁడు. 'పద్మాక్షి' ఇది తామరతీవకు విశేషణము, పద్మములు అను కనులుగలదానా. తీవస్త్రీగను, పద్మములు తన్నేత్రములుగను ఉపమింపఁబడినవి. నిద్రితను = (ప్రియాపక్షమున) నిద్రించినదానిని, (తామర) ముకుళితను; మేల్కొల్పు = (ప్రి) మేలుకొలుపు, (తా). వికసింపఁజేయు. ప్రమాణమొనరించుట నాయికకు విశ్వాసము పుట్టించుటకు. 'అస్తమస్తమున శిరంబత్తి' గ్రుంకుకొండ శిఖరముపై కిరణమను చేయియుంచి. రాతిమీద చేయిపెట్టి ప్రమాణముచేయుట ఆచారము. * "శిలమట్టున్ నాసమట్టు శిశువుందిట్టున్"

అలం. ఇందు ప్రకృతధర్మియైన హేళియందు పద్మాక్షీశబ్దగతమైన స్త్రీలింగస్వారస్యముచేతను, హేళిశబ్దగత పుంలింగస్వారస్యముచేతను, 'నిద్రితను' 'మేల్కొల్పు' 'ప్రమాణమొనరించుట' ఇత్యాది చేతనవ్యాపారములచేతను 'పద్మాక్షి' 'కరము' అను శబ్దములందలి శ్లేషమహిమచేతను, ప్రియను ఆశ్వాసించుటకై ప్రమాణమొనరించు సత్ప్ర

---

* శాస్త్రులవారి జ్ఞాపిక.

కృతనాయకవృత్తాంతము తోఁపింపఁజేయఁబడుచున్నది కావున సమాసోక్త్యలంకారము; ఇట ప్రమాణము సంభావితముకావున నుత్ప్రేక్ష, సమాసోక్త్యనుప్రాణితము.

సూర్యాస్తమయము క్రమముగ వర్ణితము. 'వేడివెల్గులభగవానుఁడు', పిమ్మట 'సంజత్రెళ్ళుగానఁగెఁ దక్కినరశ్ములు' పిదప 'అస్తమస్తమున కరంబత్తి' ఇట్లు కిరణముల క్రమనిర్యాణము; పిమ్మట చీఁకటి క్రమముగా అవరించుట వర్ణింపఁబడినది.

శోభనముగాఁబల్కినావు = లెస్సగాఁ బల్కినావు. చీఁకటివర్ణనము,—తత్పూర్వము విరళములుగా నుండిన చెట్లబంతులు - ఇప్పుడు చీఁకటిబలుపుచే నడిమిప్రదేశములు కానరాక పోఁగా - నంతటను చెట్లున్నట్లె తోఁచుచున్నవి. దట్టముగా ఖురద పూసికొని మఱింత నలుపెక్కిన కారుదున్నలయు, కారడవి పందులయు, నలుపు పంటి నలుపు చీఁకటి ముత్తములు దిక్కులకుఁ గల్గించుచున్నవి. అందుచే నంతటను నలుపై దిక్కులు వేర్వేఱుగాఁ దోఁపలేదు. దున్నలు పందులు కదలుచున్నట్లు చీఁకట్లు వ్యాపించుట.

౩౪ వ. నీలకంఠుని కంఠనైల్యమునకన్న నల్లనైనచిమ్మచీఁకట్లు మొదట తూర్పు దిక్కును, పిమ్మట పడమటిదిక్కును అవరించును; తర్వాత క్రమముగా కొండలు, చెట్లు పురములు, అను విభాగములఁ గప్పివేయును; పిమ్మట జనులకు కన్నులున్న ప్రయోజనము పోఁగొట్టును.

టీక. భిద = భేదము ; హరగళద్యుతి = శివునికంఠకాంతి; లాతికడ = తూర్పుగాక మిగిలినదిక్కు - పడమటిదిక్కు ; తూర్పు పడమరల చీఁకట్లు ముంచుకొనఁగా నుత్తర దక్షిణములు మిగిలియుండవు ; మోహరపుటిరులు = దట్టమగుచీఁకట్లు ; కెరలు= ఉత్సహించు, మీఱుఁజూచు చీఁకటిరాత్రులు అభిసరణయోగ్యములు. ఇట దద్వర్ణనము అప్రయోజనమునకే చేయఁబడినది. అలం: స్వభావోక్తి. కడకటి పాదమున నుపమ.

౩౩. వ. కన్నుగానరాని చీఁకటిలో పూలచెట్ల గంధమునుబట్టి దారి తెలిసికొనుట. వాటి = వీథి, చాలు; నిర్గుండి = వావిలి; జీబైన = దట్టమైన ; కదంబపాళి = కడిమిచెట్లసమూహము. 3. 4. పాదములు,—ఇట్లు (ఉదితాఘ్రాత... చే) తెలియఁబడు వేర్వేఱుగంధముల నాఘ్రాణించుటచే చెట్లనుపలక్షించుకొని (తమోద్రిక్తగ్యా...తక్) చీఁకట్ల కెట్టింపుఁదనముచే క్రమ్మఁబడిన ఈదారిని స్పష్టముగాఁ దెలిసికొంటిని. మాధవీ మండపము సంకేతస్థానముగాన మనోహరము.

35. పు. మనశ్శిల = మణిశిల. 'దేవివేషమువేసికొన్న సాగరికని' ఒకవేళ రాజు వేషసాదృశ్యముచే వాసవదత్తనుగా భావించునేమో అని హెచ్చరింత. 'బృహస్పతి బుద్ధి విభవాన్ని పరిహంసిచేవాఁడు' కదా వసంతకుఁడు.

౩౬. వ. ప్రాంతచెలువ కాలముసాగఁగా, సిగ్గెడలఁగా ప్రేమవిశదదృష్టిని చూచుచు, కంఠాశ్లేషముచేయును, కౌఁగిట నిల్చును. మఱి క్రొత్తచెలువ భయకారణమున నింతొక్క-

టిరయుఁ జేయదు. అట్లయినను కామిజనునికి ఆముద్ధరాలిపై పక్షపాతము, తనయిల్లాలిని కనుఁబ్రామియైనను నూతనప్రియనుగూడ నతఁడు వేడుకపడును.

నిశ్చితస్థలము = సంకేతస్థలము. ప్రేమవిశదదృష్టి = ప్రీతి చక్కఁగా తెలియ వచ్చుచున్న చూపు. నయము న = మంచిమాటలతో (భయముదీర్చి) చక్కఁబట్టినను = కౌఁగిటఁజేర్చినను, కామిని = కాముకురాలు. (మనసులోనే మా ప్రేమయున్నది, కాని క్రొత్తదనపుఁగారణము చేఁ బ్రకటింపజాలదు.)

ఇట నాయిక ముగ్ధ:— "ప్రథమావతీర్ణయౌవన మదనవికారయు, రతియందు ప్రతికూలయు, మానమందు మృదువును, సమధికలజ్జావతియు ముగ్ధ" సా. ద.

అభిసారిక:— "తాను మదనవశంవదయై కాంతుని తనకడకు రప్పించుకొనునో, లేక తానే అతనికడకుం బోవునో ఆనాయిక అభిసారిక"— సా. ద.

'ఈవృత్తాంత మేమేని దేవికి వాసవదత్తకు ఎఱుకపడియుండునా" రానున్న యాపదకు పూర్వసూచన, అభిసరించు = అభిసారికావృత్తి నవలంబించు = సంకేతస్థలమునఁ బ్రియునిఁజేరు.

పు. 36. 'ముసుఁగిడుకొన్నవాఁడు' గుఱుతు తెలియకుండుటకు. సన్న = సైఁగ (ప్ర) సంజ్ఞ.

అపవారించి = మఱుగుగా. హతాశుఁడా = చెడిబ్రదికినవాఁడా, ఇది తిట్టు. 'ఈమాట మరపకు'—వాసవదత్తను 'సాగరికా' అని తార్చుమాట— 'దీనివిషఫలముల ననుభవింతువులే' అని భావము.

"త్వరగాపద. చంద్రుఁడు ఉదయిస్తున్నాడు." వెన్నెలలో నెవరేని గుఱుతింతురు; వాసవదత్త చేటికలు చూచిన కష్టము. అందుచే త్వర. "మృగలాంఛనుఁడా" చంద్రునిలోని మచ్చను కొందఱు జింక అందురు. ("సారఙ్గం కనిపిచ్చు సంజగరిరే" బిల్హణుఁడు.) రాజు తన్ను వెన్నెలకాంతిలో గుఱుతించునని వాసవదత్తభయము. అట్టిచో దొంగను సొత్తుతోఁబలె రాజును సాగరికతోఁ బట్టుకొన వీలుండదుకదా.

గీ. ప. ఇంచువిల్తునిశిఖి = మదనాగ్ని, ఇంచువిల్తుఁడు = ఇంచు (=చెఱకు) విల్తుఁడు (=విల్లుగాఁగలవాఁడు) బహువ్రీహిసమాసము. సమాసాంతకార్యము చూడుడు. బా. వ్యా. సమాస. ఇట్టివే, ముక్కంటి, నలువ మున్నగునవి. పొందు=(ప్రియా) సమాగమము. కారు = వర్షఋతువు. నికట—ఉదక+ఆగమము = సమీపముననున్న వానరాక గలది (దినము). పుటము పెట్టెదుఁగాద"— పుటము = ఊఁకనిప్పు, పైకి తెలియక లోలోపల కుములు నిప్పు. పుటము పెట్టుట = హెచ్చుగ తపింపఁజేయుట' అని ఇటనర్థము. అంతర్గూఢత్వము ఇట నభిప్రేతము గాను. అపూర్వగరిమ = పూర్వముకన్న హెచ్చుగా; ఇది పూర్వవాక్యమునందలి "తొలుత నేపద" అనుమాటకు సమానము.

ఇందు రెండువాక్యములయందు రెండుధర్ములందు (1 ఇంచువిల్తునిశిఖ 2 నీకటో దకాగమదివసము అనువానియందు) ఉన్న ఒక్కటేసమానధర్మము (=తపింపఁజేయుట) వేఱువేఱుమాటలచే (1. ఏపదు; 2. పుటము వెట్టెడు అనువానిచే) చెప్పఁబడుటచే ప్రతివస్తూపమ అలంకారము.

బాళి = విరహము. "శిరస్సంజ్ఞ" మాటాడిన తాను బయల్పడుదునని వాసవదత్త భయము. ముగ్ధయగు సాగరికను వావిచ్చి చెప్పుటకన్న శిరస్సంజ్ఞనొసఁగుట మనోజ్ఞము. "నీవువర్ధిల్లుతున్నావు"=I congratulate you'. "భ్రూసంజ్ఞ"ఇది వసంతకుని కార్యసిద్ధ్యుత్సాహమును సంతోషమును స్వాభావికముగ ప్రకటించుచున్నది.

గిర. "కదళోదరంబులు". అరఁటిమ్రాను చల్లనిది. దానిలోపలిభాగము మఱియుం జల్లఁగనుండును.

"ఏకాంత శైత్యాత్కదళీ విశేషాః" కుమారసంభవము.

"నతిలయూరుద్యుతిఁజెందఁబూని నిజదుశ్చర్మాపనోదక్రియా
రతిఁబాఙ్గోలవపూరితోదరములై రంభేభహస్తంబులు
న్నతఱిఁ బీడెమరుద్విభూతిఁగదళీ ద్వర్గోషమాచంచలో
ద్ధతిశుండాతతిఁబాయదయ్యె, నదివో తద్వైరమూలంబిలన్"—వసు.

బిసాభిఖ్యంబులు = (బిస+అభిఖ్యంబులు) తామరతూండ్ల శోభకలవి ('అభిఖ్యానామశోభయోః' అమ) "చాంద్రమసీ మభిఖ్యామ్." కుమార. "అమృతాంశుండు (మూ. శీతాంశుః) అమృతశబ్దముచే ఇటనభిప్రేతమగు శైత్యమేగాక. ఆహ్లాదకరత్వము, సంజీవకత్వము, మొదలగు ననేకగుణాతిశయములు స్ఫురించుచున్నవి. ఇందలి యుపమానములెల్ల శైత్యప్రయోజనార్థము చెప్పఁబడినవి కావున "హ్లాదకరాఖిలాంగక" (=ఆహ్లాదముఁగొల్పు సర్వావయవములు గలది). కావుననే "మారక్రూరబాణాగ్నిచే" సంతప్తములైన రాజు నవయవముల తాపము కౌఁగిట హరింప సమర్థ. మారుఁడు (వ్యు) చంపువాఁడు, తద్బాణములు క్రూరములు. అందుచే రాజు తాపాతిశయము స్ఫురించును. "కమలంగ్రాగిన" (కమలిపోవునట్లు తప్తములైన) కావున విరహ మిఁక కొంతమాత్రమును సహ్యము గాదు, తదపనోదనము కౌఁగిఁటనే సాధ్యము, అని భావము.

వాస. "(బాష్పములతో)" బాష్పములు తనప్రియుం డన్యాసక్తుఁడైనందులకు. "అహా! ఏమాశ్చర్యము" హృదయము వఱ్ఱోకతీరున ఉన్నను తియ్యమాటలాడు రాజు చరితము ఆశ్చర్యకరము.

పుట 38. "హతాశుఁడా, ఈమాటమరవకు" "రాణి దుర్వచనము లుఁ బలుకును" అనుమాట. "నీకుతగిన ప్రాయశ్చిత్తమవుతుందిలే" అని భావము.

ఇట చంద్రోదయము రాజు సాగరికను నిర్వర్ణించుటకును, వాసవదత్త మేల్ముసుంగు తీసినప్పుడు ఆమె చక్కఁగా గుఱుతు తెలియుటకును.

"కోపించే కామిని చెక్కిలి" ఎఱ్ఱందనము సమానధర్మము - ఈయుపమానము విదూషకునకు ఆలవోకగాఁ బల్కినుగాని వాసవదత్త మోముఁజూచి కాదు. అయినను అది ప్రకృతోచితమే యైనది.

౭౯. తన కాంతినంతయు నీముఖము హరింపఁగా చంద్రుఁడందుకు ప్రతిక్రియ చేయువాఁడై కొండనెత్తమునకెక్కి ఊర్ధ్వకరుఁడై (=కిరణములను చేతులను పైకెత్తి) తపము చేయుచున్నాఁడు. అదె నీవోలల చూడుము. ఇట, తపఃఫలముగ తాను (చంద్రుఁడు) ముఖేందువునకన్న నధికకాంతినొంది, తనకాంతి నపహరించిన (=తనకన్న నెక్కుడు కాంతిగలవాఁడైన) ముఖేందువునకుఁ బ్రతిక్రియ చేయుట చంద్రుని తాత్పర్యము. ఇట్లు ప్రతిస్పర్థికి నోటువడి విజయార్థము తపమాచరించుటకు వేనవేలుగ నుదాహరణములు గలవు.

"ఊర్ధ్వకరత తపించుట" చేతులఁ బైకెత్తి తపము చేయుట తపోవిశేషము. "గిరికొననెక్కి" కొండపై తపస్సుచే ఫలము కోటిగుణముల విశేషించును. *ఇందులకు ప్రమాణము నారదీయమునందు:—

"శివస్య సన్నిధానేచ సూర్యాగ్న్యో ర్గురో రపి
దీపస్య జ్వలితస్యాపి జపకర్మ ప్రశస్యతే.
గృహేజపం సమంవిద్యాత్ గోష్ఠేశత గుణంభవేత్,
నద్యాం శతసహస్రంస్యా దనంతం శివసన్నిధౌ,
సముద్రతీరే చ గిరౌ హ్రదే దేవాలయేషుచ,
పుణ్యాశ్రమేషు సర్వేషు జపః కోటిగుణం భవేత్."

తపించుచుండు (నేను కొల్లబోయితినే మరొయ్యా ముఖ్యో అని చేతులెత్తి) పరితపించును, తపము చేయును అనియును అర్థము. మూలమున కీపద్యము అమూల్యవ్యాఖ్యాప్రాయము. కవిహృదయము మూలవ్యాఖ్యాలకేగాక ఇతరాంధ్రీకర్తలకును గోచరించినదే కాదు.

మూ. "ప్రియే, పశ్య,
ఆరుహ్య శైలశిఖరం త్వద్వదనాపహృత కాంతిసర్వస్వః
ప్రతికర్తుమివోర్ధ్వకరః స్థితః పురస్తాన్నిశానాథః.

ఇందు 'ఊర్ధ్వకరః స్థితః' అను వాక్యమునకు కొందఱు అక్షరార్థముతోనో అపార్థముతోనో తనివిఁజెందిరి.

ఒక యాంధ్రీకర్త,—

"నీదు వదనాపహృత కాంతి నిచయుఁడగుచు
దాఁ బ్రతిక్రియ చేయంగఁ దలఁచినట్టు
లెదుటఁగాన్పించుచున్నవాఁ డుదయగిరిని
కరములను జాఁచి యల్లదె కమలవైరి"

---

*శాస్త్రులవారిజ్ఞాపిక.

ఇందు "ఊర్ధ్వ" ఊర్ధ్వలోకము పట్టినది, అర్థము అధోలోకము పాలైనది.

మఱి శారదారంజనరే గారు — "The moon has lost his bright ness and becomes copper-coloured. On looking round for the thief he notices his property in possession of your face. He takes the face for the thief and raises his hand to beat in retaliation—" అని వ్యాకరించినారు

'అపహృత, సర్వస్వ" అను పదములచే వీరు ముఖమునకు చౌర్యము నంటఁగట్టి చోరదండనార్థము "ఊర్ధ్వకరః స్థితః" సమర్థింపఁజూచినారు. ముఖమును చావఁగొట్టినట్లు వర్ణించుటగాని నీముఖమును చావమోదనున్నాఁడని రాజు చెప్పుటగాని సరసము కాదు. దానిచే అపహృతకాంతిసర్వస్వము మఱల లభించునా? కొండశిఖరమునెక్కుట దొంగ ఎటుపోయెనో కనుఁగొనుటకని రేగా రనిరి గాని-"పురస్తాత్ స్థితః"-ఎదుటనే యున్నవానిని కొండపైనెక్కి చూడనేల? అందుచే నిట కొండనెక్కుటకును ప్రతిక్రియకును సంబంధము మృగ్యము. కవిహృదయ మది కాదనుట స్పష్టముకదా. "ఊర్ధ్వకరః స్థితః" అనుటచేత అది తపఃక్రియార్థమని రసజ్ఞులకు స్ఫురింపకపోవదు. ఇది సరసార్థము. ప్రకృతాంధ్రీకరణమందే యుపలబ్ధము.

"ఈతఁడు పొడతెంచుచు తన జడత్వమును ప్రకటించుకొనుచున్నాఁడు." (1) జలమయత్వము. (2) మూఢత్వము. చంద్రుఁడు జలమయుఁడని ప్రసిద్ధి—

"సలిలమయే శశిని రవేర్దీధితయో మూర్ఛితాః క్షపయన్తి తమో నైశమ్" (Ray ఉద్ధరించెను).

౬౦. చంద్రుని ధర్మములెల్ల ముఖచంద్రునియం దున్నట్లు చెప్పఁబడినవి. అట్టి ముఖచంద్రము ఉండఁగా చంద్రుఁ డుదయించుట తజ్జడత్వము.

"నయనానందకరంబు"—చంద్రుఁడును - ముఖచంద్రమును చూచువారలకు ఆనందము కల్గించును. "అరవిందశ్రీని ఖండింపఁడో" చంద్రోదయమున పద్మములు ముకుళించును. అదే వాని శోభాహీనత్వము. కమలములకన్న నెక్కుడు శోభకల దగుటయే ముఖము కమలములసొంపును ఖండించుట.

"నయ......గూర్పడో," తన కనుఁగొనలను చంద్రుఁడు చూపట్టినంతనే జనులకు మదనోద్దీపనము కలుగును. ముఖచంద్రము తనకటాక్షము ప్రసరింపఁజేసినంతనే ఎవనికేని మరులు కల్గును. కందర్పుఁడు నెచ్చెలిగాఁ గలదైన నీముఖచంద్రము ఉండఁగా నింకొకచంద్రుఁ డుల్లసిల్లునా? అతనికి నమృతము కలదని గర్వమేని దొండపండువంటి నీకెమ్మోవియం దది కొల్లగా నున్నది. "ప్రయోజన మనుద్దిశ్య నమందోపి ప్రవర్తతే" అనికదా న్యాయము. అట్లుండ ముఖేందువుండఁగా తా నుదయించుట అప్రయోజకమని ఎఱింగియు చంద్రుఁడు ఉదయించుట జడత్వము కాదా?

నయన+అంత+ఈక్షణ+మాత్రక్ = కన్గొంటిచూపుమాత్రమునసే; ఉఅక్ =ఉండఁగా. స్మయము = గర్వము. సార+ఓష్ఠ+బింబము = శ్రేష్ఠమైన దొండపండు వంటి మోవి. సార="రతి సర్వస్వ మధరమ్", "మరుకోల్తలసారము మోవిబింబముక్." శాకుంతలము.

ఇచ్చట పేటిందుఁ డనుటచే ముఖేందువునకు ప్రసిద్ధచంద్రునితోడ భేదమును ప్రకటించి, ఆముఖమునకు చంద్రునితో నభేదముచెప్పక, తత్కార్యకారిత్వమును (ధర్మమును) మాత్రము చెప్పుటచేత నిది తాద్రూప్యరూపకాలంకారము.

"అన్యపుత్రాఅఁగనకు" = ప్రియా అని అనకు. "వేలోకతెపాలు" ఈ వే లోకతె సాగరిక. రాజు సాగరికనుగూర్చి "ప్రియాగరి. నయనానంద...అని పల్కెను గావున. ఇఁకపిమ్మట నీయంకమున రాజు వాసవదత్తను "ప్రియా" అని సంబోధింప లేదు. 'దేవి' అని సంబోధించెను.

౬౧. ఓదేవీ, నీయెడ నిట్లు స్పష్టముగా దోసమొనర్చి లజ్జితుఁడనై నేను తత్పరిహారముగ నీపదముల లాక్షారాగమును నాశిరముచే: దుడిచివేయుదును ; నీకు నాపై కృపకలిగిన, నీముఖచంద్రునియందు కోపోపరాగము చేఁగలిగిన రక్తిమను మాన్ప నమర్థుఁడ నగుదును. నీపాదములకు మ్రొక్కెదను ప్రసన్నవుకమ్ము అనిభావము.

లాక్షికము = లత్తుకచే కలిగినది. లత్తుకను ఉపదలు పాదములకు పారాణించుకొందురు. విలక్షమతిని = సిగ్గుపడిన హృదయముకలవాడను. ఆస్యశశి = ముఖచంద్రుడు. కోపగ్రహణజనితము=కోపమను గ్రహణముచేఁ గలిగినదైన కెంపును. ముఖమే చంద్రుఁడు. కోపమే గ్రహణము. కెడపుదును = పోఁగొట్టెదను.

అలం. రూపకము. నాయకుఁడు దక్షిణుఁడు.

"మళ్లీకోపగించునది లజ్జలేనిది" తనయందు ప్రీతియున్నప్పుడే కోపము చేయుటకు నధికారము; ఎఱిఁగి ప్రీతిలేనివానిపై కోపము చేయుట సిగ్గుచేటు, వ్యర్థము. "ఇక్కడ పశ్చాత్తాపాని కేమికారణమున్నది"? నేను వెళ్లిపోవుట ఆయనకు ప్రియమే కదటే, అట్టిప్రియము చేసి వెడలిపోయియు నేను పశ్చాత్తాపము పడుటెట్లు? తప్పు చేసినఁ కదా పశ్చాత్తాపము.

౬౨. ప్రణయ - బహూకృతి - ప్రభవ - బంధుర - రాగము = రాజు చేయు ప్రేమానువర్తనసత్కారముచే (అతనియందు వాసవదత్తకు) కలిగిన గాఢానురాగము. అకల్పితపూర్వము (అగు) కువాళము = మునుపెన్నడుఁ జేయని (పణయభంగ) దోషము. కువాళము = (ప) కువాటము (రూ) కువాడము, కువ్వాడము, కువ్వాళము.

ఆచ్చపాటుగాక్ = "ఔర నాయందంత ప్రీతిగలవాఁ డిట్లొనర్చెనే" అని. పుట 37 చూడుడు.

"దయితామణి" కావుననే దేవికి రాజు కాపట్యము దుర్భరమగుటయు, ఆచ్చపాటును. మానిని (మూ. 'అసహన') దోషము నింతమాత్రము సయిరింపని స్వభావము

పుట. 40, పం. 15. సాగరిక—[కన్నీళ్లతో నవ్వి]—సింహళేశ్వరునిపుత్రికను, వత్సరాజునకు పత్నిగాఁ బంపఁబడినదానను-అట్టి నేను పరాధీనతనై సంకేతవృత్తాంతము బయల్పడ - దేవిదండనమునకును- త దవమానమునకును పాల్పడనై- వానినుండితప్పించుకొనుటకై ప్రాణములు విడువ జతనపడవలసినదాన నైతినిగా!—అని ఈ తన సంవిధానమునకు తానే ఆశ్చర్యపడి సాగరిక నవ్వినది, ఈ విషమ పరిణామమునకు దుఃఖించినది.

పం 26. "అయ్యో నాయనా ! అయ్యో అమ్మా! నేనిప్పుడు అశరణనై మందభాగ్యను మడిసిపోతున్నాను" ఈ సాగరిక మాటలు వాసవదత్తకును సమన్వయించుచున్నవి. రాజుయొక్క ప్రణయభంగమునకు పాత్రమగుటచే వాసవదత్త 'అశరణః' మనస్వినికి ఇంతకన్న దౌర్భాగ్యము లేదు కాన- ఆమె 'మందభాగ్య'; అవసానదశలోఁ దలిదండ్రులఁ దలంచుకొనుటయు, వేషమును, రాజు భయపడుచుండినట్లే ఆ ప్రాణత్యాగోద్యమమును—ఇట్లు వేషభాషోద్యమములెల్ల సాగరికను వాసవదత్తనుగా రాజు భ్రమింప ననుకూలపడినవి.

౬౩. తా. ఓ ప్రాణేశ్వరీ, నీవు నీమెడకు పాశము తగిలించుకొనఁగనే నాకు మృత్యువు సన్నిహితమగుచున్నది. ఇట్లు నీవుద్దేశించిన ప్రయోజనము (నీమృతి) కలుగ నేరదు ; కావున ఈసాహసము మానుము.

పాశము = ఉరి. అపహత+స్వ+అర్థము = కొట్టఁబడిన (= నెఱవేఱని) తన (సాగరికయొక్క) ప్రయోజనముకలది. ఇది యత్నమునకు విశేషణము. 'ప్రాణదయిత' కావుననే నాయిక మరణప్రయత్నము రాజునకు స్వప్రాణాపాయకరముగఁ దోఁచినది, ఇష్టబంధుక్లేశము ఆత్మక్లేశమువంటిదే. కలికి = ప్రియురాలు.

అలం. పాశము కంఠగతమగుటయు (హేతువు) ప్రాణములు కంఠగతములగుటయు (ఫలము)-ఒకరియందే- (ఒక్కచోటనె) కలుగుట లోకప్రసిద్ధము. అట్లుండఁగా వేర్వేఱుచోటులందు ఆహేతుఫలములు కలిగినట్లు చెప్పుటచే అసంగత్యలంకారము.

పుట. 41. పం. 15. "ప్రభూ, నన్ను వదలు పరాధీనురాలినిగదా నేను"— నీవు దొరవు, నేను చేటిని- మనసమాగమము అసాధ్యము.

,, పం. 16. "నాకు మరణానికి ఇటువంటిసమయము మళ్లీ దొరకదు"- మఱల దొరకినపుడు మరణమునకుఁగాక వివాహమంగళమునకైనది!

౬౪. నీకంఠమునుండి ఈమాధవీలతాపాశము తీసివేయుము, నాకంఠమున నీ బాహులతాపాశము చేర్పుము అని భావము.

బాహుపాశము—పాశము కావుననే ప్రాణములను కట్టినిలుపు సమర్థము. ఆకంఠే = కంఠమందు. 'కంఠగతమైన ప్రాణంబు' నిలుప బాహుపాశమును కంఠమునవిడుట ఆవశ్యకము. సుధాంగీ-కావుననే (తరలిన) ప్రాణములను నిలుపఁజాలును. గోల = ముగ్ధ = బాల - కావుననే ఆత్మహత్యారూపమగు వెఱ్ఱిసాహసము పూనుట. తరలిన = కదలిన.

'బాహుపాశము' పాశశబ్దము ఇట శోభనార్థకము, అందమైనబాహు వనియర్థము. అట్లె కర్ణపాశము. కచాంతమైనపు డది నిచయార్థకము.

ఇది మాలినీవృత్తము. ఇది అతిత్వరితగతి కలది. కావుననే ప్రాణాపాయమును మాన్పుట మొదలగు సావేగసూచకసందర్భములందు 'నఖలు నఖలు' ఇత్యాది ప్రతిషేధాక్షరప్రారంభముతోడ మహాకవులు ప్రకరణోచితముగ ఈవృత్తమును నిబంధించిరి. ఉదా. ఆశ్రమమృగమును చంపనున్న దుష్యంతునివారించు కణ్వశిష్యునిచే "నఖలు నఖలుబాణస్సన్నిపాత్యోయమస్మిన్" అని కాళిదాసుఁడును, అట్లె నాగానందరత్నావళీరూపకములలో నాయికాకంఠపాశవిమోచన వ్యాపృతులగు నాయకులచేత శ్రీహర్షుఁడును చెప్పించిరి. ఇట్లే ఇందు చతుర్థాంకమునను ఇంద్రజాలకల్పితాగ్నినుండి సాగరికను రక్షించు వత్సరాజువాక్యము మాలినియందున్నది. ఇట్లు కవులు వృత్తౌచిత్యమును రక్షింతురు, సన్నివేశసౌభాగ్యమును పోషింతురు. శాస్త్రిమిశ్రులును తమ యాంధ్రీకరణమున నీమార్గమును లెస్సగ ననుసరించిరి.

'ఇది మేఘములేనివృష్టి' ముందనుకొనకయే కలిగినసుఖాతిశయము, a wind-fall.

"అకాలపు సుడిగాలివైన వాసవదత్తాదేవిరాకుంటె" = ఆ సుడిగాలి యీవృష్టిని కొట్టుకొనిపోయి నీతాపమును పూర్వముకన్న హెచ్చుచేయనిచో అనిభావము.

విదూషకునిభీతి సావకాశమని వాసవదత్తరాకచే నేర్పడినది.

"ఆయనకు కనఁబడకుండా వెనుకవైపువెళ్లి కంఠము కౌఁగిలించుకొని ప్రసాదింపఁజేస్తాను." వాసవదత్త అట్లు చేయలేకపోయినను-విక్రమోర్వశిలో ఉర్వశి చేసినది.

సాగ. "నీకుఁబ్రాణముకంటె ప్రియమైనదేవి" ౬౩ పద్యమున సంవాదము "కంఠగతమయ్యె ప్రాణంబు కలికినాకు, నీకుఁబాశఁబుకంఠ సన్నిహితమగుడు"

రాజు కపటదాక్షిణ్యము—"అనృతముపల్కుచున్నావు" ఈమాట చాటున నుండి వాసవదత్త వినుచున్నదని రాజు అనుకొనలేదు. విన్నదని తెలియఁగనే శైలక్ష్యము, ప్రణిపాతము, అధోముఖత్వమును అతనికి సంభవించినవి. విదూషకుఁడు తన్నుఁ గట్ట త్రాడ్డు తాఁదెచ్చుకొనుట నసిపడియున్నది. 38 కాంచ "హతాశుఁడా ఈమాట మరవకు" అను మాటలఫలము.

౬౫. ఇందు, వాసవదత్తకుఁ దాఁజూపిన యనునయములు ప్రేమను ప్రకటించునవిగ పైకి వాసవదత్తకు తోఁచినను—వానిని ఆమె మహాకులీనతకుఁ దగిన సేవాప్రకారములుగ చేసితినిగాని ప్రేమచేతఁగాదని రాజు దాక్షిణ్యమును ప్రకటించుచున్నాఁడు.

ఊరుపులన్ = నిట్టూర్పులచేత. ఉద్దవిడిన్ = మిక్కిలి, బొమలుచేరఁగన్ = కనుబొమలు ముడివడఁగా - కుటిలములుకాఁగా. మానితన్ (మానముపూనినవాఁడు మాని, వానిభావము 'మానిత') ఆమె పలుకకుండఁగా. అరహిన్ = అవిధముగా. కులజ + త + అర్హ్వాతకు=సత్కులజాతత్వమునకుఁ దగినట్లు. రస+ఉద్ధురమగు కూరిమినో = అనురాగము మెండుకొన్న ప్రేమనన్ననో, నీయెడనే=నీయందే- సాగరికయందే. గ్రుచ్చితిన్ = తిరముగ పాదుకొల్పితిని- నాటితిని. తలోదరి-తల+ఉదరి = తనుమధ్య.

౬౬. రాజు దేవికోపవ్యాపారములనుగూర్చి తలపోయుచున్నాఁడు,—

దేవిముఖము రోషాతిశయముచే కెంపుఁజూపులను కోల్పోయినది. దేవి మిక్కిలి బెదరించుటచేఁ గల్గినవెఱపుచే సాగరిక దుర్భరదుఃఖ పరవశయయ్యెను. నా

చెలికానిని వసంతకుని దేవి చెఱపాలు గావించినది. ఇందేకార్యమునకని నేను దుఃఖింతును. నేనీమూఁడుదుఃఖముల మునిఁగి దిక్కుదోఁచనివాఁడ నైతిని. ఇంకను నాకు సుఖముగలుగునా ?

కాంతాళము = కోపము. గోహరు = బెదరింపు-భయము ; నిర్భగ్న+ఆత్మ = (దుఃఖముచే) పగిలిన గుండెకలది (భరింపరాని దుఃఖాతిశయముగలది) మువ్వెత = మూఁడు+వెతలు = (మూఁడువ్యథలు) ద్విగుసమాసము. ద్విగువున కేకవచనంబు ప్రాయికంబుగ నగును.

---

# చతుర్థాంకము.

---

కథాంశము:—

విష్కంభము:—రాణి సాగరికనటనో దాచెను. రత్నావళి జీవితాశ మాని రత్నమాల నొకబ్రాహ్మణుని కిమ్మని పంపెను. అది వసంతకుఁడు రాజు నూరటకై పరిగ్రహించెను.

అం:-వసుభూత్యాదులు రాజదర్శనము చేసికొనుట- ఇంద్రజాలము- అగ్నినుండి రాజు సాగరికను తప్పించుట-రత్నావళి యభిజ్ఞానము-వివాహము.

౩౭. నేను దేవికి ఎంతయు సంతోషముగొల్పునట్లు వర్తించి ఆసక్తి కనుపఱిచినను, ఎంత తియ్యఁగఁ బల్కినను, ఎన్ని కపట శపథములు చేసినను, ఎన్నిమాఱులు పాదములపైఁబడినను, ఎంత సిగ్గు గనుపఱిచినను, సఖులు మాటి మాటికి ఎంత యోదార్చినను, దేవి రోషము మానదాయెను. కాని, ఏడ్చి యేడ్చి దేవి ఎట్టకేని తనంతతానే కన్నీటి వెల్లువలచేత తనకోపమును కడిగివైచికొనెను.

హారుసము. [రూ.] అరుసము - [ప్ర] హర్షము; హాళి=ఆసక్తి; బాస = శపథము=ఒట్టు; విలక్షత=సిగ్గరితనము. ఆక్రియను తెరలుపవాయెనుఃఅట్లు ప్రసన్నురాలిని చేయులేక పోయెను. రోదనము శోకాపనోదనమునకు అద్భుతోపాయము.

"She must weep or she will die." Tennyson.

౩౩-వ పద్యమునఁ జెప్పిన "ముప్వెతలో" మొదటిది దేవికోపము నివర్తిల్లినది.

దేవి ప్రసాదము అను కార్యమునకు రాజుయొక్కయు, చెలులయొక్కయు, సాంత్వన ప్రయత్నములు అను కారణము ఉండఁగా, రోదన రూపకారణాంతరము చెప్పుటచే ఆకార్యసిద్ధి సులువాయెను గావున సమాధ్యలంకారము.

"ఇట్లు దేవి ప్రసన్నురాలై నందున—" దేవి సాగరికను దాఁచి, తత్కారణమునఁ బ్రసన్నయైనది.

"సాగరికచింత యొక్కటే"—౩౩-వ పద్యములోని "ముప్వెత" ను రెండవ మిగిలియుండ నొక్కటే బాధించుచున్నదని రాజనుచున్నాఁడు. వసంతకుఁడు చెలి

పడుట సాగరిక కారణమున నే గావున, ఆమె విషయమున రాజు చింతదీరిన వసంతుని విషయమునను గూడ చింత అప్పుడే తీరునని అతని భావము. మఱియు నేదేది యను భూతమైనప్పుడు అది యొక్కటివోలె దుఃఖము హృదయము నంతయు నాక్రమించుటయు నైజము. సాగరికను గూర్చిన చింతకు కారణము తర్వాతి పద్యమున.—

ఉ. పద్మంపు లేరేకు వోలె మృదుతరమైన మేనుగల నాప్రియురాలు నే ననురాగంపుః గ్రొత్తలో బిగ్గ కౌఁగిలించినపుడు ద్రవీభూతయై, అప్పుడు మదనబాణము లొనరించిన రంధ్రముల మార్గమున నాహృదయమును చొచ్చినదని నాతలంపు. 'సుకుమారతనువు' కావున నే కరఁగుట. 'తామరబ గర్భ'-లేరేకు మఱింతకోమలము. ("మొగలి లేరేకును శరత్తు సెగయువోలె' శరదిజ ఇవ ఘర్మః కేతకీగర్భపత్త్రమ్. ఉ. రా. చ.) "నవరాగ" నవము కావున నే గాఢము, ద్రవీకరణ సమర్థము; "తూంట్ల వెంట" జల్లెడలో నీటివలె. మన్మథుఁడు హృదయమును జల్లెడవలె తూట్లు పడునట్లు కొట్టెను. అందుచే నామె ('దయిత') కరఁగి యతని హృదయమునఁ బ్రవేశించినది. కౌఁగిలించుకొనకపూర్వము దాఁగి దొరకలేదు. కౌఁగలించుకొనఁగ నే అపూర్వమైన యనురాగాతిశయముచేత ఆమె నీరై సులువుగా అతనిహృదయము ప్రవేశించినది "వెన్నవలెం గఱంగునలివేణాల చిత్తములు" ఇత్యాదిస్థలములందు చిత్తము కరఁగుట ఎట్లౌపచారికమో అట్లే ఇట 'దయిత' కరఁగుటయు; రెండు చోటులను కరఁగుటకు లక్ష్యార్థమున తాత్పర్యము.

ఈపద్యమున సాగరిక రాజునందతర్లీనయౌటచే 'ఒక్కటే సాగరికచింత'- అందుకే "ఏలన" అని ఇది కారణముగఁ జెప్పఁబడినది.

'నావిశ్రమస్థానము'=నాకు ఊరట ఉ. రా. చ. ("విశ్రామోహృదయస్య = మనం బెందూరడిల్లున్")

"ఎవరితోఁ జెప్పుకొని బాష్పములు విడుతును"—ఇది ఊరట. తన కష్టమును ప్రియజనముతో చెప్పుకొని దుఃఖించుట కూడ మనసునకు ఊరటగల్పించును. వసంతకుఁడు ప్రతిక్రియను ఉపదేశించుటకును, చేయుటకును గూడ సమర్థుఁడే.

18-.9. పం—"కృశించివున్నా అద్భుతమైన లావణ్యం కలవాఁడై మళ్ళీ ప్రకాశిస్తున్నాఁడు."—విదియ చంద్రునిలో కార్శ్యలావణ్యములు. చంద్రునికాంతి యెల్ల నాఁగీరలో పైకుబుకుటచే లావణ్యాతిశయము; చీఁకటి పెల్లిదముగూడ కాంతిని హెచ్చించును.

"అలతం జింత్యనిశ్రత్ర క్షాంత నయనుండై స్రుక్కియుఁన్ భాసిలున్,
గలయం జెక్కిన, హీరమాయన నలత్యుత్కొమతన్ స్వప్రభన్." శాకుం. II.
"ప్రియాయాసప్రబాధం తదపి కమనీయం వపురిదం." శాకుం. III.

వేసఁగి తాపము, మదనతాపము ఈరెండును తాపసమున సమానములయ్యు, లావణ్య సౌభాగ్యమును మదనతాపమే గల్గింపఁజాలునని కాళిదాసు శాకుం. III పై శ్లోకమునఁ జెప్పియున్నాఁడు.

20 ప. "వర్ధిల్లుతున్నావు" తన విముక్తి రాజునకు భాగ్యముగ వసంతకుఁడు గలుగుట అతని సౌన్యకారితచే.

47. పు. పం. 1. వేషము చేతనే. చూ. పుట. 44, పం. 16-17.

పం. 7. అప్రియమనఁగనే రాజునకు సాగరిక మృతించినదనియేఁ దోఁచినది. "అతిస్నేహము పాపశంకి" శా. II.

ఉ. ప. దక్షిణుఁడు (1) దక్షిణదిక్కు (యమస్థానము)ను గూర్చి పోయిన వాఁడు, అనఁగా మృతుఁడు. (2) దాక్షిణ్యము=దయఁగలవాఁడు. దక్షిణుఁడు కాని వాఁడు (ఉభయార్థములందును) అదక్షిణుఁడు.

రాజు అదక్షిణుఁడు- ప్రియ సాగరిక మృతినొందినను మృతినొందనివాఁడు, కావున సాగరికపై దాక్షిణ్యము లేనివాఁడు,

ప్రాణములను దక్షిణులరగుఁడని రాజుప్రార్థనము.—తనవలెఁ గాక, సాగరిక వెంటఁ బోయినచో వానికి దక్షిణదిశాగమనము (మృతి)యు, దాక్షిణ్యమును కలుగును.

తా. ఓ నాప్రాణములారా, నేను మిమ్ము వదలక (సాగరికతోడఁ బోవక) నిర్ద యుఁడనైయున్నాఁడను; మీరు అట్టి నను వదలి (సాగరిక వెంటఁబోయి) దయావంతుల రగుఁడు. మీరు మూఢులై తారసిల్లినచో, ఇప్పటికే దూరమేఁగిన యామదగజయానను గలసికొనఁజాలరు. ఇంతటితో వడిగాఁ బోయినచోఁ గలసికొనఁగలరు. "మత్తేభ యాన (మత్త+ఇభ+యాన)" ఇది శీఘ్రయానమునకును మందయానమునకును స్ఫోర కము; "గజ ఇవా వ్యాకులితమపి ద్రుతం గన్తుంశీల మస్యాః తస్మాత్ సతి విలంబే యుష్మాభిః ప్రాప్తుమశక్యా ఏవ"—అను శారదారంజనరే వ్యాఖ్యనుబట్టి మత్తేభ యానత్వము శీఘ్రగమన సూచకము. (కాని దీనికి ప్రమాణాంతరము మృగ్యము.) మఱి మందగమనార్థము సుప్రసిద్ధము. "మద గజరాజయాన మదమంథర బంధురయాన మానముల్" కవికర్ణ రసాయనము. ౧. ఆశ్వా. వెఱుదుఱు = కొల్లబోవుదురు; వెడఁగు= అవివేకి, జడుఁడు, మూఢుఁడు;

౭౦. ప. ఈరత్నమాల ప్రియాకంఠాశ్లేషమును పొందియుఁ వెంటనే దానిని గోల్పోయి, తనవలెనే ప్రియాకంఠాలింగనమును పొందియుఁ వెంటనే దానిని గోల్పో యినట్టి నాశరీరమును-సమానమైన కష్టదశలో నెచ్చెలివలె-ఓదార్చుచున్నది.

"సమదశలో"—రాజు శరీరమునకును, రత్నమాలకును దశాసామ్యము సాగ రికా కంఠాశ్లేషమును బొందుటయుఁ, వెంటనే గోల్పోవుటయు. "సమదశలో సఖివలె నోదార్చు" సమాన సుఖదుఃఖములు గలవారు ఆకారణమున నెచ్చెలులై అన్యోన్యము నోదార్చుకొనుటో, పరామర్శించుకొనుటో ప్రసిద్ధము.

"అడిగినవారు ప్రాణసఖు లాత్మసమల్ సమఖేద మోదనల్" శాకుం. సమఖేద మోదనత్వము స్నిగ్ధత్వము. ఇట్లే శాకుంతలమున దుష్యంతుఁడు ప్రియాకరపరిభ్రష్ట మైన యంగుళీయకమునుగూర్చి పరిదేవించెను.

పు. 47. పం. 23. రాఁజేధరించినచో అతనికి దానిని 'కనుచు స్మృతిం జెందె' వీలులేదు. రాజునకు గన్పడ్డునట్లు వసంతకుఁడు ధరించుటయుఁ, పిమ్మట వసుభూతి చూచుటగుఁ సంభవించినది. పుట. 58. 7, 8 పంక్తులు

4[2]. పుట; 7 పం. ఈవిజయవర్మ వృత్తాంతము 1 అం. యౌగంధరాయణుని విష్కంభములో కలదు. దానిని ఇట చెప్పుట భాభ్రవ్యవసుభూతుల ప్రవేశనార్థము.

రుమణ్వంతుఁడు వత్సరాజమంత్రి, సేనానియు.

20. పం. "గజతురగపదాతి" పర్వతదేశము కావున రథము లుజ్జగింపఁబడెను.

21. పం. పన్నం దొడంగితిమి=సిద్ధపడుచు సాగితిమి.

25. పం. విదూషకుని బీరము ! రాజు మనసు సాగరికయందే యుండుటచేత, "విరివిగా వినఁగోరుచున్నాము" అని రాజు మర్యాదకన్నమాటపై విజయసేనుఁడు ఎంత జెప్పునో అని, సంగ్రహింపుమనుటకుగా "నాగుండె......" అని మిషపలుకుట.

ప. ౭౧. తా. ఆ కోసలరాజు శౌర్యము దీపింప వింధ్యదుర్గమువదలి రుమణ్వంతుని ఎదిరించెను. మఱియొండువింధ్యముచేతనుం బోలె తన గజబృందముచే నతఁడు (వైరిబలముల) నలుదెసల నాక్రమించెను. అతని మదగజములు వైరి కాలి బలములను నుగ్గుచేయఁగా, రుమణ్వంతుఁడు బాణవర్షములు గురియుచుఁ, దానుకోరిన కార్యము (కోసలుఁడు వింధ్యమును వెడలి వచ్చుట) సిద్ధించుటచే విజృంభించి వేవేఁగ ఒక్కఁడే వింధ్యుని యుద్ధమున నెదుర్కొనెను.

వింజము (ప్ర) వింధ్యము; 'లాఁతి వింజముననాఁ' పూర్వమొకవింధ్యము దిక్కులు గ్రమ్ముటచే, ఇప్పుడు మఱియొండు వింధ్యముచేతనుంబోలె; గజత=గజసమూహము-వింధ్య పర్వతముతో నౌపమ్యము; ఒత్తుచుఁ = ఆక్రమించుచు; దంతులు=ఏనుఁగులు. త్రచ్చు=నుగ్గుచేయు; అంపఱ (అమ్ము+పఱ) బాణసమూహము; పేర్చి=విజృంభించి; కదిసెఁ = మార్కొనెను; రిపుఁ+ఎక్కటిఁ = అసహాయశూరుఁడైన శత్రువును.

ఇందు 'లాఁతి వింజమునఁనాఁ' ఉపమ.

2 పంక్తిలో సరసయతి.

౭౨. బొమడికములు=కిరీటములు; హత్తి = తగిలి; నెత్తులు+అగలెఁ = తలలు పగిలినవి; మొత్తుల......మఱువుల్ = ప్రహారణములచే నగ్నికణములు రాలఁగా, కవచములు మ్రోగినవి; 'గుంటియిడికోసిరి"-గుంటి=దున్నుట పైరుకోయుట మున్నగు సమయములయందు కర్షకులు చేసికొను భూవిభాగము; "గుంటియిడి" మునుముఁ పెట్టి = వరుసబెట్టి-కోసిరి= (పైరునుఁబోలె) సైన్యములనెల్ల ఖండించిరి. ఒంటరీలు (ఏ. ఒంటరీఁడు) = అసహాయశూరులు ; ఇరుపరిఁ=ఉభయసైన్యములను; (పరి=సేన-"పరిసను డించి గోగణముపట్టె" విరాట పర్వము) చదియు=చచ్చు; హొంకకారి=జెట్టికాఁడు-శూరుఁడు ; ఉక్కు మడచెను = (ఉక్కు = Steel or mettle పరాక్రమము) సంహరించెను.

యుద్ధవర్ణన తిక్కనమార్గమున సాంధ్రీకృతము. పటిమరక్షితము. వింధ్యుని 'మత్తద్విపస్థః' రుమణ్వంతుని "ఆహూయాహవముఖే" అను విశేషణములు తెలుఁగులో లుప్తములు.

16-17. పం. శత్రు విక్రమ శ్లాఘచే నాయకుని మహౌదార్యము పరిస్ఫుటము.

19. పం. ఏనుఁగు పిండు (ఏ) పిండు=సమూహము.

21. పం. తగినట్లు బహూకరింపుమని భావము.

25. పం. వాసవదత్త రాజుకడకు ఐంద్రజాలికుని పంపుటకు వాఁడు ఉజ్జయిని వాఁడను పక్షపాతము కారణము పు. 51. పం. 8. సాగరికమరులుఁనుండి రాజుమనసును వేఱొకరీతి వినోదపెట్టుటకును; ఉజ్జయిని నైంద్రజాలికుని సాధించుటకు యౌగంధరాయణుని నీతియుననే; తప్పక దర్శనమగును.

పు. 50. 2. పం. రాజునకుఁగూడ సాగరిక వర్తమానస్థితి ఇంద్రజాలమహిమచే కనుఁగొనుటకు కుతూహలముకలదుగదా.

[౨౩] ఇంద్రజాలము=మాయ, కపటమొండె; "జాలం కపటేఽప్యుక్తమ్" హలాయుధుఁడు. ఇంద్రకృతమైన జాలము=(మాయ) ఇంద్రజాలము-నేర్చినవాఁడు ఐంద్రజాలికుఁడు. శంబరుఁడు - మాయలో పేరెక్కిన యసురుఁడు. "శాంబరీభిల్లుఁడు= మాయభిల్లుఁడు". మను.

[౨౪ ప.] వాయువయస్యుఁడు=అగ్ని; పరిమధ్యాహ్నము=మట్టమధ్యాహ్నము. హల్లీసములు = నృత్యవిశేషములు. చదలన్ = ఆకాశమున; దరిసింతు = చూపెదను. (నానా. కాన్కపెట్టెదను దరిసింతు—నిన్నుఁ జాతాంతున" శాకుం. III); గురుని మంత్రమహిమ గుఱికిరాఁగ = నాగురువుపదేశించిన మంత్రముయొక్క ప్రభావమున; (గుఱికి రాఁగా=నిర్ణయమునకురాఁగా=లెక్కకురాఁగా = (ప్రకటముకాఁగా.)

(51. పు.) 4. పం. భద్రా=you good fellow.

'విజనము'—'పరజనము లేకుండ.'

పం. 14. 'గర్జిల్లుచున్నాఁడు' (=బీరములు పల్కుచున్నాఁడు) మఱి చినుకు పడునో లేదో. (=ఇతని విద్యను......గాక)

[౨౨. పద్య] చంద్ర+ఆపీడుఁడు—(ఆపీడమనఁగా శిరోమాల్యము) చందురుని సిగదండగాఁ గలవాఁడు, శివుఁడు. శార్ఙ+(విష్ణుదేవుని వింటిపేరు)+(అసి=ఖడ్గము)+'గ'=పొందిన, చతుర్హస్తుండు=నాల్గు చేతులుగలవాఁడు; ఐరావణము=ఐరావతము, ఇంద్రునియేనుఁగు. మంజీరము=అందె.

3 బంతిలో ప్రాదియతి.

పం. 27. అపవారించి=ఇతరులు విననట్లు.

'ఈతని సంతోషంతో నీకు పనివుంటే' = పుష్కలముగా పారితోషికము కావలయుననేని. ఇంద్రజాలికునికి ఇప్పుడు విదూషకుఁడుపదేశించినది పూర్వమే యౌగంధరాయణుఁ డుపదేశించినాఁడు. ఆప్రకృతము సాధించుటకే, ప్రత్యాయనార్థము ఇట మఱల చెప్పించుట, ఈ యద్భుతములఁ దొలుతఁ జూపుట.

(పు 52) పం. 4; భాభ్రవ్యుఁడు వత్సరాజు కంచుకి.

పం. 5. 'శోభనముహూర్తము'—కోసలుని విజయముచే.

పం. 6. కార్యశేషము. ఇట నాటకములో కావడినకార్యము- action. (1) మంత్రి చేయవలసిన కార్యము. (2) తానువచ్చులోపల తననీతి ప్రయోగమెల్ల

రాజునకు తేటపడుట. (3) ఇంద్రజాలముచే సాగరికను వసుభూత్యాదులు చూచి గుఱుతుపట్టుట, (4) రత్నావళీ వృత్తాంతమును రాజెఱుంగుట.

ఇంద్రజాలమునకుముందే వసుభూత్యాదులను ప్రవేశపెట్టియుండిన రాణి రాక తై "విజనము" చేయించుటతో వారెల్లరు నట నుండకపోవుదురు. ఇప్పుడు దేవి వచ్చిన తర్వాత ఆయక్కఱలేదు.

12 పం. "ఇంకొక్కటి" విదూషకుఁడు హెచ్చరించినది, సాగరికా ప్రేక్షణమునకై యౌగంధరాయణుఁడు పన్నినది, ఐంద్రజాలికాగ్ని.

14. పం. రాజు, ఇంద్రజాలమని తెలిసికాదుగాని, ఎట్టకేని తర్వాత చూడకే చూచెను.

15. పం. "నీవు వెళ్లి"—ఈ కారణమున ఇంద్రజాలము పూర్తియని మఱి చూచుటలేదని తోఁచుటకు. అట్టి తలంపే కల్గనిచో తర్వాతి యంతఃపురాగ్ని యథార్థమను భ్రాంతి కలుగదు. దాని ప్రయోజనమును నెఱవేఱదు.

17. పం. వసంతకుఁడు రాజు సఖుఁడుగాన వసుభూతికి ప్రత్యుత్థాన సత్కారము చేయ నర్హుఁడు. ఇందువల్ల రాజుద్దేశింపని ప్రయోజనము మఱొండును గల్గినది— వసుభూతికి రత్నమాలను గూర్చిన సంశయము.

20. ప. జయహస్తి = రాజు విజయమంగళసమయములం దారోహించు భద్రగజము; డిల్లవోయి=డీల్పడి ఆశ్చర్యముచే ; గీతికి = సంగీతమునకు; ఖైదయి=పరవశుఁడనై; నిర్విణ్ణుఁడనై; రాజగోష్ఠి=సామంతరాజులసభలను, సల్లాపములనొందె.

సాద్యస్క=అప్పుడుకల్గిన, విస్మయ = ఆశ్చర్యముచేత, విస్మారిత = మఱచునట్లు చేయఁబడిన, సింహళేంద్రునియొక్క, మహితైశ్వర్యుండనై=గొప్పయైశ్వర్యము గలవాఁడనై (సింహళేశ్వరుని యైశ్వర్యము గొప్పది. కాని వత్సరాజు నైశ్వర్యముకడ నది లెక్కకురాదాయెను. కక్ష=తలవాకిలి, ముందరిచావడి. అందే ఇన్నెల్లనుఁజూచుట. రాజభవనంపువాకిటి ముంగటిచావడియే ఇంత యద్భుతములతో నిండియున్నప్పుడు, రాజభవన మెట్లుండునో ; ద్వాస్థుఁడు (ద్వార్+స్థుండు) ద్వారపాలకుఁడు. సింహళేశ్వరుని మంత్రికి నింతయాఁగాని వత్సరాజ ద్వారపాలకునికి అచోట సర్వము నిత్యపరిచితమె; ద్వారప్రదేశమునందే యపూర్వములఁజూచు నద్భుతపాటుచూచి అచటి ద్వారపాలకుఁడు నవ్వు నవ్వునట్లు నేనొక పల్లెటూరివాఁడనైతిని. "గ్రామ్యుండ" పల్లెటూరివాఁడు నగరమునకువచ్చి తాను మున్నెన్నఁడుఁ జూచియెఱుఁగని వింతల నాశ్చర్యముతో నోరుదెఱచుకొని చూచుట ప్రసిద్ధము.

4. బంతిలో నిత్యసమాసాభంగయతి. "ద్వే అరే పాశ్వోఁయస్యతత్ ద్వారమ్"

ఉదాత్తాలంకారము.

22 పం ఇట వత్సేశ్వరుని ప్రభావము సింహళేశ్వరుని ప్రభావమునకన్న హెచ్చని వసుభూతిచే చెప్పించుట పు 53, పం 11, 12 లలో వతనికి రత్నమాలా విషయమున జనించిన సందేహమునకు-ఎన్నెన్నో రత్నములుండెడి యంత విభవంపు రాజగృహములలో అధగణములపోలిక అరుదుగాదు- అను సమాధానము కల్గుటకు.

౩౯. ఆనందాతిశయముచేఁగల్గిన యవస్థావిశేషములు తన ముకులితనమునకు సహజములైన యవస్థావిశేషముల మెందుఁగొల్పినవి.

హర్షముచే గల్గిన వణఁకు ముకులితనపు వణఁకును హెచ్చించినది. హర్షముచే గల్గినబాష్పము (ఆనందబాష్పము) ముకులితనముచే అరలేమందమైన చూపును మఱింత తగ్గించినది. హర్షముచేఁగల్గెడు గద్గదిక ముకులితనపుఁ గొణుకుదనముచే అరలే మోడు వారినమాటను మఱింత మోడుపడఁ జేయుచున్నది. ఇట్లు చిరకాలమునకు రాజదర్శనముచేఁ గల్గిన హర్షము ముకులితనమునకు తోడ్పడుచున్నది.

''గొణుఁగుదనము''=అక్షరములు ఉచ్చారణలోఁ జారిపోవుట. ''జడపఱుచు''= మొద్దుపడఁజేయు.

''హర్షము'' ఇష్టప్రాప్తివలన కలుగు మనఃప్రసాదము, అశ్రుగద్గదభయకంపాదికరము. సా. దర్ప.

పుట. 53-పం. 11—12. పుట. 52. పం. 22 వ్యాఖ్య చూడుడు.

ప. 20. ''వత్సరాజునకు తుల్యుఁడగు పుత్త్రుని''—వాసవదత్తకు నరవాహనదత్తుఁడుదయించి విద్యాధరచక్రవర్తి పదమునకు పట్టభద్రుఁడయ్యెను. అతఁడే కథాసరిత్సాగర కథానాయకుఁడు.

పుట. 54. పం. 14. ''మామామమంత్రి'' (మాతులామాత్యః) మామకూఁతురు వాసవదత్తకు చెల్లెలగుటెట్లో? ఆచారవిశేషమా? ప్రియదర్శికలోని 'మాతృష్వస్రుపతి'' పాఠమే ఇటనుం దగునేమొ. ''అనృతము'' పైన వసుభూతిచెప్పిన వృత్తాంతము యౌగంధరాయణుఁడు రాజునకుఁ జెప్పలేదు. అందుచే రాజు దాని ననృతమనుట.

వాసవదత్తకు తన బంధువగు సింహళేశ్వరునిమంత్రి అనృతము చెప్పుచున్నాఁడనుట ఇష్టముకాదు ; యౌగంధరాయణుఁడును మహామతియగుటచే గౌరవపాత్రుఁడు అనృతము చెప్పినాఁడనుట సుసంభవముగా తోఁపలేదు. విమర్శఫలము వ్యర్థమైనది.

''లావాణకమున నిప్పులో దేవి కాలిపోయిన దని ప్రవాద పుట్టించి''—ఈ వృత్తాంతము కథాసరిత్సాగరమున నిట్లున్నది,—''దేవిని నృపుని యుక్తిచేత లావాణకమునకు తోడ్కొనిపోవము. అదే మగధదేశమునెల్లను తాకుచుండు మనదేశము. అది వేఁటకు అనుకూలము. మనదేశము గాన అందు రాజు దేవియొద్ద లేనిసమయము సులువుగా దొరకును. అట్లు అతఁడు లేనప్పుడు అంతఃపురమునకు నిప్పుపెట్టి మన యాలోచన జరిగింపవచ్చును. దేవిని కొనిపోయి యుక్తిచేత పద్మావతియింట నుంచెదము. గుప్తముగా నచ్చటనున్నయీ మెళిలమునకు పద్మావతియే సాక్షిణి యగును.''

పం. 21. సంబంధలోపము=వత్సరాజుతో బాంధవ్యము భంగమగుట

25. ''చెల్లెలా, రత్నావళీ'' పుట. 54, పం. 14 వ్యాఖ్య చూడుఁడు.

27-28. ఓడఁగిలియు......'' ఆకారణముచే నీచెల్లెలు రత్నావళియుం సముద్రమునుండి దరిగాంచి బ్రదికియుండవచ్చును.

(పుట. 55.) పం. 5. బాభ్రవ్యుఁడు ఏమి చెప్పియుండునో? అతనికి రత్నావళి తర్వాతి వృత్తాంతము తెలిసియుండునా? యౌగంధరాయణునిపంపున నూరకుండియుండునా? కాకున్న బాభ్రవ్యుఁడు అంతకాలము వసుభూతితో నుండుటేల?

౨౦ పద్య. ఈయగ్ని పైకెగయుచున్న జ్వాలలచేత పైమేడలకు బంగారు శిఖరములయందమును కల్పించును. మిక్కిలి మండి పైకెగసి ఉద్యానవనమున చెట్లులకొనల సమూహమును మాడ్చుచు, కృతకపర్వతమునకుఁ దట్టంపుఁబొగ మొత్తములచే నీటితో నిండిన కారుమబ్బుల సైల్యమును కల్గించుచు, కాలిపోవుదుమని (యంతఃపురము లోని) స్త్రీలెల్ల భయపడుచుండ అంతఃపురమును భీతిగొల్పుచున్నది.

మేలుమచ్చులు=చంద్రశాలలు, శిరోగృహములు, మిద్దెపైయంతస్తులు; క్రేపులు =శిఖరములు turrets; అఁగు = అందము; ''బంగరుక్రేపుల'' అగ్నిజ్వాలలు ఎత్తుగఁబోవుపోను సన్నముగ వ్యాపించునవోట చేతను, బంగారువన్నెగలవి యోట చేతను; కేరి=ఎగసి, విజృభించి; కమర్చు=మాడ్చు; ధూమ్య=ధూమముల సమూహము; అవరోధము=అంతఃపురము; కేళిగిరి=క్రీడాపర్వతము. పూర్వపురాజులు విలాసవిహారార్థము ఒకకొండను నిర్మించుకొనువారు. ''కృతకాద్రికందరాకేళీనిగూహనవేళాపరస్పరావేష్టనములు'' పారిజాత (౧ ఆ)

'అగ్ర' ఎంతో యెత్తునకు వ్యాపించె ననుటకు.

౨౧. వాదు=కింవదంతి. పుట. 54. పంక్తి 19 వ్యాఖ్య చూడుఁడు.

పం. 23. దీనిచే రాణి యుజ్జయినికి సాగరికను పంపె ననుమాట కల్లయని స్పష్టము.

పం. 26. అకారణముగా=అప్రశస్తకారణమునకై, ''తత్ సాదృశ్య మభావశ్చ తదన్యత్వ న్తతదల్పతా అప్రాశస్త్యం విరోధశ్చ నఞర్థా షట్ ప్రకీర్తితాః.'' ఇట చేటి ప్రాణము రక్షించుట అప్రశస్తకారణము; శలభవృత్తి = మిడుతవృత్తి - మిడుత తన అగ్నిలో దుమికి చచ్చును. రత్నావళీ ప్రాణరక్షణార్థము పోవు రాజును తలియక వసుభూతి వారించుట. ''ఓయి సాహసం చెయ్యకు!'' విదూషకునికిఁగూడ అది ఇంద్రజాలకల్పితాగ్నియని తట్టినది కాదు.

౨౨. వెలిచెదవు=విస్తరింపఁజేసెదవు; జ్వాలోచ్చయంబుల్=మంటలమొత్తములు; కలికివియుంటిచిచ్చు=ప్రియావిరహాగ్ని.

ప్రళయాగ్ని, విరహాగ్ని-ఈ రెంటిలో రెండవదియే పటీయమనియు, అట్టి పటీయమునే ఓర్చుకొనఁజాలిన తన్ను ఇది యేమియు చేయఁజాలదనియు భావము. (ఐంద్రజాలికాగ్ని గావున రాజునకు వేడితగులలేదు.)

పు. 56. పం. 10. ''ఆర్యపుత్త్రుఁడు ఈలాగు పూనుకొన్నాడు'' రాజే పూనుకొని యగ్నిలో చొచ్చునని వాసవదత్త యనుకొనలేదు.

పం. 11. అనుగమిస్తాను=అనుసరిస్తాను.

పం. 1 . మున్నాడి=ముందుపోయి, వయస్యునితో మృతినొందుటలో తానగ్రేసరుఁడుగా నుండవలెనని.

పం. 13. రాజపుత్త్రి=రత్నావళి.

పం. 16. సంశయ-తులను-ఎక్కించితివి. సంశయమను త్రాసు నెక్కించినావు. భరతవంశప్రతిష్ఠ సంశయము పాలు చేసినావు.

పం. 17. అందఱు అగ్నిప్రవేశము నటింతురు. అందుచే నందఱును సాగరిక యున్నచోటికే చేరుదురు. ఇట్లందఱనొకచోట చేర్చుటే యైంద్రజాలికాగ్ని ప్రయోజనము.

పం. 19. నిగడిత రూ. నిగళిత=సంకెళ్లుగలది.

పం. 20. మృతిచే తనదుఃఖమును అగ్ని తుదముట్టించునని సాగరిక భావము. కాని ఐంద్రజాలికాగ్ని ఇంకొకతెఱఁగున ఆమెదుఃఖమును పోఁగొట్టినది.

(౮3 ప.) ఉద్దపడి. రూ. ఉద్దవిడి=మిక్కిలి. చనుఁబాసి = స్తనతటమునుండి జారి, ఒల్లె=స్తనాంశుకము-పయిఁట ; సంకెలియలు-ఎ=సంకెళ్లా? కాళ్లు మాటిమాటికిఁ దడఁబడుచున్నవే ఓహో, సంకెళ్లచేతనా !

సంకెలియ, రూ, సంకెల (ప్ర) శృంఖల.

పాతు నిచ్చుట = ఇచ్చోటి నుండినిన్ను (పాయఁజేయుదును) తొలఁగింతును. పాయుధాతువు ప్రేరణార్థకము పాచు, తద్దర్మమున 'పాచుదును' రూ. పాతును "స్వాప్నికమతిభ్రమయొ, యైంద్రజాలికంబొ" ఈరెంటనే ఇట్టి యలౌకసాధారణ వృత్తములు సాధ్యములు.

"ఐంద్రజాలికంబొ" అని రాజనుట అది ఇంద్రజాలమని తెలిసికాదు. "ఇది ఇంద్రజాలమే" ఇత్యాది విదూషకవాక్యములచే జరిగిపోయిన యింద్రజాలముతో రాఁబోవుకథ ననుసంధింప ననువుపడెను.

(58 పు) పం. 6-7. రాజు వాస్తవముగా సాగరికాకాముఁడై ఆమెను తెచ్చినను, "నీమాటవలన నే నిదే సాగరికను దెచ్చితిని" అని తనతో దాక్షిణ్యమునకై పల్కుటచే వాసవదత్తకు నవ్వువచ్చెను.

"సందేహమేమి, తప్పక నామాటవలననె తెచ్చితివిలే" అని ఆమె సోత్ప్రాసముగాఁ బల్కెను.

పం. 8. ఇందుకే ఇంత ప్రయత్నము

పం. 15. "ఏమి యిటఁడు నాకు తెలుపకయే ఏమేమొ చేయును" అందుచేతనే యౌగంధరాయణుని భయము. "పతికి బంధుగునె యుండు స్వచ్ఛందచారి నగుచు" 1 అం. విష్కంభ.

పం. 21. తనరాజపుత్త్రి వత్సరాజు రాణిగాఁగాక "నిగడితచరణ"గా, నొకదాసిగా, నుండుట చూచి వసుభూతి దుఃఖమాపలేకపోయెను.

పం. 22-23. రాజు ఊరకుండుటచేత, రాజు కోఱికలేకయే యౌగంధరాయణుఁడు తన్ను తెప్పించెనని, సాగరిక "చెడితిని" అనుట (1) దాస్యము (2) ఖైదు (3) నిస్సృహపడుట (4) రాజు తన్నుతప్పించియు నూరకుండుట ఇవెల్ల సాగరికకు దుఃఖహేతువులు. 'అమ్మా నాయనా' దుఃఖముచే నైశ్యరాముచేతను ప్రియబంధువుల తలంచుకొనుట.

28. "ఉన్నతవంశము వాఁడైన"—రత్నావళి మహాకులీన. "రాజు"—రాజ పుత్త్రియు.

(పు. 59.) పం. 1. ఆదిలోనే ననుకొంటిని. పుట. 45. పం. 17, 18. చూడుఁడు.

పం. 17. ఇప్పటికి యౌగంధరాయణుని "కార్యశేషము" పూర్తియైనది; కావున, ప్రవేశము.

సవతాలు (సవతి+అలు) మానినులకు సవతికన్న హెచ్చు శోకకారణములేదు. ఏలన, తాను పూర్వము అప్రతిహతముగ నేలుకొనుచుండిన ప్రాణేశ్వరప్రణయసామ్రాజ్యమున సవతి పాలుపంచుకొనుటే గాక తనప్రాభవమును డిందఁజేయనుగూడఁ జేయును. సవతి (ప్ర) సపత్ని.

౩౨. "త్రపక్"=సిగ్గుచేత; సర్వవిధముల నావ్యవసాయము ప్రభుహితపరాయణమైనను, అందుచే దేవికిని ప్రియకరమేయైనను ఆమెకు ప్రియవిరహతాపము, సపత్నీసంఘటనము ఇత్యాద్యప్రియములు మత్కృతములగుటచే ఆమెను మోము చూప లజ్జించుచున్నాఁడను.

(పు. 60) పం. 10. వసుభూతి చెప్పఁగా.

పం. 11, 12. బృహస్పతి బుద్ధిని పరిహసించు విదూషకుని బుద్ధి.

పం. 19, 20. ఇంద్రజాలప్రయోజనము.

పం. 21. రత్నావళికై కుములుచుండియు వాసవదత్త ప్రసాదమును బహూకరించుటకై తాను రత్నావళీపాణిగ్రహణము చేసినట్లు రాజు వాసవదత్తయందు దాక్షిణ్యము ప్రకటించుచున్నాఁడు.

(పు. 61) పం. 9. నీకు=రత్నావళికి, దేవీశబ్దమున్నచో సంతానమునకు రాజ్యము వచ్చును.

10. ఇందు వాసవదత్త యౌదార్యము ప్రకటము.

11. బాభ్రవ్యుఁడు తనచేతికి రత్నావళి ద్వితీయను సర్వస్వభూతానిగాఁగ్రహించె యౌగంధరాయణుని పంపున సెంతయు పరిశ్రమించెను.

[౩౩ పద్య] "సర్వభూవలయప్రాప్తి విధాత్రి" = సర్వభూమండలపు లాభము కల్గించునది.

౩౩. సకలసస్య+ఋద్ధక్ = అన్నిపంటలచేఁ గొనియాడఁదగినదానిని; ఇలవేల్పులు = బ్రాహ్మణులు; విధివత్+వృత్త+ఇష్టులక్ = శాస్త్రోక్తరీతిని చేయఁబడిన యజ్ఞములను; సాధుసంగమము=మంచివారలతోడి సాంగత్యము.

సుఖ+ఉత్సంగము+వి=సుఖముచే నతిశయించినది; ఉషుక్—ఉండును.

"ఖలతాక్-దుర్జయ-వజ్రలేపములు" ఖలులు=కొండెగాండ్రు; దుర్జయ=జయింపరాని; "వజ్రలేపమనఁగా పగిలినరాలను అంటించుటకు సిద్ధము చేయఁబడు నొకజిగురు; దానితో అదుకఁబడినవి వాటికిపోదు; అట్లే కొండెగాండ్రమాటలను ప్రభువులు నమ్ము

దురు. ఆమాటయులయందలిమోసము వారికెఱుకపఱచుటకు ఎవరికిని శక్యముగాదు. అట్టి యీ కొండెములు నశించునుగాక యని ప్రార్థన.’’

భరతవాక్యశ్లోకము రత్నావళీప్రియదర్శికల రెంటను ఒకటే. ప్రియదర్శికా భరతవాక్యపద్యము శాస్త్రులవారిది,—

ఉ. వాసవుఁడిష్టవృష్టుల నవారిగఁ బాడియుఁ బంటఁ బెంచుతన్;
భూసురులిష్టులన్ సుర సమూహములం దనియింత్రు గావుతన్;
వాసిగ సాధుసంగమము వర్ధిలఁగావుత శాశ్వతంబుగా;
నాసిలుఁ గావుతన్ ఖలుల నాల్కలు నాటెడు పాడు కొండెముల్.

భరతవాక్యము వ్యాఖ్య చూ.

“అన్తే కావ్యస్య నిత్యత్వాత్ కుర్యాదాశిషముత్తమమ్’’ అను నాలంకారిక నియమము ననుసరించి కావ్యాంతమున నుత్తమమగు నాశీర్వాదము నిబంధింపఁబడినది

ధరణికోట - వేంకటసుబ్బయ్యయు, సంగుభొట్ల - నారాయణశర్మయు
రచియించిన యీ రత్నావళీప్రభ
సంపూర్ణము.

ఓం తత్సత్.

---

# I. అనుబంధము.

## నాటకలక్షణప్రతి.

---

దృశ్యము శ్రవ్యము అని కావ్యము రెండువిధములు. అందు దృశ్యము అభినయింపఁబడును. దానికే నటునియందు రామాదిరూపము నారోపించుటచేత రూపకమని నామాంతరము. అభినయమనఁగా అవస్థను అనుకరించుట. రూపకము ఉపరూపకము అని రూపకము రెండువిధములు. అందు నాటకము ప్రకరణము భాణము ప్రహసనము డిమము వ్యాయోగము సమవకారము వీథి అంకము ఈహామృగము అని రూపకము పదివిధములు. ఉపరూపకము పదునెనిమిదివిధములు రత్నావళి నాటికయను నుపరూపకజాతిది. [కడమరూపకములకును ఉపరూపకములకును దానిదానికి చెప్పఁబడువిశేషము దప్ప సామాన్యలక్షణ మెల్ల నాటకమునకు ఎట్లో అట్లే ఎఱుంగవలయును.]

నాటికకు లక్షణము. చూ. ఉపోద్ఘాతము.

అంకలక్షణము:—అంకమున నాయకునిచరితము ప్రత్యక్షముగా చూపఁబడును, రసభావములు వెలుఁగుచుండును, శబ్దార్థములు అగూఢముగాను గద్యవాక్యములు చిన్నవిగాను ఉండవలయును, ఏదేనొక యవాంతరప్రయోజనము సమాప్తిచెందవలయును, బిందువు కొంచెము అంటియుండవలయును, కార్యములు పెక్కుగా నుండఁగూడదు బీజమునకు సంహారము కూడదు, నానాసంవిధానములు వలయును. పద్యములు మిక్కుటముగా నుండఁగూడదు. అవశ్యకకార్యములకు భంగము కలుఁగకూడదు. కథ అనేకదినములు పట్టునదిగా నుండఁగూడదు. నాయకుఁడు ఆసన్నుఁడుగా నుండవలయును. పాత్రములు మువ్వురు నలుగు రుండవలయును.

ఈవక్ష్యమాణములు అంకమం గూడవు.—దూరమునుండి పిలుచుట, చంపుట, యుద్ధము, రాజ్యము దేశము లోనగువానికి ఉపద్రవము, పెండ్లి, భోజనము, శాపము, ఉత్సర్జనము, మరణము, రతము, దంతక్షతములు సేయుట, నఖక్షతములు సేయుట, ఇట్లు లజ్జాకరములగు నితరకృత్యములును, శయనించుట, మోవియానుట, ఇత్యాదులు, నగరాదులను ముట్టడించుట, స్నానమాడుట, మైపూఁతపూసికొనుట,—ఇవి అంకమందు చూపఁగూడదు. అంకము మిక్కిలి దీర్ఘముగా నుండఁగూడదు, దేవీపరిజనాదులయు మంత్రులయు వణిజులయు భావరసోద్భవములైన ప్రత్యక్షచిత్రచరితములతోఁ గూడినదై యుండవలయు; దానియంతమున పాత్ర లందఱును నిష్క్రమింపవలయును.

రంగద్వార ప్రస్తావనాదులు కలదై బీజమును ఫలమునుగలదై ఒక యంకమున గర్భములోపల ప్రవేశించినదైన మఱియొకయంకము గర్భాంక (Interlude) మనఁబడును. ఉదా. బాలరామాయణమందలి సీతాస్వయంవరమును, ఉ. రా. చరితమందలి కుశలవ జననభాగమును, వేంకటరాయశాస్త్రులవారి ప్రతాపరుద్రీయమందు అష్టమాంకమున ఓడలో సుల్తాను మ్రోల పర్తకు లాడించినభాగమును.

నాటకమందు ముందుగా పూర్వరంగము, అటుపిమ్మట సభాపూజ, తర్వాత కవిని పేర్కొనుట, నాటకమును గూడ పేర్కొనుట, తర్వాత ప్రస్తావన. అందు నాట్య

వస్తువుకంటె ముందుగా రంగవిఘ్నోపశాంత్యర్థము నటులు గావించునట్టిది పూర్వరంగ మనఁబడును. దీని యంగములలో ముఖ్యమైనది నాంది యనునది. ఆశీర్వచనముతోఁ గూడినట్టిది దేవద్విజ నృపాదులస్తుతి నాంది యని చెప్పఁబడును. అది మంగళకరము లైన శంఖ చంద్ర కమల చక్రవాక కైరవములను వచించునదియు, ఎనిమిదేని, పండ్రెం డేని పదములు గలదియుఁ గావలయును. ప్రాయికముగా నాటకములలో నాంది యని తలంపఁబడుచున్నట్టిది పూర్వరంగముయొక్క రంగద్వారనామక మైన యంగముగాని నాంది గా దని కొందఱి మతము.

సూత్రధారుఁడు మధురములును కావ్యార్థసూచకములును అగు శ్లోకముల చేత రంగమును ప్రసన్నముంగావించి రూపకనామమును కవినామ గోత్రాదులను కీర్తింపవల యును. భారతీవృత్తి నవలంబింపవలయును. ప్రాయికముగా నేదే నొక ఋతువును ప్రస్తావింపవలయును. భారతి యనగా సంస్కృతప్రాయమును నరాశ్రయము నగు వాగ్వ్యాపారము.

సూత్రధారుఁడు నటితో నేని విదూషకునితో నేని పారిపార్శ్వకునితో నేని, కూడుకొన్నవాడై తమకార్యములనుండి యుత్పన్నములై ప్రస్తుతమును ఆక్షేపించునవైన చిత్రవాక్యముల చేత చేయు సల్లాపము ఆముఖ మనియు ప్రస్తావన యనియుం చెప్పఁ బడును.

ఏవస్తువు నాయకునికి అనుచితమేని, రసమునకు విరుద్ధమేని, అగునో దానిని వదలవలయును, వేఱువిధముగా నేని కల్పింపవలయును.

అంకములయందు చూపరానిది అయినను అవశ్యము తెలుపవలసినది యగు కథను అర్థోపక్షేపకముల చేత చెప్పవలయును. అర్థోపక్షేపకములు అయిదు—విష్కంభక ప్రవేశక చూళికాంకావతారాంకముఖములు.

విష్కంభకము భూతభవిష్యత్కథాంశములను తెలుపును, సంక్షిప్తార్థముగా నుండును, అంకమున కాదిని చూపఁబడును. అది ఒకరో యిద్దఱో మధ్యపాత్రముల చే జరుపఁబడిన యెడల శుద్ధమనఁబడును, నీచమధ్యపాత్రములచే జరుపఁబడినచో సంకీర్ణమగును. రత్నావళి I అం. మొదట శుద్ధవిష్కంభకము.

ప్రవేశకము నీచపాత్రములచే నీచవాక్యములచే చేయఁబడును. రెండంకముల నడుమ వచ్చును. మిగత లక్షణము విష్కంభమున కెట్లో అట్లే. I, II; II, III; III, IV; అంకములకు నడుమ ప్రవేశకములు గలవు.

చూళిక యనునది పరదాలోనివారు, చేయునట్టి యర్థసూచన. ఉదా. రత్నావళి లో 12, 16, 55, పుటలలో.

అంకాంతసూచిత పాత్రములు ఆయంకమునకు తెంపు లేనియట్లుగా నే పైయంక మును తొడంగుట అంకావతారమనఁబడును.

ఒకయంకములో అన్నియంకముల సూచనయు చేయఁబడునేని దానిని అంక ముఖ మందురు.

బీజ బిందు పతాకా ప్రకరీ కార్యములు అయిదు అర్థ ప్రకృతులు.

ఇంచుకగా ఉద్దేశింపఁబడి బహుప్రకారముల వ్యాపించునది ఫలమునకు ప్రథమ హేతువు బీజ మనఁబడును.

అవాంతరకథ విచ్ఛేద మొందినప్పుడు దానిని పైకథతో సంధానము చేయు నట్టిది బిందువు.

వ్యాపి యగు ప్రాసంగికవృత్తము పతాక యనఁబడును.

ప్రాసంగికమై ఏకదేశస్థమగు చరితము ప్రకరి.

ఏది సాధింప నపేక్షితమో దేనికొఱకై యారంభమో దేని సిద్ధిచే సమాప్తియో అది కార్య మనఁబడును.

ఫలార్థులు తొడంగిన కార్యమునకు అయిదు అవస్థలు:—ఆరంభ యత్న ప్రాప్త్యాశా నియతాప్తి ఫలాగమములు.

వరుసగా ఈయైదవస్థలును మున్నుచెప్పిన యర్థ ప్రకృతులతో యోగముం బొందుటచేత ఇతివృత్తము అయిదు భాగము లగును. అవి క్రమముగా ముఖ ప్రతి ముఖ గర్భ విమ ర్శోపసంహారము లని అయిదు సంధు లగును.

[సంధ్యాదుల సమన్వయము "రత్నావళీనాటికానిర్మాణము"నఁ దెలియనగును.]

---